



పసి బిడ్డకు
జీర్ణసంబంధమైన
బాధలు కలిగినప్పుడు

సౌమ్యంగా పనిచేసే

# అమృతాంజన్ గ్రైప్ మిక్స్‌చర్

బాధను అతి త్వరగా తగ్గిస్తుంది

గృహౌషధములు
తయారుచేయుటలో
తరతరాలుగా
నమ్మికకు పాత్రమైన
అమృతాంజన్ వారి
తయారీ.




కడుపునొప్పి, అజీర్ణము, వాయువు, పళ్ళు వచ్చేటప్పుడు కలిగేబాధలు మొదలైన వాటిలో దేనితోనైనా సరే, మీ పసిబిడ్డ బాధ పడుతూంటే అమృతాంజన్ గ్రైప్ మిక్స్‌చర్‌తో అతి త్వరగా ఉపశమనం కల్గించండి త్వరగా సులభంగా తిరిగి మీ పసిబిడ్డ ఆనందంగా నవ్వుతుంది.

**అమృతాంజన్ లిమిటెడ్**

OBM 3410/2 TG



రచయిత్రి సి. ఆనందారామంగారి నవలలో సమాజం నేడు కుష్ఠురోగులెదుర్కొంటున్న సమస్యలను కళ్ళకు కట్టినట్లు చిత్రించారు. తర్వాత పొలిటిక్స్‌లో నవరసాలు కార్టూన్లు బాగున్నాయి. ఇక కథలలో 'వాగొచ్చింది' కథానిక మా హృదయాలను కదిలించింది. జీవితేశ్వరికంటే బేరం ముఖ్యమనుకొనే వ్యాపారస్తులకు కనువిప్పు కలిగిస్తుందీ కథానిక. పుణ్యపురుషులు ఒక మోస్తరుగా వుంది. పజిల్సు విజ్ఞానదాయకంగా వున్నాయి.

—పర్చా పరప్రసాదరావు,
శ్రీమతి ఉమాప్రసాద్,
నేలకొండపల్లి.

మా అభిమాన రచయిత సి. ఆనందారామంగారి కలంనుండి వెలువడిన 'ఆశాజ్యోతి' నవల చాల బాగుంది.

—న్యాయపతి రమేష్‌బాబు,
విజయ కల్యాణి, విజయప్రియ,
శ్రీలేఖ, పుష్పలత, సంధ్యాకుమారి,
బరంపురం, ఒరిస్సా.

ఆనందారామంగారి 'ఆశాజ్యోతి' నవల అమందానందాన్ని అదించింది– వారి 'అంకితం' చూసిన తరువాత ఆ నవలలోని ఇతివృత్తం నిజంగా జరిగిందేమోనని భాసించింది – ప్రేమ కథలు చదివీ, చదివీ విసుగొచ్చిన వాళ్ళందరికీ ఈ రచన ఒక వెరైటీగా నిలుస్తుంది.

కథల్లో 'వాగొచ్చింది', 'చదరంగం', 'చికిత్స' చాలా బావున్నాయి. సీరియల్స్ చక్కగా సాగిపోతున్నాయి–గల్పికలు సరేసరి.

ఇంకా 'స్టాండర్డ్ జోక్స్' ఎక్కువగా వేయగలరని మనవి.

—మొహరీరు రామచంద్రరావు,
కిసాన్‌నగర్.

ఈసారి కథల్లో 'కోరుకున్నది', 'పుణ్యపురుషులు' చాలా బాగున్నాయి. మిగతా కథలు కూడ ఫర్వాలేదు. ఈ నెల నవల 'ఆశాజ్యోతి' ఏమంత సంతృప్తికరంగా లేదు. కార్టూన్స్‌లో 'పాలిటిక్స్‌లో నవరసాలు' బాగున్నాయి. మొత్తంమీద ఈ నెల 'యువ' చాలా బాగుంది.

— బి. మధుసూధనరావు,
కర్నూలు.

# ఆగష్టు నెల క్విజ్

## సమాధానాలు

1 — డి    2 — బి    3 — సి

4 — బి    5 — సి

6. యు. కె.
7. రోహిణి
8. టి. వి. శంకరమ్
9. ఇండియా
10. ఇరవైనాలుగు

ఆగస్టు నెల క్విజ్‌కు ఎవ్వరూ ఆల్‌కరెక్ట్ సమాధానాలు పంపలేదు. కాబట్టి ఆ మొత్తాన్ని సెప్టెంబరు నెల క్విజ్ కు కలపడమైంది.

సెప్టెంబరు నెల క్విజ్ బహుమతి సొమ్ము రూ. 232.

# సెప్టెంబరు నెల యువ భావపరిచయ పోటీ

## బహుమతి పొందిన వ్యాఖ్య




విజ్ఞాన ప్రగతి-
విద్యార్థి అధోగతి

— దామోజీపురపు నరసింహారావు,
తాడేపల్లి గూడెం.



మన నూతన రాష్ట్రపతి

శ్రీ నీలం సంజీవరెడ్డి

# యువ

సచిత్ర మాసపత్రిక

సంస్థాపకులు : చక్రపాణి

సంపుటి 36 | సెప్టెంబరు, 1977 | సంచిక 3

ఆరవ భారత రాష్ట్రపతిగా ఎన్నిక అయిన శ్రీ నీలం సంజీవరెడ్డిగారికి మా హృదయపూర్వక అభినందనలు. సంజీవరెడ్డిగారి ఎన్నిక చాలా విశిష్టమైనది. అన్ని పార్టీల, అన్ని వర్గాల ఆమోదంతో, పోటీలేకుండా రాష్ట్రపతి ఎన్నిక జరగడం ఇదే మొదటిసారి. హైదరాబాద్‌లో జన్మించిన డాక్టర్ జాకిర్ హుసేన్‌ను కూడా ఆంధ్రునిగా పరిగణించితే, యిప్పటివరకు ఎన్నిక అయిన ఆరుగురు రాష్ట్రపతులలో, సంజీవరెడ్డిగారితో నలుగురు ఆంధ్రులు. ఇది ఆంధ్రులు గర్వించవలసిన విషయం.

అవిభక్త మదరాసు రాష్ట్రంలో, పి. ఎస్. కుమారస్వామి రాజాగారి మంత్రిమండలిలో మద్యనిషేధ మంత్రిగా నియమింపబడిన శ్రీ సంజీవరెడ్డిగారు, ఆంధ్రరాష్ట్ర డిప్యూటీ ముఖ్యమంత్రిగాను, ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగాను, కేంద్రప్రభుత్వంలో కేబినెట్ మంత్రిగాను, లోక్‌సభ స్పీకరుగాను పదవులను నిర్వహించి, పరిపాలనా దక్షతను పొందారు. 1969 లో రాష్ట్రపతిగా ఎన్నికకు నిలబడి, పార్టీ సభ్యులే ద్రోహంచెయ్యడంవల్ల ఎన్నికలో ఓడిపోయారు. ఈనాడు, అన్ని పార్టీల మద్దతుతోను ఏకగ్రీవమైన గెలుపు పొందారు. విశేష పరిపాలనా అనుభవంతో, అన్ని పార్టీల మద్దతుతో ఎన్నిక అయిన సంజీవరెడ్డిగారి హయాంలో, భారతదేశం అనేక రంగాలలో అభివృద్ధి సాధిస్తుందనే నమ్మకంతో, సంజీవరెడ్డిగారిని మరొకసారి అభినందిస్తున్నాము.

*        *        *

భారత దేశం స్వాతంత్ర్యం పొంది, 1977 ఆగష్టు 15 నాటికి ముప్ఫయి సంవత్సరాలు పూర్తి అయినవి. ముప్ఫయి సంవత్సరాలు ఒకే పార్టీ పరిపాలనలో వున్నది. గత మార్చి ఎన్నికలలో ఆ పార్టీ పరిపాలన ముగిసి, మరొక కొత్తపార్టీ పరిపాలన ప్రారంభమైంది. గత ముప్ఫయి సంవత్సరాల లోనూ మనదేశం సాధించిన అభివృద్ధి పరిగణనీయమైనదే. అయితే, సాధించిన అభివృద్ధికన్న సాధించవలసినది యింకా ఎంతో వున్నది. పరిశ్రమలు బాగా అభివృద్ధికి వచ్చాయి; కాని వ్యవసాయరంగంలో చాలా అభివృద్ధిని సాధించవలసి వున్నది. ప్రభుత్వ కార్యాలయాలలో లంచగొండి తనం ఎక్కువ అయింది. గట్టి చర్యలను అమలుజరిపి, ఆ లంచగొండి తనాన్ని రూపుమాపవలసిన అవసరం ఎంతేనా వుంది. లంచగొండితనాన్ని రూపుమాపడంలో ప్రభుత్వం ఎంత కఠినచర్యలను అవలంభించినా, ప్రజలు హర్షిస్తారే కాని నిరసించరు.

ధరలను అదుపులోకి తేవడానికి కూడా ప్రభుత్వం పట్టుదలతో కృషి చెయ్యాలి. పెరిగిపోతున్న ధరలవల్ల, సామాన్యకుటుంబీకులు పడుతున్న బాధలు చెప్పనలవి కానివి. పెరిగిపోతున్న ధరలు, అంతులేని లంచగొండి తనాలవల్ల, సామాన్య కుటుంబీకులు నిత్యజీవనాన్ని గడపలేకుండా వున్నారు. ఇలాటి పరిస్థితులలో, గత ముప్ఫయి సంవత్సరాలలోనూ. ఏ యేటి కా యేడు పన్నులు పెరగడమే కాని తగ్గడం అంటూ జరగలేదు. ధరలను అదుపులోకి తెచ్చి, ప్రభుత్వ కార్యాలయాల ఖర్చులను తగ్గించి, తగ్గించకపోయినా అధమం అయిదేళ్ళపాటయినా పన్నులను నిలకడగా ఒకే స్థాయిలో వుంచి, లంచగొండితనాన్ని రూపుమాపడానికి కఠినచర్యలను అమలుజరిపి, ప్రజల జీవితంలో ఒక సుస్థిరతను నెలకొల్పడానికి, కొత్త ప్రభుత్వం కృషిచెయ్యాలి.

స్వాతంత్ర్యం వచ్చిన గత ముప్ఫయి సంవత్సరాలలోనూ, దేశంలో ఒక కొత్త తరం వచ్చింది. ఈనాడు నలభై, నలభైఅయిదు ఏళ్ళ వయస్సు గలవారికి, స్వాతంత్ర్య పోరాటాన్ని గురించిగాని, దేశస్వాతంత్ర్యం కోసం ప్రాణాలనూ, ఆస్తులనూ త్యాగంచేసిన వారిని గురించిగాని ఎక్కువ ఏమీ తెలియదు. స్వాతంత్ర్య సమరంలో విశేష త్యాగాలను చేసిన దేశభక్తుల

తరం క్రమంగా అంతరించిపోతున్నది. ఈనాడు యువతరంలో వున్నవారికి, స్వాతంత్ర్యానికి పూర్వం మనదేశంలోని పరిస్థితి ఏమిటో తెలియదు. స్వాతంత్ర్యానుభవంతో పెరుగుతున్న యువతరంవారు, స్వాతంత్ర్యంతో పాటు ప్రజాజీవితంలో ఒక కట్టుబాటును, నీతిని ప్రవర్తింపచెయ్యడానికి పాటుపడాలి. ప్రజల సమిష్టి సౌభాగ్యానికి పాటుపడకుండా, పాటిప్రజలను దోచుకుంటూ, ఎవరి జేబులను నింపుకోడానికి వారు ప్రయత్నం చేసే వ్యవస్థ, స్వతంత్ర్య పాలనగల దేశపు ప్రజలకు గౌరవాన్ని కలిగించదు. అన్నివర్గాల ప్రజలూ అభివృద్ధి పొందుతూ, ఒక వర్గం మరొక వర్గాన్ని పీడించకుండా, ప్రజాసేవకులైన ప్రభుత్వోద్యోగులు తమ విధులను సక్రమంగా నిర్వహిస్తూ, ప్రజాప్రతినిధులు ప్రజాహిత కార్యాలకే తమ కృషిని పరిమితం చేసుకుంటూ వున్ననాడే, స్వాతంత్ర్యపు ప్రయోజనాలను ప్రజలు అనుభవించగలరు. దేశం గౌరవస్థానాన్ని పొందగలదు.

అక్టోబరు నెల యువ

## భావపరిచయ పోటీ

**బహుమానం రూ. 25-00**

**ఈ కార్టూనుకు హాస్యయుత వాఖ్య (Caption) కావాలి**



**గమనిక :** వ్యాఖ్యలు పోస్టుకార్డుమీదనే వ్రాయాలి. ఆగష్టు 29వ తేదీ లోపు అందాలి.


క్రొత్త
for sparkling white and brilliant colour washes
point
DETERGENT WASHING CAKE
Net Weight 135 gms
Point
Point




# సూర్యుడి ఏడో గుర్రం

వర్ధనమ్మ కాలుగాలిన పిల్లిలా తిరుగుతోంది. ఆమె అప్పటికే పదిసార్లకి పైగా యింట్లోనుంచి గేటుదాకా పచార్లు చేసింది.

ఏడుగంటలయింది. ఎండ మిరమిర వచ్చేసింది. చిన్నపిల్లలు స్కూలుకు వెళుతున్నారు. పిట్టగోడదగ్గర బట్టలు ఆరవేస్తున్న బంగారమ్మ "ఇంకా మడి కట్టుకోలేదేమిటి ?" అని కేకేసింది.

వర్ధనమ్మ సమాధానంగా నవ్వింది. ఆమె దృష్టి సందు చివరిదాకా వుంది. ఎక్కడా దేవయ్య వస్తున్నజాడ కనిపించలేదు. విసుగొచ్చినా కొడుకుని తిట్ట బుద్ధవలేదు. 'వెర్రికుంక ఎక్కడ కూర్చున్నాడో,' అనుకుంది స్వగతంగా.

గేటు దగ్గర వర్ధనమ్మనిచూసి కూరల శివయ్య కావిడిదించాడు 'ఎన్నలాంటి వంకాయలొచ్చాయండి పెద్దమ్మగారూ.'

"వద్దులేరా అబ్బి...అమ్మాయి మార్కెట్టుకి వెళ్ళింది." వర్ధనమ్మ ఇంటి దగ్గరికి వచ్చిన కూరలు కొనదు. రేటు ఎక్కువ, పైగా మంచివి దొరకవని ఆమె అభిప్రాయం.

ఛాయ సంచులతో రిక్షా దిగింది. తనకోసమే ఆమె కాసుకు వుందనుకుని "రిక్షా దొరకలేదు దొడ్డమ్మా" అన్నది సంజాయిషీగా.

"మనపేరు చెబితే ఏదీ వుండదు......లోపల తగలెయ్." టిఫిన్ పడకపోవ డంతో వర్ధనమ్మకి పిచ్చెక్కి-పోయినట్లువుంది. అయినా ఆమె ఎప్పుడూ ముఖ్యంగా ఛాయ విషయంలో ధుమధుమలాడుతూనే వుంటుంది.

వసారాలో కూరలు పెట్టి ఛాయ స్నానానికి వెళ్ళిపోయింది.

ఏడున్నర అయినా దేవయ్య అయిపులేడు.

వర్ధనమ్మ చిరాగ్గా కత్తిపీట ముందువేసుకుని కూరల సంచి దిమ్మరించింది. వంకాయలు...బంగాళాదుంపలు క్రిందపడ్డాయి.

"వంకాయలు చౌకేకదా... రెండు కిలోలు పట్టుకురాలేక పోయావూ?"

ఛాయ బాయిలర్ దగ్గర నీళ్ళు తొరుపుకుంటూంది. "రోజూ వెళుతున్నాగా దొడ్డమ్మా...ఎప్పటికప్పుడు తెచ్చుకోవచ్చు."

"దబ్బకాయలు ఏవే?"

"ఎక్కడా కనిపించలేదు." ఛాయ బకెట్‌తో బాత్‌రూంలోకి వెళ్ళిపోయింది.

"కళ్ళు నెత్తిమీద పెట్టుకుని వుంటావ్? నీకెక్కడ కనిపిస్తాయే ... ఆ పాపమ్మ కోడలు ఎక్కడ్నుంచి పట్టుకొచ్చిందంటావ్? నోరు బాగా లేదని తెమ్మన్నాను...నా మాట నువ్వు వినిపించుకుంటావా తల్లీ? నీకేంతోస్తే అది చేస్తావు? వర్ధనమ్మ సాధింపులోనికి దిగింది.

"ఎవరికే అమ్మా అక్షింతలు?" దేవయ్య వచ్చాడు, చంకక్రింద చెప్పుతో. మరో చెప్పు కాలికి వుంది. ఇడ్లీ పొట్లం తల్లికి యిచ్చాడు.

"ఏ వేళయిందిరా నువ్వెళ్ళి?"

"ఇడ్లీలు అయిపోయాయి. వాయి తీయించేదాకా వున్నాను."

"వర్ధనమ్మ తలెత్తింది. అదేమిట్రా పిచ్చి..."

"చెప్పు తెగిపోయిందమ్మా...సాయంత్రంలోగా నాకు కొత్తవి కొనీయా ల్సిందే. ఈసారి బూట్లు కొనాలి."

"సాయంత్రం అక్కతో వెళ్ళి కొనుక్కుందువుగానిలే." ఛాయ వస్తుందేమో నని బయటకి చూసి వర్ధనమ్మ హడావిడిగా ఫలహారం కానిచ్చింది.

"అమ్మా, సుబ్బయ్య డబ్బులు ఇమ్మంటున్నాడే...నలభై ఇవ్వాలిట."

"మధ్యలో ఎలా వస్తుంది...ఒకటో తారీఖున ఇస్తామని చెప్పు."

"అమ్మా నేను మూడు పెసరట్లు మూడిడ్లీలు తిన్నానే......ఇంకా ఆకలే

స్తుందే... పూరీ ఇమ్మంటే ఆ సుబ్బయ్యగాడు తిట్టాడు. అజీర్ణంచేసి చచ్చిపోతా వన్నాడే."

"వాడిశార్ధంపెట్ట...నిన్ను అంతమాటన్నాడురా? మీ నాన్న రానీ...కనుక్కు-రమ్మంటాను. ఏం, తేరగా పెడతాడా వెధవకుంక ?..."

ఛాయ బట్టలు వేసుకుని ఆఫీసు ఫైళ్ళు తిరగేస్తూ కూర్చుంది. వర్ధనమ్మ సీసా అక్కడపెట్టి "నెయ్యి అయిపోయిందే...నెయ్యి లేందే వాడు ముద్ద ఎత్తడాయె మళ్ళీ నువ్వెళ్ళిపోతే ఎవరు తెస్తారు ?" వెళ్ళిపోయింది.

ఛాయ విసుక్కుంది. ఎనిమిదిన్నర కావస్తోంది. నడిచి రంగయ్యకొట్టుకి వెళ్ళి రావాలంటే అరగంటకి పైగా పడుతుంది.

కాలక్షేపం చెయ్యడం దొడ్డమ్మకు తెలియదు. అన్నీ ఆమె చిన్నప్పుడు జరిగినట్లు జరగాలంటుంది. ఇలాంటివి సాయంత్రమైనా చెప్పదు, తనని పరీక్షించడానికన్నట్లు ప్రొద్దుటే చెబుతుంది. ఏం మనిషో !

ఛాయ విసుక్కుంటూ బయలుదేరింది. అప్పుడే మీనాక్షి టిఫిన్ బాక్స్ తీసుకుని స్కూలుకి వెళ్ళిపోతుంది. ఆమెకేం అదృష్టవంతురాలు. ఇదస్తం ముసలమ్మలు ఎవరూలేరు. అన్నీ తన టైం ప్రకారం చేసుకుంటుంది. ఆమె భర్తకూడ దేవుడిలాంటి మనిషి

దారిలో ఇద్దరు కాలక్షేపం స్నేహితురాళ్ళు కనబడటంతో ఛాయ ఇంటికి వచ్చేసరికి తొమ్మిది దాటింది.

"వడ్డించేయ్ దొడ్డమ్మా...లేటయిపోయింది."

"అందరికీ అర్జంటులే తల్లీ. ఏదీ లేనిదానిని నేనే......"

ఛాయ బియ్యే పాసయినా పల్లెటూరి పిల్లలా వుంటుంది. ఈ కాలం పిల్లలకి మల్లే చొరవా, ధైర్యమూ ఆమెకి లేవు. ఎదుటివారు ఏమనుకుంటారోనని భయ పడుతూ వుంటుంది.

వర్ధనమ్మకి సమాధానం చెప్పకుండా కంచం, మంచినీళ్లు పెట్టుకుంది.

"లేచినప్పటినుండి ఛస్తూనే వున్నాను. నేను మనిషిని కాని యంత్రాన్ని కాదుకదా ! అందరూ వేళకి సిద్ధమవుతారు, మింగడానికి మాత్రం ?..." అర్థం లేకుండా ఘర్షణ సృష్టించడం వర్ధనమ్మకి వెన్నతో పెట్టిన విద్య.

దేవయ్య కొబ్బరికాయ కోరుతున్నాడు....సగం తింటూ." అక్కయ్యకి టైమయిపోతుందే అమ్మా...ముందర అన్నం పెట్టు ఆలస్యంగా వెళితే బెంచీ ఎక్కాలి." చిన్నప్పుడు తన అనుభవాన్నిబట్టి చెప్పాడు దేవయ్య.

వర్ధనమ్మ లేవడం అయిదు కాకుండానే లేస్తుంది. కాని పనికివచ్చే వాటికంటే పనికిరానివి ముందర చేస్తుంది. టిఫిన్ అయ్యాక ఆ చుట్టుప్రక్కల ఓసారి పెత్తనం చేసిరావల్సిందే. ఎనిమిదిన్నర దాటితేకాని వంట ప్రారంభించదు. దాంతో ఛాయకు లేటవుతుంది. హడావిడిగా కూరా, మజ్జిగా పోసుకుని తిని లేచి పోతూంటుంది.

వర్ధనమ్మ వేడి వేడి కూర విస్తరిలో పడేసింది.

ఈ దశలో సోమయాజులు వచ్చాడు. పౌరోహిత్యంలో సంపాదించిన బియ్యం క్రిందపోసి "నాక్కాస్త కాఫీ పారబొయ్యి" అన్నాడు.

"అంత పారబోసేలా ఏంలేదు కాఫీ"...భర్త రావడంతో వర్ధనమ్మ కోపం ఇంకా ఎక్కువయిపోయింది.

"నీ ఏడుపు మండ...యింటికొచ్చేసరికి మొదలెడతావే ?" సోమయాజులు జంధ్యం తిప్పుతూ మండిపడ్డాడు.

"బయట మన రాచకార్యాలు తగలడుతున్నాయి."

ఇద్దరూ అందుకున్నారు. పిల్లీ - కుక్కలా సహజవైరం ఏదో వుండివుండాలి. కాపురం ప్రారంభంనుంచీ ఇదే వరుస ? అంతిమ విజయం మాత్రం వర్ధనమ్మదే

"అమ్మా, నేను వెళ్ళేసరికి నాన్న సుబ్బయ్య హోటల్లోంచి వెళుతున్నాడే. నన్నుచూసి అంగవస్త్రం తలమీద కప్పుకున్నాడు." దేవయ్యకూడా రంగంలోకి దిగాడు.

ఆ ఇంట్లో ప్రొద్దుట ఛాయకు మినహాయించి అందరికీ టిఫిన్లుండాలి. ఒకరికి తెలియకుండా ఒకరు తిని వస్తుంటారు.

"నోర్మూయ్యరా పుండాకోర్ వెధవా ! గీసిన పందిలా ఉన్నావ్. నాతోపాటు వస్తే నాలుగు సంభావనలు రావూ ?"

కొడుకుని తిట్టడంతో వర్ధనమ్మ కాళికలా లేచింది. చేతులు అటు ఇటు తిప్పుతూ "ఆ పసివాడ్నేమీఅనకండి...మనం వెలగబెడుతున్నాం పౌరోహిత్యం. సిగ్గులేకపోతేసరి. మా ఛప్పన్నశాస్త్రి పౌరోహిత్యంలో రెండు మేడలు కట్టాడు. మన ఇంటికి పెంకులుకూడా వేయించుకోలేక పోతున్నాం మీ ఉద్యోగం వాడికి కూడా ఎందుకులెండి" అని అరిచింది.

ఈ పరిస్థితిలో తను ఉండటం లాభంలేదని, దగ్గరతోఉన్న మజ్జిగ గిన్నె అందుకుని పోసుకుని లేచిఁది ఛాయ.




"నీకు దెబ్బలాట ఉంటే చాలు. దానికి వేళకి నాలుగు మెతుకులయినా పెట్టవు."

"పొంగిపోతూంది ప్రేమ..."

ఛాయ ఫైలు అందుకుని పరుగులాంటి నడకతో సిటీబస్‌స్టాప్ చేరుకుంది. అక్కడ శశికళ, వరలక్ష్మి, మీనాక్షి కనిపించలేదు. వెళ్ళిపోయారేమో," అనుకుంది.

మరో పావుగంటకికాని బస్ రాలేదు. వచ్చినా అది ఆగలేదు ఛాయ రిక్షా కేకేసి ఎక్కింది, మరో బస్ చూసే వ్యవధిలేక.

అది ఇల్లుకాదు......పిచ్చాసుపత్రి. ఛాయకి ఇంటినుంచి బయటికి రాగానే ఆటవిడుపుగా వుంటుంది. వెన్నెట్లో తిరిగినట్లు వుంటుంది. తనకు ఊహ తెలిసినప్పట్నుంచి ఆ మనుషులు అలాగే వున్నారు. ఏ మార్పూ లేదు. అయినా తను అలవాటు పడలేకపోయింది. మనుషులంత క్రూరంగా ఎలా సంచరిస్తారో ఛాయకి అర్థంకాని విషయం.

పావుగంట లేటయింది

ఛాయ భయంగా గేటుతీసుకుని లోపలికి నడిచింది. మేనేజర్ రాక్షసుడు, ఆడవాళ్ళు ఆలస్యంగా వస్తే ఇంకా అపహాస్యం చేస్తాడు.

ఛాయ బెరుకుగా లోపలికి వచ్చింది.

మెయిన్ హాల్లో అంతా సమావేశమై వున్నారు. ఛాయ మీనాక్షి ప్రక్కగా నుంచుంది.

"అందరూ వచ్చేసినట్లే" అన్నాడు హెడ్‌గుమాస్తా తారకం.

"స్వర్గీయ రాష్ట్రపతి ఆత్మశాంతికి ప్రార్థిద్దాం...." మేనేజర్ రామబ్రహ్మం లేచాడు.

తరువాత సెలవుగా ప్రకటించబడింది.

ఛాయ బయటికి పోతూండగా జవాను "అయ్యగారు పిలుస్తున్నారండి" అని చెప్పాడు.

రామబ్రహ్మం కారులో ఉన్నాడు.

"మీ దొడ్డమ్మగారు అంతా నీకు చెప్పేవుంటారు, ఛాయా ?"

ఛాయ తనకేం తెలియదంది.

రామబ్రహ్మం అసంతృప్తిగా చూశాడు. "సరే......సాయంత్రం వస్తాను. వెయిటాన్."

ఏంచెప్పి వుంటాడు మేనేజర్ ? మరి దొడ్డ తనతో ఏం చెప్పలేదే ? ఛాయకి ఎంత ఆలోచించినా అర్థంకాలేదు.

చింతచెట్టుకింద మీనాక్షి వెయిట్ చేస్తోంది, "బొగ్గుల బస్తా మళ్ళీ పిలిచాడేం?" అని అడిగింది ఛాయ దగ్గరకు రాగానే.

కారణం తెలియందే చెప్పాలనిపించలేదు. "లిఫ్టు యిస్తానంటున్నాడు" అన్నది నవ్వుతాలుగా.

"నీలాంటి అప్సరసకివ్వక నాలాంటి అప్పలమ్మ కిస్తాడేమిటి ?"

ఇద్దరూ సెంటర్‌లోకి వచ్చారు.

"కావేరికి రాత్రి డెలివరీ వచ్చింది. చూసిపోదామా ?" మీనాక్షి అడిగింది.

ఛాయ తలూపి రిక్షా పిలిచింది.

"ఈసారీ కావేరి అత్తగారు మనవడ్ని మిస్ అయింది "

ఛాయ సానుభూతిగా అన్నది. "అసలే కావేరి అర్భకురాలు. ఈ కానుపులతో హరించుకుపోతోంది. తెగించి తనైనా ఆపరేషను చేయించుకోదూ ?"

"సూర్యకాంతం చంపెయ్యదూ ?"

ఛాయ ఇంటికి వచ్చేసరికి పన్నెండు దాటింది. వర్ధనమ్మ తాంబూలం నములుతూ వీక్లీ చదువుతోంది. దేవయ్య కాళ్ళునొక్కుతున్నాడు.

"అక్కా- అప్పుడే వచ్చావేం ?"

కూజాలోనినీళ్లు రెండు గ్లాసులు త్రాగి ఈజీచైర్‌లో కూర్చుని కారణంచెప్పింది.

"అయితే ఎవరయినాపోతే సెలవిస్తారన్నమాట. రేపు మా అమ్మ పోయింద నుకో, మీ ఆఫీసుకి సెలవిస్తారా ?"

ఛాయ నవ్వుని బలవంతంగా ఆపుకుంది....వర్ధనమ్మనిచూసి.

"పిచ్చి వెధవా !...నోరుముయ్యరా !"

రేడియో విషాదంగా మ్రోగుతోంది. వీధిలోనిగది సోమయాజుల స్నేహితుల పేకాటలతో గందరగోళంగా వుంది.

ఛాయ ఖాళీగా ఉండే వర్ధనమ్మకి తోచదు. "వీడ్నోసారి డాక్టరుకు చూపించిరా, ఒక్కముద్దకూడా తినలేదు. ఏదైనా టానిక్కు రాసిమ్మను."

"ఇప్పుడుంటాడా ? భోజనానికి వెళ్ళిపోతాడేమో."

ఇంటి వెనకాలే వామనరావు హాస్పిటల్. ఛాయ దేవయ్యను తీసికెళ్ళేసరికి వామనరావు గయోపాఖ్యానంలోని పద్యాలు చదువుతున్నాడు.

వామనరావు హాస్పిటల్ రైలు వెళ్ళిపోయిన స్టేషనులా, కొత్తగా వైధవ్యం పొందిన స్త్రీలా వుంటుంది. వామనరావు ప్రాక్టీసు అంతంతమాత్రం. వైద్యం కంటే సొద ఎక్కువ.

"ఏమ్మా పెళ్ళికూతురా?" ఛాయను చూచి పరాచికాలాడాడు.

ఆయన బట్టతలను చూసి నవ్వుతూ బెంచీమీద కూర్చుంది ఛాయ.

"మాకు పప్పు అన్నం పెట్టవా ఏమిటి ? ఏమిటో ఈ కాలం పిల్లలు పెళ్ళిళ్లు వాయిదా వేసేస్తున్నారు."

"మావాడ్నోసారి చూడండి" దేవయ్యని ముందుకు గెంటింది.

వామనరావు బీడీ వెలిగించాడు. "ఏమిటి తలనొప్పా ? జ్వరమా ? కడుపు నొప్పా ?"

"ఏం కాదండీ."

"అన్నం తినడంలేదట." ఛాయ చెప్పింది.

వామనరావు నాడి చూశాడు. థర్మామీటరు చూశాడు, "నీ కేంరోగం లేదురా అబ్బి...నోటికి కాస్త విశ్రాంతి యిస్తే ఆకలి అదే వస్తుంది."

ఛాయ బలవంతంమీద మందురాసిచ్చాడు.

ఇంకా భోజనం చెయ్యలేదని తప్పించుకుని బయటికి వచ్చింది ఛాయ. లేక పోతే ఆ సొదకి ఇక అంతువుండదు.

"ఏరా...పొద్దుటే లోడుగా టిఫిన్‌చేస్తే పదింటికి ఏం ఆకలి వేస్తుంది?" పొద్దుట టిఫిన్ చెయ్యకు. భోజనానికి ఆకలి వేస్తుంది.

దేవయ్య తలూపాడు. ఒక క్షణమున్నాక 'అక్కా' అంటూ పిలిచాడు.

"ఏరా." ఛాయ రోడ్డుమీద ఆగిపోయింది.

"నాన్నకీ, అమ్మకీ, నీకూ, నాకూ అందరికీ ఒకేసారి పిచ్చెక్కిపోయిందనుకో, అప్పుడేమవుతుంది?" దేవయ్యకి చవట సందేహాలు వచ్చిపడుతుంటాయి.

"అప్పుడు మనం పిచ్చాసుపత్రికి వెళ్ళక్కర్లేదు. మన యింటి గోడమీద పిచ్చాసుపత్రి అని బోర్డు రాయించుకుంటే చాలు" అన్నది నవ్వుతూ.

ఛాయ ఇంట్లోకి వెళుతుండగా సోమయాజులు హడావిడిగా పేకముక్కలతో వచ్చేసి "ఓ రూపాయి ఇవ్వమ్మా. నీలకంఠం నిలువుదోపిడీ చేసేశాడు," అన్నాడు.

సోమయాజులు తను సంపాదించినది యింట్లో ఇవ్వడు. పేకాటకీ, బ్రాకెట్టుకీ తగలేస్తాడు. గెలిస్తే స్నోలు, సెంట్లూ కొంటూకటాడు.

ఛాయ రూపాయి యిచ్చింది.

"రెండు కౌంట్లు పీకితే మన డబ్బు వచ్చేస్తుంది." సోమయాజులు కంగారుగా వెళ్ళిపోయాడు.

"హరిశ్చంద్రుడిలా నాన్న నిన్ను నన్నుకూడా అమ్మేస్తాడే..." దేవయ్య తీర్పు చెప్పేస్తాడు.

"నా బంగారమాని...నీ పాటి జ్ఞానం కూడ లేదురా ఆ మనిషికి. ఏళ్ళురాగానే సరా?" వర్ధనమ్మ బత్తాయి తొనలు కొడుకునోట్లో పెట్టింది.

ఛాయ నీరసంతో కుర్చీలో అలాగే నిద్రపోయింది.

లేచేసరికి నాలుగయింది. కరకర ఆకలివేస్తుంది. ఛాయ గదిలోంచి బయట కొచ్చింది. పేకాట గోల అలాగే వుంది.

పెత్తనాలకి పోయింది వర్ధనమ్మ. హాల్లో చాపలో పడి దేవయ్య గుర్రుపట్టి నిద్రపోతున్నాడు.

ఛాయ వంటింట్లోకి వెళ్ళింది.

వర్ధనమ్మ మధ్యాహ్నం మూడు దాటాక ఇంట్లో వుండదు. చుట్టుప్రక్కల యిళ్ళకి పెత్తనాలకి వెళుతుంది. అక్కడ మాటలు ఇక్కడ చేరవేస్తూ. సాయంత్రం దాకా కాలక్షేపం చేస్తుంది. ఆమె దినచర్యలో యిదో ముఖ్యమయినభాగం సాయంత్రం వంట ఛాయదే. వర్ధనమ్మ ఏదో వారంచెప్పి రాత్రిళ్లు భోజనం చెయ్యదు. భోజనానికి బదులు 'లోడ్‌గా' టిఫిన్ లాగిస్తుంది.

ఛాయ ఉప్మా పోపు వేయిస్తూండగా దేవయ్యకు మెలకువ వచ్చింది. వెంటనే సబ్బుబిళ్ళ అరగదీసి ముఖం తోమేశాడు. సోమయాజులు వాడే తలనూనె, స్నో, రాసుకుని ఇస్త్రీ బట్టలు, టక్ చేసుకున్నాడు. బీరువాకున్న పొడుగు అద్దంలో తన అందాన్ని చూసుకున్నాడు. తను గొప్ప అందగాడ్నన్న నిర్ధారణకి వచ్చేశాడు.

"ఎలా వున్నానక్కా ?" వంటింటిలోకి వచ్చాడు.

ఛాయ నవ్వాపుకుంది. వాడు తింగరబుచ్చని ఆమెకు తెలియందికాదు. "ఎంత బాగున్నావోరా...అచ్చు సినీమా హీరోలా వున్నావు."

దేవయ్య సిగ్గుపడ్డాడు.

"ఏమిటి వేషం వేశావ్ ?"

"మనం బజారుకి వెళ్ళాలి."

"ఏం ?"

"బూట్సులు కొనుక్కోవాలి."

"దొడ్డ రానీ. నా దగ్గర డబ్బేదీ ?"

దేవయ్య నిరుత్సాహంగా ఉప్మాప్లేటు అందుకున్నాడు. తల్లికోసం ఆగడం వాడికి దుర్భరంగా వుంది. "నీ జీతం నీ దగ్గరే దాచుకో అక్కా, మా అమ్మకి ఇవ్వకు."

"ఇస్తేనే నా పని ఇలావుంది, ఇవ్వకపోతేనా ?" అనుకుంది ఛాయ.

ఇంతలో బయట కారు ఆగింది. రామబ్రహ్మం లోపలికి వచ్చాడు. ఛాయ విష్‌చేసి టిఫిన్ ఇచ్చింది.

"అద్భుతం ఛాయా...నేను రోజూ యిక అదృష్టవంతుడినన్నమాట."

ఛాయ కాఫీకోసం లోపలికెళ్ళింది.

నాలుగిళ్ళవతల వర్ధనమ్మ అమ్మలక్కలమధ్య బట్టలు పరిశీలిస్తోంది. వెంకయ్యగారి విధవప్పగారు "వర్ధనం...మీ యింటికి కారొచ్చిందేవ్" అంటూ అరిచింది

వర్ధనమ్మ పెరటి దార్ని లోపలికెళ్ళింది. ఆ విషయం ఛాయతో తను చెప్పడం మరచిపోయింది. రామబ్రహ్మం వచ్చేసి వుంటాడు.

అయినా చెప్పేది ఏముంది ? వర్ధనమ్మ అహంతో సమాధానపరుచుకుంది. ఛాయ తనకి ఎదురు చెపుతుందా ?

ఛాయ కాఫీ కలుపుతోంది.

నలిగిపోయిన చీర, జిడ్డు ముఖం, రేగిన జుట్టు ఛాయనిచూసి మండిపడింది.

"ఆయన ముందుకి ఇలాగే వెళ్ళావా? కాస్త శుభ్రంగా వుండొద్దూ. ఎన్నేళ్లు వచ్చినా నీకు తెలివితేటలు రావా ఏమిటి? పెళ్ళిచూపులకి అలాగే పోయేది?"

"ఎవరికి దొడ్డా పెళ్ళిచూపులు?"

"నాకే...సిగ్గుమాలిన కుంకా? అరటిచెట్టులా ఎదిగి కూర్చున్నావ్! తల్లీ, తండ్రీ లేని పిల్ల కదా అని యింకా పెళ్ళి చెయ్యవా అని జనం నన్నాడిపోసుకుంటున్నారు."

మేనేజర్ రామబ్రహ్మం... పెళ్ళిచూపులు...భర్త.

ఛాయ భరించలేకపోయింది.

రామబ్రహ్మానికి యాభై దగ్గరగా ఉంటాయి. ఇద్దరాడపిల్లలకి పెళ్ళిచేశాడు. ఇంకా రెట్టింపు వున్నారు. ఈ మధ్యనే భార్యపోయింది. పెళ్ళి కొడుకయి కూర్చున్నాడు.

"ముందర కాఫీ ఇచ్చిరా...అలా బొమ్మలా కూర్చుండిపోయావేం?" గద్దించి తను రామబ్రహ్మాన్ని పలకరించడానికి వెళ్ళింది.

ఛాయ కాఫీ ఇవ్వడానికి దేవయ్యని పిలిచింది.

దేవయ్యకి అనుమానమొచ్చింది. "నీ మొగుడు నాకేమవుతాడే అక్కా?"

"పెళ్ళయ్యాక చెబుతాలే." విసుగ్గా అంది.

వర్ధనమ్మ వీధి గదిలోకి వెళ్ళింది అప్పటికే చాలామంది జారుకున్నారు. కామేశంతో 'అరువు' ఆడుతున్నాడు సోమయాజులు.

"కామేశం, నువ్వుకూడా ఇంటికెళ్ళు నాయనా? ఆయనకి పేకాట తప్ప మరో ధ్యాసలేదు. అవతల ఎన్ని పనులున్నా లెక్కలేదు."

కామేశం బెదురు మనిషి. అతడి భార్య చండిక. ఆమెని తప్పించుకోడానికిలా పేకాటకి వస్తూంటాడు. వర్ధనమ్మకూడా అతడి దృష్టిలో డేంజర్ మనిషే. ఏడ్రూపాయలివ్వాలి. చిన్నగా హెచ్చరించి లాంగ్ జంపుతో బయటపడ్డాడు.

సోమయాజులు పేక సర్ది సెల్ఫ్‌లో పెడుతూ 'డీల్ కొట్టబోతున్నాను. శనేశ్వరంలా ఊడిపడ్డావ్. "ఏమిటంత అర్జంటుపని?" అనడిగాడు.

బయట పెద్దమనిషి వున్నాడని ఆగిందికాని లేకపోతే వర్ధనమ్మ యుద్ధరంగం తయారుచేసేదే. "ఉన్నది తగలేసుకునేరకం మనం......రండి బ్రహ్మం వచ్చాడు"

సోమయాజులు మాసిపోయిన గడ్డం రాసుకుంటూ హాల్లోకి వచ్చాడు.

ఛాయ వంటింటిలోనే కూర్చుండిపోయింది. "ఇంకా అలాగే వున్నావేం? అవతల అతడు ఎదురుచూస్తున్నాడు."

"నాకీ పెళ్ళి ఇష్టంలేదు దొడ్డమ్మా ?"

వర్ధనమ్మ అసహనంగా చూసింది. "ఎంచేత ? నీ ముఖానికి కోటీశ్వరుడు వలచి వస్తాడనుకుంటున్నావా ? లే...లేచి చీర కట్టుకురా ?"

మధ్యతరగతి ఆడపిల్ల ! వివాహం దగ్గర బొత్తిగా స్వాతంత్ర్యముండదు. పెద్దల జూదానికి తల ఒగ్గవల్సిందే. అభిప్రాయం చెప్పుకుంటే ఎదిరించినట్లు వుంటుంది. మూగనోము పడితే రేపు జీవితం ఎదురు తిరుగుతుంది.

పాతదారి సుఖమైనది కావచ్చు. అంతమాత్రంచేత గుడ్డిగా అనుసరించి పోకూడదు. అలా అయితే జీవితంలో లక్ష్యం నెరవేరుతుంది. లక్షణం మాత్రం దెబ్బతింటుంది. గానుగ ఎద్దు రోజల్లా తిరిగినా దాని పయనం... ఆ స్వల్ప పరిధి మాత్రమే

సాహసం జీవ లక్షణం కావాలి. అప్పుడే స్థబ్దత తొలగిపోతుంది జీవితంలో.

ఆచారాలు, సంప్రదాయాలు యవనికల్లాంటివి. వాటిని సూత్రధారులు మాత్రమే భేదించగలుగుతారు.

"ఈ ఒక్కమాట విను దొడ్డమ్మా. ఆయనకి నాకంటె పెద్ద ఆడపిల్ల లున్నారు ?"

"ఉంటే నీకేం ? నువ్వు భార్యగా వెళుతున్నావు. బ్రహ్మం నిన్ను పువ్వుల్లో పెట్టి చూసుకుంటాడు. పెద్ద ఆస్తివుంది. నీ మాటకి తిరుగుండదిక." లోభాన్ని విప్పి చెప్పింది.

ఆస్థి...డబ్బు...దగ్గర ఆ కన్నె మనసు రాజీపడలేకపోయింది. రామ బ్రహ్మాన్ని భర్తగా ఊహించడానికే వెలపరంగావుంది.

దొడ్డమ్మ ఎందుకు బలవంతం చేస్తోంది ? ఈ మాత్రం సంబంధం రాక పోతుందా ఏమిటి ? ఈ రెండోపెళ్ళివాడ్ని చేసుకునే ఖర్మేం తనకి ?

"నాకిష్టం లేదు." స్పష్టంగా చెప్పేసింది.

వర్ధనమ్మలో ఆరాటం... ఆక్రోశం ఏం చెయ్యలేని స్థితి, వర్ధనమ్మకి చాయ పెళ్ళి తొందరగా చేసెయ్యాలన్న ఆందోళనేం లేదు.

రామబ్రహ్మం ఆశపెట్టాడు 'పదివేలు యిస్తానని.' పైగా నెల నెల ఛాయ జీతంలో సగం పంపించే ఏర్పాటు చేస్తానన్నాడు.

"వేలకి వేలు పోసి మీ పెదనాన్న నీ పెళ్ళి చేస్తాడనుకున్నావా ? మూర్ఖానికి పోక సంబంధానికి ఒప్పుకో. నీ బరువు, మా బరువు తప్పుతుంది."

వర్ధనమ్మతో ఏం వాదించినా ఉపయోగం వుండదని తెల్సు ఛాయ సీరియస్‌గా హాల్లోకి వెళ్ళి కూర్చుంది.

రామ|బహ్మం చుట్టకాలుస్తున్నాడు. సోమయాజులు ఆయన చెప్పినదానికి "చిత్రం" "దివ్యంగావుంది." "మా బాగా సెలవిచ్చారు"... అంటున్నాడు.

"పార్వతిని నేను జీవితంలో అమితంగా |పేమించాను ఛాయా? ఇరవై యేళ్ల వైవాహిక జీవితంలో ఆమె నా సంతోషంకోసం ఎల్లవేళలా |పయత్నించింది. పార్వతి కేవలం నా భార్యేకాదు. తల్లి, స్నేహితురాలు గైడ్..."

ఛాయ గొంతుక్కుంది. "అంత |పేమ కనుకనే పోగానే పెళ్ళికి సిద్ధమయ్యావు."

"నా దురదృష్టంకొద్దీ పార్వతి దూరమయింది. ఎంత ఏడిస్తే ఆమె వస్తుంది? గుండె రాయి చేసుకున్నాను. పిల్లలకోసం నన్ను నేను ధైర్య పరచుకున్నాను. భవబంధాలు తెంచుకుని ఆమె వెళ్ళిపోయింది... |బతికున్న మనకి అన్నీ కావాలి కదా! సంసారాన్ని నడపడానికి నాకు సహచరి కావాలి! మగవాడికి నలభై దాటాక స్త్రీ అవసరం ఎక్కువ కదా!... నిన్ను చూడగానే పార్వతిని చూసినట్లు వుంటోంది. అందుకే మీ దొడ్డమ్మగార్ని సం|పదించాను. నా అదృష్టంకొద్దీ ఆవిడ అంగీకరించారు."

"సారీ సర్... నేను అంగీకరించను."

"ఛాయా!" ఎదురు తిరుగుతుందని ఆయన అనుకోలేదు.

వర్ధనమ్మ కళ్లెర్ర చేస్తోంది. సోమయాజులు, దేవయ్య సర్కస్ చూస్తున్నట్లు కూర్చున్నారు.

"మీరు నా ఆఫీసర్ కావచ్చు. ఇది నా జీవిత సమస్య. నా సొంత వ్యవహారాల్లో నా యిష్ట|పకారమే చేస్తాను. మిమ్మల్ని నిరాశపరచినందుకు చింతిస్తున్నాను."

"బాగా ఆలోచించుకో ఛాయా!"

"ఇంక ఏమీ ఆలోచించక్కర్లేదు సార్."

వర్ధనమ్మ ఓడిపోతున్న ఆటగాడిలా దివాళా ముఖంతో ముందుకు వచ్చి "దీనికి కాస్త మంకుపట్టు బాబూ, నేను నచ్చచెబుతాలే." చెప్పింది.

"మీరేమాత్రం ఆశపెట్టుకున్నా లాభంలేదు."

తన పెద్దరికాన్ని నిలవెయ్యడంతో వర్ధనమ్మ భరించలేకపోయింది. కళ్లు విశాలంగా పెంచి "నీకు ముష్టి సంబంధం చేసుకునే రాతవుందేమో పెద్దమ్మా. అందుకే బంగారంలాంటి సంబంధాన్ని వద్దంటున్నావు." మండిపడింది.

రామ|బహ్మం యిక కూర్చోలేకపోయాడు. అశాంతిని లోపలే దాచుకుని "ఆల్‌రైట్" అంటూ కారెక్కాడు.



సోమయాజులు వ్యాఖ్యానించాడు "ఘటనలేదేమో !"

"దాన్ని నాలుగు దులపరి-చక అలా బొమ్మలా కూర్చున్నారేమిటి ? ఇంటికి వచ్చిన పెద్దమనిషిని అవమానించి పంపిస్తుందా ? అసలు దీనికి దేన్ని చూశా గర్వం ? తల్లి లేకపోయినా పెంచానన్న జ్ఞానం ఏడ్చిందా ?" వర్ధనమ్మ రవరవ లాడిపోయింది.

ఛాయ లోపలికెళ్లిపోయింది మాటకి మాటతో పోరు పెరుగుతుంది. అయినా తన పని అయిపోయింది. దొడ్డమ్మ ఎన్ని వాగితేనేం ?

"అమ్మా... బ్రహ్మంగారింక మనకి డబ్బివ్వరు కదే?" ఆ రోజు మాటల యినపుడు దేవయ్య కూడా ప్రక్కన వున్నాడు

"నోర్మయ్యరా పిచ్చివెధవా ?"

భార్య ఏదో పెద్ద పథకమే వేసిందనుకున్నాడు సోమయాజులు.

మర్నాడు ఛాయ ఆఫీసులో బెదురుగానే గడిపింది, తిరస్కరించిన కసితో రామబ్రహ్మం ఏదైనా చేస్తాడని. ఏమీ జరగలేదు.

ఇంటికెళుతున్నప్పుడు మీనాక్షి అడిగింది – "మన బొగ్గుల బస్తా కొరకొర లాడుతూ వున్నాడేం ?"

జరిగింది ఛాయ చెప్పింది.

"రోగ్, వీడి బ్రతుక్కి లేత పెళ్లాం కావల్సివచ్చిందన్నమాట. మంచిపని చేశావు. అసలు నువ్వో బెదురుగొడ్డువి. మీ దొడ్డమ్మ కళ్లెర్రచేస్తే, చిత్త మంటావు. నువ్వు ఎదురుతిరగడం నాకు ఆశ్చర్యంగానే వుందనుకో !"

"దొడ్డమ్మ నామీద రంకెలు వేసేస్తున్నది."

"అవేం లెక్కపెట్టకు."

సరిగ్గా నాలుగురోజులు తర్వాత ఛాయ వూహించిన ప్రమాదం రానే వచ్చింది. రామబ్రహ్మం తన గదిలోకి పిలిచి "ఆ డిసిబి ఫైలు తీసుకురా !" అన్నాడు.

ఛాయ తన టేబిల్ మీద వెతికింది.

రాక్‌లో కూడ లేదు.

కంగారుగా మీనాక్షి... అంబుజం టేబిల్స్‌మీద వెతకసాగింది.

రామబ్రహ్మం స్వయంగా వచ్చేశాడు. "ఏమిటింత లేటు ?"

"కనిపించడం లేద్సార్."

"కనిపించడంలేదూ ? అంత బాధ్యతగా చేస్తున్నావన్నమాట ఉద్యోగం.

అందరి కళ్లూ ఛాయమీద వున్నాయి. అందరిలో యిలా నిలబడిపోవడం ఆమెకి చచ్చే అవమానంగా వుంది.

"అది ముఖ్యమైన ఫైలా ? ఎక్కడ పెట్టావో జ్ఞాపకం లేదూ ? ఉద్యోగ మంటే బొమ్మల్లే అలంకరించుకుని తిరగడమనుకుంటున్నావా ?"

"............"

"పనిదగ్గర వేషాలు వేసేవారిని నేను క్షమించను. జీతం పుచ్చు కుంటున్నాం. శ్రద్ధగా మన పని మనం చెయ్యాలన్న జ్ఞానం నీ కేడిసిందా ?"

ఛాయకి నీళ్లు తిరుగుతున్నాయి.

"అలా రాయిలా నుంచుంటావేం ? స్పీక్ ఎబౌట్ ది ఫైల్."

"నిన్న సాయంత్రం నా టేబిల్ మీదే వుందండి."

"ఏం ? ఇప్పుడు ఎక్కడికయినా పరిగెత్తుకు పోయిందా ?"

"............"

"వంటింటిలో గరిటె తిప్పేవాళ్లు ఆఫీసులకి ఎగబడితే ఎలా వుంటుంది ? ఛాయా ! ఐ డోంట్ టోలరేట్ దిస్. రేపు జియం గారు వస్తున్నారు. సాయంత్రంలోగా ఫైలు సబ్మిట్ చెయ్యకపోతే ఆయనకి రిపోర్ట్ చెయ్యాల్సివుంటుంది." రామబ్రహ్మం లోపలికి వెళ్ళిపోయాడు.

లంచ్ అవర్‌లో మీనాక్షి, ఛాయ క్యాంటీనుకి బయలుదేరారు.

"వాడు పగపట్టాడు మీనా ?"

"ఫైలు వాడే 'మిస్' చేసి వుంటాడు."

"మరయితే...?"

"నువ్వు భయపడకు, చూద్దాం ఏం జరుగుతుందో. "

"ఛీ... దొంగదెబ్బ తీసే నీచుడనుకోలేదు."

"ఇలా చేస్తే కాళ్లబేరానికి వస్తావనుకున్నాడు."

సాయంత్రం బజారులో తారకం కనిపించాడు. ఛాయని చూసి దగ్గరకి వచ్చి, "ఫైలు సంగతి ఏంచేశావు ?" అనడిగాడు.

"ఏం చెయ్యనండీ, ఎక్కడా కనిపించలేదు."

"పెద్దవాళ్లతో పేచీ పెట్టుకోకూడదమ్మా."

"ఆయనతో నాకు పేచీ ఏమిటండీ ? ఆయనంతరమెక్కడ ? నా అంతరమెక్కడ ?"

"రామబ్రహ్మంగారు వెన్నలాంటి మనిషి. ఆయన్ని నొప్పించకుండా వుంటే దేముడే !"

తారకాన్ని తన దగ్గరకి రామబ్రహ్మం పంపించివుంటాడు. తను ఒప్పుకుంటే ఫైలు గొడవ ఏమీవుండదు. అంటే ఫైలు విషయం రామబ్రహ్మం సృష్టించాడన్నమాట.

దేవయ్య అప్పటికే పిడతక్రింద పప్పు మూడు పొట్లాలు తిన్నాడు. ఛాయ సంభాషణంలో పడివుండటంవల్ల మరో వెరైటీలోకి దిగాడు.

"తారకంగారూ ! ఫైలు గందరగోళం నామీద ఎవరో కావాలని సృష్టించారు. నేనేం చెయ్యగలను ? ఎలా జరుగుతుందో కానివ్వండి... మన చేతిలో ఏముంది ?"

ఇక మాట్లాడినా ఉపయోగం లేదని తారకం వెళ్ళిపోయాడు.

మర్నాడు జియం యిన్స్‌పెక్షను జరుగుతోంది.

ఛాయ వూపిరి బిగపట్టుకుని కూర్చుంది, ఫైలు గురించి జియం నుంచి కబురు వస్తుందని. సాయంత్రమైనా కబురు రాలేదు.

"ఛాయా! టిబి కెళ్ళి జియం గార్ని కల్సుకుని, చెప్పుకో. లేకపోతే తర్వాత రామబ్రహ్మం యింకా విజృంభిస్తాడు." మీనాక్షి సలహా యిచ్చింది.

ఛాయ తటపటాయించి ఒప్పుకుం .

ఇంటికెళ్ళి బట్టలు మార్చుకుంది. ఆకుపచ్చని పువ్వుల జార్జెట్ చీరపై 'గ్రీన్' మేచ్‌తో తయారైంది.

"సినిమాకా అక్కయ్యా... నేనూ వస్తాను." దేవయ్య వెంటపడ్డాడు.

"ఆఫీసుకిరా... నువ్వెందుకు ?"

సోమయాజులు శాలువా కప్పుకుని బ్రాకెట్ థీరీ చూస్తున్నాడు. దేవయ్య గోలతో "నువ్వెందుకురా చావుపీనుగా... లోపలికి తగలడు." చిరాకుపడ్డాడు.

"నీకు పొట్లం తెస్తారా ?" అని బుజ్జగించి రిక్షా ఎక్కింది.

టి. బి. వూరి చివరవుంది. అప్పటికి ఎండ బాగా చల్లబడింది. నీరెండలు కొబ్బరి మొక్కలపై ఏటవాలుగా పడుతున్నాయి. వేపచెట్టుమీద కాకి అరుస్తోంది.

ఛాయ రిక్షా బయటే దిగింది.

విశాలమైన తోటలో 'బంగళా' గోదావరిలోని లంకలా మెరిసిపోతోంది. వాచ్‌మెన్ మొక్కలకి నీళ్లు పోస్తున్నాడు.

బయట కారు లేదు.

"జియం గారు బయటికి వెళ్లారా ?" వాచ్‌మన్‌ని అడిగింది.

"ఉన్నారండి..."

వరండాలో నలుగురైదుగురు కూర్చున్నారు. ఛాయ పూలతోట ప్రక్కగా నిలబడి వుంది. వాళ్ల పావుగంటలో వెళ్ళిపోయారు.

టిబి నిర్మానుష్యంగా వుంది.

లోపల రామబ్రహ్మం వున్నాదేమో? అని సందేహపడుతూ మెట్లు ఎక్కింది.

ప్రకాష్ ఎర్రటి లుంగీలో సోఫాలో విశ్రాంతిగా కూర్చుని వున్నాడు పేపరు చూస్తూ. ఛాయ ఎవరూ లేకపోవడంతో "నమస్కారమండీ" అంటూ వెళ్ళింది.

ప్రకాష్ టవల్ భుజంమీద వేసుకుని "రండి..." అని పిలిచాడు.



ఛాయ తనను పరిచయం చేసుకుంది.

ప్రకాష్‌కి సీతాకోకచిలుకలా కనిపించింది. ఆమె సౌందర్యాన్ని క్షణంపాటు కన్నార్పకుండా చూశాడు. సిగరెట్ బాక్స్ అందుకుని 'అభ్యంతరమా ?' అనడిగాడు.

"నాటెటాల్ సర్."

"పనిమీద వచ్చారా ?" అన్నాడు సిగరెట్ వెలిగిస్తూ. ఛాయ ఈ సమయంలో రావడం అతడికి కాస్త యిబ్బందిగానే వుంది.

డ్రయివర్ మందుకోసం వెళ్లాడు.

మందుతోపాటు మదవతీ వస్తుంది.

ఛాయవల్ల లేటవుతుంది.

పైగా తన సబార్డినేటు కిలాంటివి తెలియకూడదు.

ఛాయ ఫైలు విషయం చెప్పింది.

"ఆ విషయం రామబ్రహ్మంగారు చెప్పలేదే ?"

ఛాయ ఆశ్చర్యపోయింది.

"ఇది ఆయనే ప్లాన్ చేశారండి నా మీద పగతో."

"ఎంచేత ?"

కారణం చెప్పింది.

"ఐసీ...మిమ్మల్ని బెదరించి లొంగదీసుకోవాలనుకుంటున్నాడన్న మాట."

"యస్సార్..."

"మీ విషయం రేపు పరిశీలిస్తాను. ఏం భయపడకండి."

ప్రకాష్ కోక్ తీసి ఆమె ముందు పెట్టాడు. "హేవిట్."

థాంక్స్ చెప్పి తీసుకుంది.

"మీరు కొత్తగా జేరారా ?"

"ఆర్నెళ్లయిందండి."

ప్రకాష్ వ్యక్తిగతంగా కూడా నాలుగైదు ప్రశ్నలు వేశాడు.

ఛాయ కవి ఎబ్బెట్టుగా తోచలేదు. ప్రకాష్ మంచి ఆఫీసరనుకుంది. "సెల విప్పించండి... మీకు శ్రమయిచ్చాను." ఛాయ లేచింది.

ప్రకాష్ నవ్వాడు.

ధైర్యంగా ఛాయ యింటికి బయలుదేరింది. కిటికీలోనుంచి ప్రకాష్ చూస్తున్నాడని ఆమెకేం తెల్సు ?

మర్నాడు ఆఫీసుకు రాగానే ప్రకాష్ "డిసిబి ఫైలు తీసుకురండి" అని రామబ్రహ్మాన్ని ఆదేశించాడు.

రామబ్రహ్మం తన రాక్‌నుంచి ఆ ఫైలు తీసిచ్చాడు.

ఛాయని పిలిపించాడు.

"ఈ ఫైలు పోయిందని ఛాయగార్ని మందలించారా ?"

రామబ్రహ్మం బిగుసుకునిపోయాడు. తను ఛాయని బెదిరించడానికి ఎత్తు వేశాడు. ఆమె జియం గార్ని కల్సుకుందా ?

"మీ స్వార్థం గురించి క్రింది వుద్యోగిని భయపెట్టటం గర్హించదగిన విషయం. ఇలాంటి బలహీనతగల మీరు మీ బాధ్యతలు నెరవేర్చలేరని అభిప్రాయపడుతున్నాను."

రామబ్రహ్మం మతిలేనివాడిలా నుంచున్నాడు. ఇప్పటిదాకా డిపార్ట్‌మెంటులో 'సిన్సియర్ మేనేజరు' గా పేరు తెచ్చుకున్నాడు. ఎవరిచేతా వేలెత్తి చూపించుకోలేదు. ఆ గుడ్‌విల్ ఈనాడు ఎగిరిపోయింది.

"రెండురోజులనుంచి ఆ ఫైలు గురించి వాకబు చేస్తున్నానండి. ఛాయగారు నిర్లక్ష్యంగా ఫైలు గురించి తనకేం తెలియదన్నారండి. రాత్రల్లా నేనూ, తారకంగారూ వెతికితే స్టోర్ రూంలో దొరికిందండి."

"మరి నిన్న నాకెందుకు చెప్పలేదు ? ఇదేనా మీ డ్యూటీ ?"

"ఇవాళ చెబుదామనుకున్నానండి, దొరక్కపోతే."

"అంటే... దొరుకుతుందని మీకు నమ్మకముందన్నమాట."

రామబ్రహ్మం గుక్కతిప్పుకోలేకపోయాడు.

"ఫైలు పోగొట్టినది ఛాయగారు. మీరూ తారకం గారూ వెతకవల్సిన పనేముంది ?"

"............"

"అంటే ఈ ప్రహసనం మీరు తయారుచేసిందేనన్నమాట..."

"కా...దు......సార్" కంగారుపడిపోయాడు.

"అన్నీ మీరే చెప్పారు ? ఇంకా ఎందుకు బుకాయిస్తారు. మిస్టర్ బ్రహ్మం. ఇన్నాళ్లూ మీ గురించి నేను గర్వించాను. నా అభిప్రాయం మార్చుకోవల్సి వచ్చింది. మీ కసి తీర్చుకోడానికి డిపార్ట్‌మెంట్‌ని వాడుకుంటారా ? ఈ క్షణం మిమ్మల్ని నేను యింటికి పంపించెయ్యగలను."

"పార్డెన్‌మి సర్."

"నాక్కాదు... ఛాయగారికి చెప్పండి. ఆమె ఒప్పుకుంటే ఫర్వాలేదు. లేకపోతే..." ప్రకాష్ ఆపి యిద్దరి ముఖాల్లోకి చూశాడు.

రామబ్రహ్మం వణికిపోతున్నాడు.

ప్రకాష్‌ది తన వయసులో సగమైనా, అతడి పవర్‌కి భయపడుతున్నాడు.

"ఐ యూజ్ మై పెన్." ప్రకాష్ స్పష్టంగా అన్నాడు.

ఛాయకి క్షమార్పణా ? అంతరాత్మ ఎదురుతిరిగింది. కాని తప్పదు. లేకపోతే ఉద్యోగానికే మోసం వస్తుంది.

"నన్ను మన్నించమ్మా ఛాయా...నిన్ను బాధపెట్టాను" బిగపట్టి అన్నాడు.

మొన్న మానేజర్ పులిలామీద పడ్డాడు. నేడు పిల్లిలా దగ్గర నుంచున్నాడు.

"అంతమాటనకండి... మీరు పెద్దలు... ఒక మాటన్నా తప్పులేదు."

"మిస్టర్ బ్రహ్మం... డోంట్ ప్లే ఎగైన్ విత్ హెర్. ఈసారి ఆమె విషయంలో ఏ రిపోర్ట్ వచ్చినా తేలికగా వదలను. ఇది యింతటితో ముగిసిపోవాలి."

"యస్సార్."

"థాంక్యూసర్..." ఛాయ జియంని విష్ చేసి తన సీట్లోకి వచ్చింది.

మీనాక్షి, తారకం, అంబుజం, మాధవస్వామి, రంగపెరుమాళ్లు ఆమె టేబిల్ ముందు మూగారు. "ఏం జరిగింది ?"

"ఫైలు దొరికిందిలెండి" అన్నది పొడిగా.

"ఎక్కడప్పా ?" రంగపెరుమాళ్లు పట్టీ బిగిస్తూ అడిగాడు.

"మీకు ఆనక తారకంగారు చెబుతారు."

యిన్స్పెక్షను మొదలవడంతో ఎవరి సీట్లలోకి వారు జారుకున్నారు.

ఛాయకి ఫైలు గొడవ ముగియడం ఆనందంగానే వుంది. జియం గారు తన ఎదుటే రామబ్రహ్మాన్ని మందలించడం తృప్తినిచ్చింది. ఈ అవమానంతో తనమీద పగ పడతాడేమోనని భయపడింది.

"అలాంటి పిచ్చి భయాలు పెట్టుకోకు. రామబ్రహ్మం యిక నువ్వంటే భయపడి ఛస్తాడు" అన్నది మీనాక్షి బస్‌స్టాప్ కేసి నడుస్తూ.

శనివారం మధ్యాహ్నం హాఫ్ వాళ్లకి.

జరిగినదంతా మీనాక్షితో చెప్పింది.

"భలే...బొగ్గులు పొయ్యిలో పడ్డాయన్న మాట ... పెళ్ళిచూపుల ధర్మమాని మంచి శాస్తి జరిగింది... ఈ క్రెడిట్ అంతా నాది... చిన్న పార్టీ యివ్వాలి."

"మ్యాటనీకెళదామా ?"

మీనాక్షి ఒప్పుకుంది.

మొటల్లో టిఫిన్ చేసి థియేటర్ చేరుకునేసరికి రెండయింది. వీళ్లు లోపలికి రాగానే వదినా... అంటూ సైకిల్ దిగాడు శుక్రాచారి.

"సినిమాకి వచ్చావా ?" ఛాయ అడిగింది."

"అన్నయ్య వచ్చాడు... నిన్ను అర్జంటుగా రమ్మన్నాడు. మీ ఆఫీసు అంతా వెతికేశాను. ఇంటికెళుతూంటే మీరిక్కడ కనిపించారు."

"ప్రోగ్రాం కాన్సిల్. వెళ్లమ్మా మీనాక్షీ."

"వస్తున్నా నడు." మరదిని పంపేసింది మీనాక్షి.

"ఇంకా ఆలస్యమెందుకు. రిక్షా ఎక్కేయ్. శ్రీవారు యిప్పటికే చిందు లేస్తూంటారు వారంరోజుల విరహమాయె." ఛాయ వేళాకోళం చేసింది.

మీనాక్షి భర్త నలభై మైళ్ల దూరంలో ఉద్యోగం చేస్తున్నాడు. వారం వారం వస్తూంటాడు. మీనాక్షి కూడా ఉద్యోగంవల్ల కాపురం పెట్టడానికి వీల్లేక పోయింది.

"నీక్కూడా పెళ్లయితేగాని విరహాలు తెలియవు...బై .." మీనాక్షి రిక్షా ఎక్కి వెళ్ళిపోయింది.

వచ్చినందుకు సినిమా చూసే వెళదామనుకుంది ఛాయ.

కౌంటర్ కేసి వెళ్లబోతుండగా కారు ఆగింది ఎదర. ప్రకాష్ దిగాడు. 'హలో...' తనే ముందుకు వచ్చాడు.

"సినిమాకి వచ్చారా ?"

"సినిమాహాలుకి వంకాయలు కొనడానికి వస్తామటండీ."

ఛాయ నవ్వింది.

రామబ్రహ్మం దూరంగా నించున్నాడు.

"రెండు బాక్స్ తీసుకురండి." ప్రకాష్ చెప్పాడు.

"నేను తీస్తాసార్..."

"భలేవారే... మీరు తియ్యడమేమిటి ?"

రామబ్రహ్మం టిక్కెట్లు తీసుకురాగానే యిద్దరూ లోపలికి వెళ్ళారు. రామబ్రహ్మం గేటుదగ్గర ఆగి "నేను సాయంత్రం కల్సుకుంటానండి" అన్నాడు.

ప్రకాష్ తలూపాడు.

ఛాయకిచ్చే గౌరవం కూడ తన కివ్వకపోవడం రామబ్రహ్మానికి కోపం వచ్చింది. అది ఛాయమీదకి తిరిగింది. రామబ్రహ్మం పళ్లు బిగించి వెళ్లిపోయాడు.

అదో పాత తెలుగు సినిమా. హాలు ఖాళీగానే వుంది. ప్రకాష్ కూర్చున్నాడు. ఛాయ యింకా దూరంగా నిలబడేవుంది, ప్రక్కన కూర్చుంటే ఫీలవుతాడని.

"కూర్చోండి... జనాన్ని లెక్కపెడుతున్నారా ?"

ఛాయ బెరుకుగా కూర్చుంది.

"మీరు తరచుగా సినిమాలు చూస్తారా ?" ఆమెవైపుకి తిరిగాడు. ఛాయ సమక్షంలో అతడికి చాల వుద్వేగంగా వుంది.

నిన్న చూసినప్పట్నుంచి, అంతా ఛాయామయంగానే వుంది.

రాత్రి మందు మాత్రమే పుచ్చుకున్నాడు. 'పదిరూపాయిలిచ్చి ఆమెని పంపెయ్.' డ్రయివర్‌తో చెప్పాడు. ఛాయని చూశాక ఆ 'వారకాంత' సూర్యుడి ముందు దివిటీలా కనిపించింది.

"చూడకేం చెయ్యమండి ? మాకు అందుబాటులోవున్న వినోదం యిదే కదా."

"మాకు అంటే..."

"మధ్యతరగతి వాళ్లకి. సంగీత కచేరీలు, భరతనాట్యాలు వందల టిక్కెట్ల మీద వుంటాయి. ఏం చూస్తామండి ?"

"అంటే మన సినిమాలవల్ల ఏం ఉపయోగం లేదంటారా ?"

"వాళ్లు కాలక్షేపంకోసం తీస్తున్నారు. తోచక మనం చూస్తున్నాం. అంత

కంటె ప్రయోజనం ఏముందిలెండి? కళకోసం యిప్పుడెవరూ సినిమాలు తియ్యడంలేదు. ప్రక్కవాళ్లకి రకరకాల బహుమతులు వస్తున్నా మనవాళ్లకి కసిపుట్టడంలేదు. ఎవరయినా అడిగితే అంత కళమీద ప్రేమ వుంటే మీరు తియ్యకూడదూ అనడుగుతారు."

సినిమా ప్రారంభమైంది.

ఛాయ సినిమా చూస్తోంది.

ప్రకాష్ ఛాయను చూస్తున్నాడు.

ఆరింటికి యిద్దరూ బయటికి వచ్చారు.

"రండి డ్రాప్ చేస్తాను."

"మా యిల్లు దగ్గరేనండి... నడిచివెళ్ళిపోతాను."

"మా కారుకి అదృష్టం కల్పించరన్నమాట."

ఛాయ ఎక్కింది.

"రిఫ్రెష్‌మెంటు తీసుకుందామా?"

ఆమె సమక్షంలో యింకా గడపాలని వుంది.

ఛాయ కాదనలేదు.

డ్రైవర్ ఏ.సి. రెస్టారెంట్ దగ్గర ఆపాడు. ఇద్దరూ రూఫ్ గార్డెన్‌లో కూర్చున్నారు. వెయిటర్ వచ్చాడు.

"మెనూ చూసి ఆర్డర్ యివ్వండి."

"మీకు?" సందేహంగా అడిగింది.

"మీరు తినేవి నేను తినకూడదా?"

వెయిటర్ వెళ్ళిపోయాడు నోట్ చేసుకుని.

ప్రకాష్... తన బాస్. పెద్ద ఆఫీసరు. తనతో యింత చనువుగా ప్రవర్తిస్తున్నాడేమిటి? ఛాయకి అర్థంకాని విషయం.

ఛాయ... తన సబార్డినేటు ఛార్మింగ్‌లేడీ. ఎందుకో మనసు ఈమెని చూడగానే స్పందిస్తోంది. ఎందుకు?

ప్రకాష్‌కి అర్థమైన విషయం.

"మీరు సాయంత్రం మా యింటికి డిన్నర్‌కి రావాలి." హోటల్‌నుంచి బయటికి వస్తూ పిలిచింది. తనమీద ప్రత్యేకత చూపిస్తున్న ఆఫీసర్ని మర్యాదకోసం ఆహ్వానించింది.

"థాంక్యూ... మీ ఆహ్వానం మరోసారి ఉపయోగించుకుంటాను. రాత్రికి నేను ఏలూరు చేరుకోవాలి. రేపు యిన్స్‌పెక్షను వుంది."



ఛాయ కూడ యింటికి స్పందనగానే వెళ్ళింది.

అప్పటికి చీకటిపడింది. వర్ధనమ్మ యింటికి రాలేదు. సోమయాజులు ఎవరికో ముహూర్తం పెడుతున్నాడు వీధిలో.

ఛాయ వంటలో పడింది.

వర్ధనమ్మ సుడిగాలిలా వచ్చింది లోపలికి. "ఎవడితోటే సినిమాకి వెళ్లావుట..."

వర్ధనమ్మ పురాణ వైరాగ్యంతో గుడినుంచి వస్తూండగా రామబ్రహ్మం కనిపించాడు. అతడి మనస్సు ఛాయపై అక్కసుతోవుంది. ప్రకాష్ అని చెప్ప కుండా "పెళ్ళి కావాల్సిన పిల్లండి... అలా తిరుగుతే సంబంధాలు ఎక్కు తాయా ? సినిమాకంటూ ప్రారంభించి లాడ్జీల దాకా వెళతారు..." రంగుపూసి చెప్పాడు.

వర్ధనమ్మలో పురాణ వైరాగ్యం ఎగిరిపోయింది.

ఛాయ ఎవరో చెప్పింది.

"ఇలా గాడిదలా తిరగడానికి వీలుండదని పెళ్ళి వద్దంటున్నావన్నమాట. ఛీ...ఇలా తిరగడం మన యింటా వంటా వుందా ? సినిమాకేనా... యింకా ఎక్కడికైనా వెళ్ళారా ?..."

అనుమానిస్తూ మాట్లాడటం ఛాయకి బాధవేసింది.

"ఇలాంటి బుద్ధితక్కువ పనులు ఎప్పుడూ చెయ్యకు. మన బ్రతుకులకి

మచ్చకూడ వస్తే యిక తరించినట్లే..." వర్ధనమ్మ పెరట్లోకి వెళ్ళిపోతూ అంది.

దొడ్డకి ఎవరు చెప్పారు ???

## 3

దేవయ్య వయసు ఇరవైమీద ఒకటి. వయసు ఎదిగింది. కాని మనసు ఎదగ లేదు. వర్ధనమ్మ గారంతో వాడో మూర్ఖుడిక్రింద తయారయ్యాడు. అయిదో క్లాసుతో చదువుకి భరతవాక్యం పలికాడు. సోమయాజులు పౌరోహిత్యం చెబుదా మనుకున్నాడు.

"వాడినికూడ మీలాగే చేద్దామనా ? వర్ధనమ్మ సాగనివ్వలేదు. తన కొడుక్కి అపారమైన భవిష్యత్తు ఉందని ఆమె నమ్మకం. జాతకంరీత్యా వాడు దొరల ఉద్యోగం చేస్తాడు.

"బట్లరు క్రిందకూడ పనికిరాడు వెధవ." ఇది సోమయాజుల అభిప్రాయం·

"జ్ఞాతివాడిలా అలా వాడ్ని చూసి కళ్ళలో నిప్పులు పోసుకుంటారేం ? వాడికేం బంగారుకొండ, కాలుమీద కాలువేసుకుని తింటాడు." వర్ధనమ్మ కయ్యా నికి దిగేది.

కొడుకుని గురించి యిద్దరూ పోట్లాడుకుంటూనే వుంటారు.

వర్ధనమ్మ మొగుడినోరు మూయించినా అంతరాంతరాల్లో భయం లేకపోలేదు. దేవయ్య భవిష్యత్తు ఏమిటి ? తాము శాశ్వతంకాదు. ఇల్లు తప్ప ఆస్తిపాస్తులు లేవు. ఈ కుర్రాడు ఎలా బ్రతుకుతాడు ? ఛాయ చూస్తుందా ?

ఈ ఆలోచనలతో అప్పుడప్పుడు ఆమెకి నిద్రపట్టదు. జరుగుతున్న కథని తనకి అనుగుణంగా తిప్పుకోవాలని ఆమెకి అనిపిస్తూవుంటుంది. దీనికి సోమయాజుల సాయం బొత్తిగా లభించదు. సంసారం గురించి చర్చించుకునే సామరస్యం వారి మధ్య లేదు.

సోమయాజుల దృష్టిలో రేపు లేదు. ఇవాళ సుఖంగా వెళ్ళిపోతేచాలు. అందుకే అతడి జీవితపత్రం శూన్యంగా వుంటుంది. అర్ధశతాబ్దం పైగా జీవితంలో అతడు పొందిన కొత్త అనుభవం లేదు. నడచిన కొత్తదారి లేదు,గానుగ ఎద్దులా మిగిలాడు.

యుగధర్మాలని గమనించని జీవితాలు అలాగే వుంటాయి సుఖంగా జీవిం చడంమాత్రమే బతుక్కి పరమార్థమని సోమయాజుల్లాంటి ఎక్కువమంది

నమ్ముతూండడంవల్ల పాత విలువలు మారిపోతున్నాయి సమాజం అనిశ్చితమైన స్థితిలో ఈదులాడుతోంది. వ్యక్తి వ్యవస్థకి ప్రతిబింబం.

ఛాయ సంపాదనలో పడ్డాక అతడిలో సోమరితనం ఎక్కువయిపోయింది. పౌరోహిత్యం తగ్గించుకున్నాడు. పేకాటలో కూర్చోవడంతో అదే తగ్గిపోయింది. వృత్తిలో ప్రవేశించిన తొలిరోజులకీ ఇప్పటికీ చాలా తేడా కనిపిస్తోంది. అప్పుడు సోమయాజులుమాట వేదంలా నమ్మేవారు జనం. ఇప్పుడు జనం చెబితే అతడు తలూపుతున్నాడు. అలా చేస్తేనే గౌరవం వుంటోంది.

శిధిలమైపోతున్న ఓ సనాతనమైన సంస్కృతికి అతడు ప్రతినిధి. పూజలు, వ్రతాలు అంటూ తమబాగుకోసం 'బ్రాహ్మలు' మిగతావార్ని వంచిస్తున్నారని ఎక్కువ వర్గాలలో ప్రచారం వుండటంవల్ల పౌరోహిత్యుల పాత్ర తగ్గింది. పరుగు పందెంలా కాలాన్నిబట్టి పరిగెత్తేమనిషి ఎల్లప్పుడూ గతాన్నే ఆదర్శంగా భావించడు.

సోమయాజులకి దూరదృష్టి లేకపోవడంవల్లనే ఈనాడు కుటుంబం ఛాయ మీద ఆధారపడిపోయింది. "నిలబడి నీళ్ళు త్రాగితేచాలు"- ఇది సోమయాజుల ఆదర్శం. అందుకే అతడి జీవితం, కుటుంబంకూడ నీళ్ళుకారిపోయాయి.

దేవయ్యకి తరచు ఆరోగ్యం పాడవుతూంటుంది. మితిమీరి తినడంవల్ల, ఓసారి కళ్ళు తేలేస్తే, "నీ కొండకొస్తాం వెంకట్రమణా!" అంటూ వర్ధనమ్మ మొక్కేసింది.

ఛాయకి బోనస్ రావడంతో వర్ధనమ్మ ఆలోచన ఆచరణలోకి వచ్చింది.

"తిరుపతి వెళ్లొద్దామా అమ్మాయ్?" లాంఛనంగా అడిగింది.

"అలాగే దొడ్డా, ఎప్పుడోప్పుడు వెళ్ళాల్సిందేకదా!"

సోమయాజులు తాను ఇంటిదగ్గర వుంటానన్నాడు. కాని వర్ధనమ్మ ఒప్పుకోలేదు. "ఇల్లు పీకి పందిరేస్తారు...నడవండి, ఇక్కడేం రాచకార్యాలు మునిగిపోవడంలేదు."

ఛాయ టిక్కెట్లు రిజర్వు చేసింది.

తన యాత్ర గురించి వర్ధనమ్మ ఊరంతా ప్రచారంచేసింది. వెంకయ్యగారి విధవప్పగారికి అదేదో అమెరికా ప్రయాణంలా తోచింది.

"అదృష్టవంతురాలివే...వర్ధనా...ఛాయమ్మ యాత్ర చేయిస్తోంది."

"దాని ముఖం అది చేయించేదేమిటి?"

"దాని డబ్బుతోటే కదే వెళుతూంట." వెంకయ్యగారి విధవప్పగారు అక్క-

సుగా అంది. నలభై దగ్గరపడుతున్నా తను అంతర్వేది కూడ చూడలేదు. ఆమె కొడుకు, కోడలు దేనికీ పడనివ్వరు.

"ఇన్నాళ్ళూ పెంచితేకదా అది నాలుగు రూపాయలు తెస్తూంట." పెళుసుగా అంది వర్ధనమ్మ. ఛాయమీదపడి బ్రతుకుతున్నారని వెంకయ్యగారి విధవప్పగారన గానే మండిపోయింది.

నిజానికి ఛాయగురించి ఆమె ఖర్చుపెట్టిందేంలేదు. మరది రెండెకరాలు, ఛాయని వర్ధనమ్మ చేతిలో పెట్టాడు. ఛాయ పెరిగాక తను సమాధానం చెప్ప వలసి వస్తుందని చిన్నప్పుడే పొలం అమ్మివేసింది వర్ధనమ్మ తెలివిగా.

"నువ్వు కనుక దాన్ని ప్రయోజకురాలిని చేశావు." వెంకయ్యగారి విధవప్ప గారు మరో చురక వేసింది. విషయం వచ్చినపుడు ఒకర్నొకరు దెప్పుకుం టూనే వుంటారు. కొన్నాళ్ల ముఖాలు చూసుకోరు. తర్వాత మళ్ళీ చచ్చేంత ఆప్యాయతలు నటించుతారు.

"ఉత్త కుళ్ళుముండ." వర్ధనమ్మ యింటికి వచ్చేసింది.

నాలుగురోజుల ముందటినుంచీ వర్ధనమ్మకి సామాను సర్దుకోవడంతోనే సరిపోతోంది. ఈ ప్రయాణం ద్వారా మళ్ళీ ఛాయతో మాట్లాడుతోంది. రామ బ్రహ్మన్ని చేసుకోలేదని యిన్నాళ్ళూ ముఖం మాడ్చుకుని వున్నది.

ఓ అరగంట ముందుగానే స్టేషనుకి చేరుకున్నారు.

సోమయాజులు ఎర్రంచు చలువపంచి, ఉల్లిపొరలాంటి లాల్చీవేశాడు. పైన శాలువా కప్పుకున్నాడు. సెంటుతో ఘుమఘుమలాడిపోతున్నాడు.

"అమ్మా...నాన్న అచ్చు పెళ్ళికొడుకులా వున్నాడే."

"ఈ రాక్షసి వుండగా నాకు పిల్లనిచ్చేదెవర్రా ?"

"ఇస్తే చేసుకుందామనివుందా ?" వర్ధనమ్మ వెటకరించింది.

"నువ్వు ముసలిపీనుగు వయిపోయావు..."

"మనం బాలా కుమారులయ్యామా ?..."

"నాకేమే...మా నాన్న కట్నానికి ఆశపడి నిన్ను అంటగట్టాడు కాని లేక పోతే మా అవధాన్లు మామయ్య కూతుర్ని చేసుకుందును. అది ఇప్పటికీ గజ్జెల గుర్రంలా వుంటుంది."

పెళ్ళయిన పాతికేళ్ళకు విచారిస్తున్నాడు పెదనాన్న ! ఛాయకు నవ్వు, కోపం కూడ వచ్చాయి. ఈ అర్థంలేని ప్రసంగం పోట్లాటకే దారితీస్తుంది. పరాయిచోటన్న జ్ఞానమైనాలేదు. తోటిప్రయాణీకులు వీళ్ళనిచూసి నవ్వు కోవడం ఛాయకి తలనొప్పి లేచినట్లయింది.

మరచెంబు ఇచ్చి "పెదనాన్నా...నీళ్లపట్టుకురా..." అంటూ సోమయాజులిని పంపివేసింది.

"తిరగడం తప్ప ఎందుకూ నిర్వాకంలేని మనిషి." వర్ధనమ్మ సణుక్కుంది.

తిరుపతి చేరేసరికి ఏడుగంటలయింది.

"క్రింద విశ్రాంతి తీసుకుని సాయంత్రం కొండ ఎక్కుదాం." సోమయాజులు అన్నాడు.

"మళ్ళీ ఇక్కడ ఎందుకు...నడవండి..." వర్ధనమ్మ ఒప్పుకోలేదు.

తను దొడ్డమ్మనే ఫాలో అవ్వాలని ఛాయకి తెలుసు. వెంటనే బస్సుటిక్కెట్లు తెచ్చింది. కొండమీదికి వెళ్లేసరికి ఎనిమిదిన్నర అయింది.

కాటేజీ తీసుకున్నారు.

టిఫిన్ పట్టుకువస్తానని సోమయాజులు వెళ్ళాడు.

"స్నానంచేసి దర్శనానికి వెళ్ళిపోదాం దొడ్డమ్మా. ఖాళీగా కూర్చోవడమెందుకు?"

వర్ధనమ్మ ఒప్పుకుంది.

ఛాయ బట్టలకోసం పెట్టె తాళంతీసింది. పైన పర్సు కనిపించలేదు. ఛాయ కంగారుపడి పెట్టంతా వెతికింది. పర్సు లేదు.

"దొడ్డమ్మా...పర్సు తీశావా?" బాత్‌రూం దగ్గరకెళ్ళి అడిగింది.

"లేదే..."

"పర్సు కనిపించడంలేదు..."

"మీ పెదనాన్న తీశారేమో..." వర్ధనమ్మ తడిబట్టలతో బయటికి వచ్చింది.

"తాళం నీ దగ్గర వుందికదా?"

వర్ధనమ్మకి పాలుపోలేదు...తనూ వచ్చి నాలుగూ వెతికింది. ప్రయాణం డబ్బు ఏడువందలూ అందులో వుంది. ఇప్పుడెలా వెళ్ళడం?

జరిగిన అఘావానికి యిద్దరికీ మతిపోయింది.

దేవయ్య రాత్రి కొనుక్కున్న వేరుశనక్కాయలు మంచంమీద పడుకుని ఫలహారం చేస్తున్నాడు.

"ఏరా రాత్రి పెట్టె తీశావా?" ఛాయ అడిగింది.

విజయవాడ దాటాక అందరూ నిద్రపోతున్నారు. దేవయ్యకి అప్పుడే భోంచేసినా ఆకలివెయ్యసాగింది. పెట్టెలో చేగోడీలున్నాయి. పెట్టె క్రిందికి దించాడు. తాళం, తల్లి కొంగున కట్టుకుంది. తాళం తీసుకుని పెట్టె తీశాడు. ఇదంతా ప్రక్కన సూటువాలా చూస్తున్నాడు.

దేవయ్య పర్సు అపీ క్రిందపెట్టి చేగోడీల డబ్బామీద పడ్డాడు. సమయం చూసి సూటువాలా పర్సు జేబులో పడేసుకున్నాడు.

దేవయ్య గమనించలేదు.

సూటువాలా డబ్బుతీసి పర్సు బయటికి విసిరివేశాడు.

"చేగోడీలు తీసుకున్నాను."

"పర్సు ఏంచేశావ్ ?"

"పర్సు నా కెందుకు ?"

"ఓరి దిక్కుమాలిన వెధవ. నిన్ను పెట్టె ఎవరు తియ్యమన్నారు ? మమ్మల్ని లేపకపోయావా ?" వర్ధనమ్మ చిరాకుతో రెండు వేసింది.

దేవయ్య ఆరునొక్కరాగం తీశాడు.

"పూర్కో దొడ్డా...వాడికి తెలియదు. ఏమంటే ఏం లాభం." ఎంతసేపూ జరిగినది తలచుకుని ఆవేశపడటంకంటే, ముందర చెయ్యవలసింది చూడటం మంచిదని ఛాయ ఆలోచన.

"ఊరు దాటితే డబ్బులేకుండా ఏంచెయ్యగలమే ?" వర్ధనమ్మకి భయం ఎక్కువైంది.

గంటయినా సోమయాజులు రాలేదు.

"ఈయనీ వరుస...బాగా దొరికారు ! ఇదంతా నా ఖర్మ."

ఛాయ చెప్పులు వేసుకుని "గొలుసు అమ్మి డబ్బులు తెస్తాను దొడ్డా. తలుపేసుకో" అన్నది.

అంతకంటే మార్గం వర్ధనమ్మకి తోచలేదు. "త్వరగా రామ్మా."

ఛాయ తన మెడలోని గొలుసు తీసి పొట్లంకట్టి బయలుదేరింది మైకులో పురాణపఠనం వినిపిస్తోంది. ఛాయ కళ్ళు పెదనాన్నకోసం వెతుకుతూనే వున్నాయి.

ఆమె ప్రక్కగా కారు ఆగింది. ఛాయ వెనక్కి తిరిగింది.

ప్రకాష్ !

ఆశ్చర్యం, ఆనందం. అడివిలో దారితప్పి తిరుగుతూండగా చక్కటి తారు రోడ్డు కనిపించినప్పుడు కలిగే సంతోషం ఛాయలో కలిగింది.

"మీరు ఒక్కరే వచ్చారా ?" ప్రకాష్ పలకరించాడు.

"కుటుంబంతో..."

"పెళ్ళికా ?" ప్రకాష్‌లో చేదు ధ్వనించింది.



ఛాయ అడ్డంగా తలూపింది. "మా దేవయ్య మొక్కు. డబ్బుపోయింది. నగ అమ్మి డబ్బు తెద్దామని బయలుదేరాను. కొంచెం హెల్ప్ చేయండి. ఎక్కడ అమ్మాలో..."

ప్రకాష్ కారు దిగి వచ్చాడు.

"మహిళా దశాబ్దంలో మగవారి సాయమెందుకండీ ?"

ఛాయ గొలుసు తీసి ఇచ్చింది.

"భలేవారే...అది ముందర మెడలో వేసుకోండి...చంద్రుడు లేని ఆకాశంలా వెలవెలపోతోంది." అంటూ పర్సుతీసి పదివందలు ఆమె చేతిలో పెట్టాడు.

ఛాయ సందేహించింది.

"ఆపదలో కూడ ఆలోచనేనా?"

"సగం చాలండి."

"ఉంచండి, మీ దేవయ్య మళ్ళీ ఏదైనా ఫీట్ చేస్తాడు."

"ఇంటికి వెళ్ళగానే పంపిస్తాను."

"అంత కగారేం లేదండీ...ఎక్కండి...కాలేజి దగ్గర డ్రాప్ చేస్తాను."

వర్షం వెలిశాక వచ్చిన ఎండలా వుంది ఛాయ అంతరంగం. ప్రకాష్ కనిపించకపోతే ఎంత అవస్థ అయ్యేదో ? ప్రకాష్ పట్ల కృతజ్ఞత నిండిపోయింది ఆమెలో.

బస్‌హాల్ట్ దగ్గర సోమయాజులు తచ్చాడుతున్నాడు. ఛాయ పిలిచింది. సోమయాజులు చేతిలో పొట్లాలు, మరచెంబు ఉన్నాయి.

"ఇంకా గదికి వెళ్ళలేదా ?"

"నెంబరు తెలియక తిరుగుతున్నానమ్మాయ్ యిందాకట్నుంచీ

సోమయాజుల్లాంటివారు గుమ్మం దిగితే ఎందుకూ పనికిరారు ఉత్తర కుమారులు వారు. ఛాయకనిపించకపోతే సాయంత్రమైనా అలా తిరుగుతూండే వాడే.

కాటేజి దగ్గర దింపి ప్రకాష్ వెళ్ళిపోయాడు, 'మళ్ళీవస్తా' నంటూ.

ఛాయ మెడలో గొలుసుచూసి "అమ్మ్మడవలేదా ?" అని కంగారుగా అడిగింది వర్ధనమ్మ. జరిగినదంతా ఛాయ చెప్పింది.

"దేవుడిలా వచ్చాడు" వర్ధనమ్మకి స్థిమితం చిక్కింది.

డబ్బుపోయిందని తెల్సి సోమయాజులు ఎగిరెగిరి పడ్డాడు. "పుండాకోర్ వెధవ...ఏబ్రాసి పీనుగ...ఏడు నూర్లు ఎలా తగులపెట్టావురా ?"

కొడుకుని కొట్టడానికి దగ్గరకెళ్ళాడు. దేవయ్య తల్లిప్రక్కన దాక్కున్నాడు.

"మనకి కొడుకు వాడు......కాఫీలు తేవడానికి వెళ్ళి అంతా తిరుగుతూ కూర్చున్నాం. మనకి లేని తెలివి మన కొడుకెక్కలా వస్తుంది ?"

ఛాయ విడదీసి గుడికి ప్రయాణం చేయించింది.

దర్శనమై భోజనంచేసి కాటేజికి వచ్చేసరికి రాత్రి ఎనిమిదయింది. అలస టతో అందరూ నిద్రకి ఒరిగిపోయారు.

తెల్లవారగానే వర్ధనమ్మ పాపనాశనం ప్రయాణానికి తయారైంది.

"మీరు వెళ్ళిరండి దొడ్డా...పులపరంగావుంది నాకు" అన్నది ఛాయ.

ఛాయ రాకుండా వెళ్ళడానికి వర్ధనమ్మ భయపడింది. సోమయాజులపై ఆమెకి నమ్మకంలేదు. "ఏదో మందు మ్రింగావుకదా...రా ? మళ్ళీ ఇంతదూరం మాటిమాటికి రాగలమా ?"

"నా కసలు తేవాలని లేదు....ఛాయ తిరిగి అలసటగా పడుకుంది.

"ఎక్కడికెళ్ళినా వచ్చేసరికి రోగాలు సిద్ధం." వర్ధనమ్మ విసుక్కుంది.

"దాన్నియిబ్బంది పెడతావెందుకే...మనం వెళ్లొద్దాంరా ?" సోమయాజులు ప్రయాణమై లేచాడు. కొడుకుతో నువ్వు అక్కకు సాయంగా వుండు" అన్నాడు.

"నేనూ వస్తాను" గుండు రాసుకుంటూ దేవయ్య పేచీ పెట్టాడు.

"అసలు మనం వాడికోసమే వచ్చాం. వాడు రాకపోతే ఎలా ?" కొడుకుని కూడ వర్ధనమ్మ తీసుకెళ్ళాలనుకుంది. ఛాయకి సాయంగా వాడెందుకు ?

వాళ్ళు వెళ్లేసరికి గాలివాన వెలిసినట్లయింది. ఛాయ తలుపు వేసుకుని పడు కుంది. "ప్రతిదానికి రాద్ధాంతం చేస్తారు..."

చిన్న కునుకు పడుతోంది. తలుపు చప్పుడవుతోంది.

అప్పుడే వచ్చేసారా? ఛాయ తలుపు తీసింది.

"పడుకున్నారా.?" ప్రకాష్ లోపలికి వచ్చాడు. వెంట అతడి తల్లి నీలాంబరి కూడ వుంది. ప్రకాష్ పరిచయం చేశాడు.

అవిడకి ఛాయ నమస్కరించింది.

నీలాంబరి ఉదాసీనంగా కూర్చుంది. అవిడలో ధనిక దర్పం పూర్తిగావుంది. కొడుకు ప్రత్యేకంగా తమకంటే క్రిందివాళ్ళ దగ్గరకు తీసుకురావడం ఆవిడకి నచ్చలేదు.

ఛాయ ఫ్లాస్క్ తీసుకుంది కాఫీ తేడానికి.

"నో ...ఇక్కడకూడ ఫార్మాలిటీసా... ?" ఇప్పుడే త్రాగి వస్తున్నాం, అన్నట్లు మీ సైన్యం ఎక్కడ?"

"పాపనాశనం వెళ్లారు."

"నువ్వెళ్ళలేదేం?" నీలాంబరి ప్రశ్నించింది.

"జ్వరంగా ఉందండి"

"అరె చెప్పారుకాదేం...రండి మా డాక్టర్‌కి చూపిస్తాను."

"వద్దండి...రెస్టుతీసుకుంటే చాలు."

"ఇవాళ ఉంటారా ?"

"మా వాళ్ళు రాగానే బయలుదేరతాం."

"మేం ఒంటిగంటకి బయలుదేరతాం. రెడీగా వుండండి. మా కారులో కలిసి వెళ్ళిపోదాం ?"

"వద్దండి..." అన్నివేళలా అతడి సాయాన్ని పుచ్చుకోవడం ఛాయకి రుచించలేదు.

"భలేవారే... మీకు ముఖమాటం ఎక్కువ."

నీలాంబరికి తన అంతస్థు ఎప్పుడూ జ్ఞాపకం వుంటుంది. తనతో సమానంగా వర్కింగ్ గర్ల్ కుటుంబం రావటం ఆవిడకి రుచించలేదు.

"వేరే ప్రయాణం వుందేమో... నువ్వు బలవంతం చేస్తావెందుకురా ?"

"తిరుపతిలో ఆగుతారా ?"

"డైరెక్ట్‌గా యింటికే."

"ఇంకేం... ఒంటిగంటకి రడీగా వుండండి. ఇంకేం చెప్పొద్దు."

"అదికాదండీ..."

"మీరు నా సబార్డినేటని మరచిపోయారు." వేళాకోళంగా అన్నాడు.

"సారీ... సర్."

కోర్టులో ముద్దాయిని అడిగినట్లు నీలాంబరి ఛాయ వివరాలు అడిగింది. అందులో స్నేహమేంలేదు, కాలక్షేపధోరణి తప్ప. అది గమనించి ఛాయ ముభావంగా మాట్లాడింది.

"ఏమిటో ఆడపిల్లలు ఉద్యోగాలంటూ రోడ్డెక్కేశారు. కాలం మారి పోయింది. వీళ్లు కూడ సంపాదనలో పడితే యిక కుటుంబాన్ని చూసేదెవరూ?" నీలాంబరి వ్యాఖ్యానించింది.

నీలాంబరి వెండి చెంచాతో పుట్టింది. పెరిగింది. భరతముని భార్య కావడంతో వైభవం పెరిగింది. భరతముని కలపవ్యాపారంతో జీవితాన్ని ప్రారంభించి, షేర్లబ్రోకరేజీలో పైకి వచ్చాడు. అప్పటినుంచి రేసుగుర్రంలా ముందుకే తప్ప వెనక్కి చూడలేదు.

భరతముని రూపాయిలచేత సర్కస్ చేయించాడు. అనేక కంపెనీలు పెట్టాడు. అన్నీ రాణించాయి. పెద్దవాడయ్యాడు. దేశమంతటా అల్లుకు పోయాడు. సాహసం, వేగంతో అతడి ప్రగతి మంచి ఫలితాలనిచ్చింది

స్థిరమైన వుద్రేకం సత్ఫలితాన్నిస్తుంది. తాత్కాలికమైన వుద్రేకం చేటు తెస్తుంది జీవితాన్నుంచి పూర్తిగా లాభాలు పిండుకోవాలని ఆశపడేవారు సెంటి మెంట్లకి దూరంగా వుండాలి. భరతముని అదేపనిచేశాడు.

షష్ఠిపూర్తి వయసు దాటుతున్నా, యిరవైలో వున్న ఉత్సాహం వుంది. అభినివేశం. వుంది హఠాత్తుగా విమానప్రమాదంలో కన్నుమూశాడు.

ప్రకాష్ చదువు ముగించి అమెరికానుంచి అప్పుడే వచ్చాడు అప్పట్నుంచి తండ్రి కంపెనీలను స్వయంగా చూసుకోసాగేడు.

ఎప్పుడు వెళ్ళిపోతుందా అనిపించింది ఛాయకి

ప్రకాష్ ఆమె ధోరణి గమనించాడు. తల్లి అతి ప్రవర్తన అతడికీ విసుగే. రంగుటద్దాల్లో లోకం రంగుగానే కనిపిస్తుంది. ఐశ్వర్యం మధ్య నిలబడే నీలాంబరిలాంటివారికి లోకం యొక్క క్రూరత్వం తెలియదు. అసలు వారికి జీవితమే అర్థంకాదు.

"వస్తాం... టేక్ రెస్ట్. సిద్ధంగా వుండండి..." ప్రకాష్ వెళ్ళిపోయాడు.

వర్ధనమ్మవాళ్లు వచ్చేసరికి ఛాయ సామాను సర్దుకుని కూర్చుంది.

"అదేమిటే... కాళహస్తీ అవీ వెళ్లొద్దూ?" ప్రయాణం మాట విని వర్ధనమ్మ ముఖం మాడ్చుకుంది. వెయ్యి రూపాయిలకి సరిపడ్డ యాత్రలు చేసెయ్యాలని ఆమె తలంపు.

"మరోసారి వద్దాంలే... నాకు సెలవు లేదు కదా."

ఒంటిగంటకి ప్రకాష్ వచ్చాడు. తండ్రీ కొడుకులు ముందర కూర్చున్నారు. ఆడవాళ్లు వెనుక ఎక్కారు. కారు బయలుదేరింది.

గుండు... ఎర్రచొక్కా... పెద్ద టోపీ- దేవయ్యని చూడగానే నీలాంబరికి నవ్వాగలేదు. "ఈ బఫూన్ కుర్రాడెవరు ?"

వర్ధనమ్మ చిన్నబుచ్చుకుంది. "మా చిరంజీవండి."

సోమయాజులుకి కారుప్రయాణం దివ్యంగా వుంది. "అయ్యా ! మీవల్ల రైలు ఖర్చులు తప్పాయి. సుఖంగా వుంది ప్రాణం."

"నాన్నా మనం కూడ యిలాంటి కారు కొనుక్కుందాం."

"అలాగేనోయ్ !"

"నువ్వు పెద్ద బ్రాకెట్ కొట్టు. ఇంచక్కా కారులో తిరుగుదాం మనం."

"నా జాతకరీత్యా జూదంలో గెలుస్తానని వుందండీ. ఆ మధ్య మద్రాసు పెళ్ళి కెళ్ళినపుడు గిండీ వెళ్లాను. వెంట్రుకవాసిలో తప్పిపోయింది జాక్‌పాట్... లేకుంటే నాలుగు లక్షలు..."

వర్ధనమ్మ కూడా నీలాంబరి నగలు వగైరా పరిశీలించి "ఏమాత్రం వుండేమిటి మనకి ఆస్తి...?" అని అడిగింది.

"పరమేశ్వరుడిచ్చినంత." కరకుగా వచ్చింది జవాబు.

"ఇంకా అబ్బాయికి పెళ్ళి చేయరా ? అవున్లెండి మీకు లక్షలమీద కట్నాలు రావాలి. అప్పటిదాకా చెయ్యరు. ఇంతలో వాళ్లే ఏ టక్కులాడినో 'కోడలు' అంటూ తెస్తారు."

తనవాళ్ల ప్రవర్తనకి ఛాయ సిగ్గుపడిపోయింది. ఛీ... యింగితం లేని మనుషులు. ఎక్కడెలా ప్రవర్తించాలో యిప్పటికీ తెలియదు.

కావలిలో కాఫీకి ఆగినపుడు ఛాయ ఆంగ్లంలో క్షమార్పణ చెప్పుకుంది.

"గులాబీలకి ముళ్లుంటాయి మరి." ప్రకాష్ నవ్వాడు.

తొమ్మిదింటికి విజయవాడ చేరుకున్నారు.

"ఈ రాత్రి మా యింట ఆతిథ్యం స్వీకరించాలి," అన్నాడు ప్రకాష్ యింటి దగ్గర కారు ఆపుతూ...

"అమ్మగారు భోంచెయ్యలేదు బాబూ !"

పాలు తెచ్చిన నాయర్ చెప్పాడు. రాత్రి భోజనం కాగానే పాలు త్రాగడం ప్రకాష్‌కి అలవాటు. పాలు రెండు గుక్కల్లో త్రాగి తల్లి గదిలోకి వెళ్లాడు.

నీలాంబరి నిద్రపోవడంలేదు మోచేతులమీద అనుకుని వుంది.

"అమ్మా ఒంట్లో బాగాలేదా ?" ఆమె ప్రక్కన కూర్చున్నాడు.

సమాధానం చెప్పకుండా నీలాంబరి కూర్చుంది. కొడుకుని సునిశితంగా పరీక్షిస్తూ" ఆ అలగా జనాన్ని యింటి కెందుకు తీసుకొచ్చావ్ ?" గద్దించింది.

తల్లి కోపం అర్థమైపోయింది.

"వాళ్లు ఎలాంటివాళ్లవుతునేం. ఛాయగురించి కాని."

"ఆ పిల్ల ఎక్కువేమిటి ?"

ప్రకాష్ లేచి సోఫాలో కూర్చున్నాడు. పెద్దతనం వచ్చినకొద్దీ తల్లికి చాదస్తం ఎక్కువయిపోతోంది. తనకి నచ్చని విషయాలన్నీ చెడ్డవే. ఎదుటి వారిని ఏమాత్రం అర్థంచేసుకోదు.

ఆమె ధోరణి ప్రకాష్‌కి అశాంతినిచ్చినా శాంతంగానే, "ఛాయని చూడగానే నీకేమనిపిస్తోందమ్మా ?" అనడిగాడు.

"జీతంకోసం మనదగ్గర పనిచేసే పిల్లనిపించింది. నీ కంతకంటె ఎక్కువనిపిస్తోందా ?"

"ఛాయ ఈ యింటికి గృహిణిగా రావాల్సిన పిల్లనిపిస్తోంది."

నీలాంబరి ఆవేశంగా దగ్గరికి వచ్చింది. "ఓహో... అంతదాకా వచ్చిందన్న మాట ప్రొద్దుటినించీ అనుమానిస్తూనే వున్నాను. ఆ ముష్టిదా నాకు వారసురాలు? ఆ పిల్ల మైకంలోపడి నీ సంగతి నువ్వు మరచిపోతున్నావన్నమాట..."

"అవునమ్మా... ఛాయ డబ్బు లేనిదే. మనకి కట్నాలు కానుకలు అవసరం లేదు. మన సాంప్రదాయాన్ని మన్నిస్తూ మనలో కలిసిపోయే పిల్ల చాలు. ఛాయలో ఆ లక్షణాలు వున్నాయి."

"ఆమె అందం తప్ప నీకేమీ కనిపించడంలేదు. ఇలాంటి దిక్కులేని సంబంధం చేసుకుంటే మన బంధువులు నవ్వర్రా ? మీ నాన్నగారి గౌరవం గంగలో కలుపుతావన్నమాట."

"ఆవేశపడకుండా ఆలోచించు... నీలోని అసంతృప్తి ఛాయంటే అయిష్టం కల్గిస్తోంది. ఛాయవల్ల యింటి గౌరవం పెరుగుతుందేకాని తరగదు."

''శభాష్... తల్లికే పాఠాలు చెబుతున్నావ్. ఆ పిల్ల పెళ్లాం కాకముందే నా నోరు మూయించాలని చూస్తున్నావు. పెళ్లయితే నా గతేమిటో ?"

"ష్... ఏమిటా అర్థంలేని మాటలు ?"

నీలాంబరిలో చైతన్యం ముడుచుకుపోయింది. కొడుకు పెళ్లి యిన్నాళ్లూ ఆమెకి అందమైన కల. ఆమె కోరుకుంటున్నది, ప్రకాష్ వివాహం సుఖ ప్రదం కావాలని కాదు. కోడలు తమకి సమవుజ్జీ కావాలి. ప్రకాష్ భార్యగా కాకుండా తన కోడలుగా ముందు రాణించాలి. కోడలు ముందర తన వ్యక్తి త్వాన్ని మన్నించాలి. ఆరాధించాలి.

అలాంటి పిల్ల యింద్రాణి. మేనకోడలు. రెండు మూడుసార్లు ఇంద్రాణి విషయం ప్రకాష్‌కి సూచించింది.

భౌతికంగా ఈనాడు దూరాలు తగ్గాయి. గ్రహాంతర పయనమే తేలికయింది, కాని మానసికంగా వ్యక్తికీ వ్యక్తికీ మధ్య దూరం ఎక్కువైపోయింది. ఆటవిక సమాజంలో వున్న ఐక్యత, చైతన్యం చిందులువేసే ఈనాడు లేదు. మనిషి నాగరికతని నేర్చుకుంటూ పోతున్నాడు. మానవతని మరచిపోయే ప్రయత్నం చేస్తున్నాడు. ఇదే వ్యక్తుల మధ్య, వ్యవస్థల మధ్య సంఘర్షణకి కారణం.

"ఇంద్రాణిని చేసుకోకపోడానికిది కారణమన్నమాట." నీలాంబరి స్వగతంగా తర్కించుకుంది, మంచంపై కూర్చుంటూ.

"ఇష్టంలేని పెళ్ళి చేసుకుని అవస్థపడమంటావా ?"

"ఇంద్రాణికేం తక్కువ ? కురూపా ? చదువు లేదా ?"

"ఆమెకి ఏదో తక్కువనికాదు, భార్యగా నచ్చక. నా పెళ్ళికీ యితర విషయాలకూ ముడిపెట్టకు. ఛాయ నాకు నచ్చింది. నువ్విష్టపడితే పెళ్ళిచేసుకుంటాను."

"నా యిష్టంలేకపోయినా చేసుకునేలావున్నావ్."

ప్రకాష్ చిరాగ్గా లేచాడు. "నువ్వు ఆ భయం పెట్టుకోకు. నీకిష్టం లేకపోతే పెళ్ళి జరగదు. నా పెళ్ళి విషయం యిక చర్చించక."

"ఈ పిల్లని తప్ప మరి చేసుకోవా ?"

''............"

ప్రకాష్ పట్టుదల ఆమెకి తెలియనిదికాదు. తనకి తెలియకుండా పెళ్ళి చేసుకుని మరోచోట కాపురం పెడితే !... నలుగురూ తనని పరామర్శిస్తారు. అప్పుడు వెర్రిముఖం వేయాలి. అంతదాకా రానివ్వకుండా తన గౌరవం దక్కించుకుంటే చాలు !

"సరే... కాపురం చేసేపాడివి నువ్వు. నీకు లేని పట్టుదల నాకెందుకు ? అలాగే కానీ ! రాసిపెట్టింది తప్పుతుందా ?"

ప్రకాష్ మోము వికసించింది. "మనస్ఫూర్తిగా అంటున్నావా ?"

"ఛాయ నా కోడలు!" నీలాంబరన్నది

ప్రకాష్ తల్లి భుజాలు పట్టుకుని, "నువ్వెంత మంచిదానివమ్మా!'' బయటికి పరుగుతీశాడు. తల్లి యింత తేలికగా అంగీకరిస్తుందనుకోలేదు. ఈమాత్రం చర్చతో ముగియడంతో తేలికపడ్డాడు.

ప్రకాష్ గెస్ట్ రూంకేసి దారితీశాడు. అతడి మనస్సు చాల ఉద్వేగంగా వుంది. ఈ వార్త ఛాయకి చెప్పాలి. ఇంతవరకు ఆమెని సంప్రదించక పోవడంతో కొంచెం సంకోచపడ్డాడు. మొదటే ఆమెని అడిగి వుండాల్సింది. వివాహానికి ఆమె సుముఖంగా లేకుంటే...?

అలా జరగదు. ఛాయ తనని నిరాకరిస్తుందా ? ప్రకాష్ మనసు అహంతో నిండిపోయింది ఛాయ కూడ తనంటే యిష్టపడుతోంది. లేకపోతే తను చెప్పినట్లు వింటుందా ?

వర్ధనమ్మ నిద్రపోతోంది. ఛాయ రేడియో వింటూ సోఫాలో కూర్చుంది. సోమయాజులు యిల్లంతా పరిశీలించి అప్పుడే వచ్చాడు. చాల ధనవంతులు అనే నిర్ణయానికి వచ్చేశాడు. ఎంత ఆస్తి వుంటుందని గుమస్తా పరమహంసని అడిగాడు.

"నీ కెందుకయ్యా...పో." సోమయాజులు వైఖరి చూసి విసుక్కున్నాడు.

దేవయ్య స్ప్రింగ్‌కాట్ మీద గంతులేస్తూ ఆనందిస్తున్నాడు. మంచం ఎగరటం వాడికి అద్భుతమైన విషయాల్లో ఒకటి. గోడమీదున్న పులి చర్మం, లేడితలలు చూసి "ఈ బొమ్మలేంటి నాన్నా ?" అనడిగాడు.

"బొమ్మలు కాదురా... నిజంవే... వేటకి వెళ్ళి తెచ్చారన్నమాట."

"వేటకి నువ్వెప్పుడూ వెళ్లవేం నాన్నా ?"

"మనం భోజనం వేటగాళ్లంరా !" సుష్టుగా భోంచెయ్యడంవల్ల సోమయాజులకి నిద్ర ముంచుకువస్తున్నది.

ప్రకాష్ గుమ్మంలో నించున్నాడు.

"అక్కా... కారాయన... కారాయన" దేవయ్య కేకవేశాడు.

ఛాయ తిరిగి చూసి లేచి వెళ్ళింది.

"ఎలా వుంది మీ ఆరోగ్యం?"



"తగ్గినట్లే."

"నిద్రపోతారా ?"

"కుంభకర్ణుడు నాకేం చుట్టంకాదు "

"రండి, కాస్సేపు కూర్చుందాం."

మేడమీద ఓపెన్ ఎయిర్‌లో కూర్చున్నారు. మిన్ను మన్నూ మూగనోము పట్టాయి. వాన రాత్రి వెన్నెల బొగ్గుపై పిండి చల్లినట్లుంది.

ప్రకాష్ ట్రాన్సిస్టర్ ఆన్‌చేశాడు. నాదస్వరం వస్తోంది. అలికిడయితే చూసింది ఛాయ మెట్లదగ్గర దేవయ్య.

"ఏరా... ఏం ?..." ఛాయ అడిగింది.

"నువ్వేంచేస్తున్నావో చూసిరమ్మన్నాడు నాన్న."

ఛాయ సిగ్గుతో తలవంచుకున్నది.

"దేవయ్యా... ఆ గదిలో ఆపిల్‌పళ్లున్నాయి. తింటూ కూర్చో" అన్నాడు ప్రకాష్.

తిండి సంగతి చెబితే దేవయ్య పరుగుతీస్తాడు.

"మిమ్మల్ని అనవసరంగా తీసుకువచ్చారు." ఛాయ నొచ్చుకుంది. తన వాళ్ల ప్రవర్తన తనకే వెలపరంగా వుంది.

"ఫూల్స్‌ని గురించి నేనేం ఆలోచించను. వాళ్లని గురించి వర్రీకాకండి."

ప్రకాష్ సిగరెట్ వెలిగించుకుని కుర్చీలో వెనక్కి వాలాడు. విషయం చెప్పడానికి తడుముకుంటున్నాడు. మాటలు అందడంలేదు.

ఛాయ నాదస్వరం వింటూ కూర్చుంది.

"చూడండి...నా గురించి మీకు తెలుసు. మా పరిస్థితి స్వయంగా చూశారు. ఈ యింటి కోడలుగా రావడానికి మీకేదయినా అభ్యంతరమా ?"

"............"

"అవును ఛాయా... మిమ్మల్ని చూడగానే నాకదే అనిపించింది. ఇన్నాళ్ల అన్వేషణ ఫలించింది. మీపై అధికారిగా శాసించడం లేదు. స్నేహితుడిగా అడుగుతున్నాను. నిర్మొహమాటంగా చెప్పండి. వివాహం నిర్బంధంగా జరిగే వ్యాపారం కాదు. నిజాయితీతో కూడిన వ్యవహారం "

ప్రకాష్...తన బాస్... కాదు భర్త! ఛాయ అంతరంగం భవితవ్యాన్ని బొమ్మ గీస్తోంది. తన సంచలనాన్ని ప్రస్ఫుటం చెయ్యకుండా, "ఇది నాకు వరమే... కాని... నన్ను కాస్త ఆలోచించుకో నివ్వండి ప్రకాష్ బాబూ" అన్నది నెమ్మదిగా

"టేక్ యువర్ ఓన్ టైం. కాని మీ నిర్ణయంకోసం పరీక్ష విద్యార్థిలా ఎదురుచూస్తూంటాను."

"బాగా రాసిన విద్యార్థి ఆ దోళనపడడుగా."

"దిద్దేవాడి మూడ్‌కూడా బాగుండాలిగా."

ఇద్దరూ నవ్వుకున్నారు.

"మీరు నాకోసం కొండ దిగివస్తున్నారు. ఈ అదృష్టానికి నేను సరిపో ననిపిస్తోంది."

"మిమ్మల్ని పొందడం నేనూ అదృష్టంగానే భావిస్తున్నాను."

"మా కుటుంబం మీరు చూశారు. ఇలాంటి మనుషులతో బంధుత్వం కలుపు కోడానికి మీ అమ్మగారు అంగీకరిస్తారా ?"

"అలా న్యూనతపరుచుకోకండి. మనుషులంతా ఒక్కలాగే ఎలా వుంటారు? నాకు కావల్సింది మీరు... మీ అంగీకారం లభిస్తే యిక అడ్డేంలేదు."

ఛాయ లేచింది. "థాంక్యూ... తెల్లవారుఝామున రైలుకి మేం వెళ్ళిపోతాం. అప్పుడు మిమ్మల్ని డిస్టర్బ్ చెయ్యడం ఎందుకు?..."

"మళ్ళీ రైలు కెందుకు... మా డ్రైవర్ తీసుకెళతాడు... ఓ...కే..."

ఛాయ తలూపింది దేవయ్యని పిలిచింది. దేవయ్య ఆపిల్ తింటూ "చాలా బాగుంది అక్కా... మూడు పళ్ళూ తినేశాను... కాకి ఎంగిలిచేసి పెట్టనా?" వచ్చాడు.

"నడు" క్రిందకి లాక్కుపోయింది.

వెనుకనుంచి ఆమె సౌందర్యాన్ని చూసి ముగ్ధుడవుతున్నాడు ప్రకాష్.

* * *

మూడుగంటలకి ఛాయ మేనేజర్ గదిలోకి వెళ్ళింది. రామబ్రహ్మం 'హిందూ' చదువుకుంటున్నాడు. ఛాయని ప్రశ్నార్థకంగా చూశాడు.

"పర్మిషన్ కావాలి సార్ ... యింటికి వెళ్ళాలి."

"వీల్లేదు. ఇదేమయినా ఉల్లిపాయల దుకాణమనుకుంటున్నావా, నీ యిష్టం వచ్చినపుడు వెళ్ళిపోడానికి? అంత అవసరమున్నదానివి మధ్యాహ్నం సెలవు పెట్టుకోవాలి." ముఖం చిట్లిస్తూ అన్నాడు. అతడికి ఛాయమీద కోపం పోలేదు. కాని ఏంచెయ్యడానికీ దారి కనిపించడంలేదు.

ఛాయ వెళ్ళిపోసాగింది. ఇంతలో ఫోన్ మ్రోగింది. రామబ్రహ్మం అందుకున్నాడు. జి.యం. మాట్లాడేసరికి మూడ్ మారిపోయింది.

రిసీవర్ యిస్తూ "నిన్ను పిలుస్తున్నారమ్మా" అన్నాడు.

"ఎందుకు బయలుదేరలే దంటారా..." ఆగి రామబ్రహ్మంకేసి తిరిగింది.

"నా పేరు చెప్పకు తల్లీ ... అగ్గిరాముడయిపోతాడు." రామబ్రహ్మం ప్రాధేయపడ్డాడు.

"వచ్చేస్తున్నాను...లేదేంలేదు..."

"మండపేట వెళుతున్నాను. అయిదింటికి వచ్చేస్తాను...ఓ.కే."

ఛాయ ఫోన్ పెట్టేసి "వెళ్ళొచ్చా సార్?" వ్యంగ్యంగా అడిగింది.

"జి.యం.గారి పనంటే కాదంటానా ఛాయా ... ఆ మాట ముందర చెప్పకూడదూ ?"

ఛాయ యింటికి వచ్చేసరికి తిరునాళ్ళగా వుంది. 'ప్రకాష్ ఆలస్యంగా రావడం మంచిదే అయింది...' అనుకుంది ఛాయ.

సోమయాజులు...కామేశం బిగ్గరగా పోట్లాడుకుంటున్నారు పేకాటదగ్గర. ప్రక్కనున్న నలుగురూ పోరాటాన్ని ఎగదోస్తున్నారు.

"అంత యివ్వలేనివాడివి అరువు ఆడట మెందుకు ? ఆ మధ్య నేను రూపాయి ఇవ్వాల్సివుంటే రోడ్డుమీద నిలేసి పుచ్చుకున్నావే ? మా డబ్బు అలాంటిది కాదేం ?" కామేశం కోపంగా రంకె లేస్తున్నాడు.

"ఉంటే పడేస్తాం ... నీ వెధవ డబ్బు నాకో లెక్కా?" అంటున్నాడు సోమయాజులు.

"మాటలు జాగ్రత్తగా రానీ."

ఛాయ గది గుమ్మంలోకి రావడంతో యిద్దరూ ఆగారు.

"ఏమిటి పెదనాన్నా యిది ... అలగావాళ్ళకీ మీకూ తేడా ఏమిటి ? ప్రకాష్‌బాబు వస్తున్నారు. త్వరగా అందర్నీ పంపెయ్. ఈ రోజునుంచి యింటి దగ్గర పేకాట పెట్టావంటే ఒప్పుకోను. కామేశంగారూ ... ఆయన డబ్బు నేనిస్తాను. గొడవ పెంచక వెళ్ళండి..."

అందరూ దారితీశారు బయటకు. సోమయాజులు సిగ్గుతో ఛాయని చూడలేక పోయినా, "వాడుత్త దొంగవెధవమ్మా...నాలుగురూపాయిలకి పదంటున్నాడు" నేరం చెప్పాడు.

దేవయ్య చావడిలో అరటిపళ్ళు తింటూ కాలక్షేపం చేస్తున్నాడు. సామానంతా చెల్లాచెదురుగా వుంది. "ఎవరి పనిరా ?" ఛాయ అడిగింది.

"నాన్న యిందాక డబ్బులుకోసం వెతుక్కున్నాడు."

ఛాయ కుర్చీలూ అవీ సరిచేసింది – డోర్ కర్టెన్లు మార్చింది. "ఒరేయ్ ... నువ్వుకూడా బట్టలువేసుకుని బుద్ధిగా కూర్చో."

"నాకు ... కారాయనలా కోటుండాలే అక్కా. జగ్గప్పకూడ నువ్వు కోటేసుకుంటే బాగుంటావురా అన్నాడు." దేవయ్య ఆమె కూడా వంటింట్లోకి వచ్చాడు.

"కారాయన అనకూడదు యిక."

"ఏమనాలబ్బా ?"

"బావగారు."

ఛాయ టిఫిన్ చేస్తూండగా వర్ధనమ్మ వచ్చి "యింకా రాలేదా అమ్మాయ్ ! మూడింటికే వస్తానన్నారు." ఆందోళనగా అడిగింది.

"రాలే దింకా."

వర్ధనమ్మ బద్ధకస్తురాలు. పనిదొంగ. తిరగడానికున్న ఓపిక పనిచెయ్య డానికి వుండదు. ఛాయ ఆసరాగా అందినప్పట్నుంచి సోమరితనం యింకా పెరిగిపోయింది.

"ఇంకా అలాగే కూర్చున్నావే రాచ్చిప్పలా ... లే ... వాళ్ళు వచ్చే వేళయింది." సోమయాజులు కండువా సరిచేసుకుంటూ వచ్చాడు.

ఆరయింది. ఛాయ డైమండ్ స్ట్రెచ్ ప్రింటెడ్ చీర కట్టుకుంది. అలంకరణ ఆమెకి యిష్టంలేని విషయం. కాని వర్ధనమ్మ అందు కొప్పుకోలేదు.

మరో పదినిముషాల్లో ప్రకాష్ వచ్చాడు.

"సారీ...లేటయింది."

ఛాయ లోపలి గుమ్మంలోనుంచి సమాధానంగా నవ్వింది.

"ఇదే ప్రశస్తమైన సమయం... వర్జ్యాలులేవు... సప్తమి వచ్చేసింది." సోమయాజులు పంచాంగం తిరగేస్తూ అన్నాడు.

ఛాయ టిఫిన్ తీసుకురావడానికి వెళ్ళింది.

"ఏమండోయ్ ... మీరు నాకు బావగారవుతారట. మా అక్క చెప్పింది. మరి నే నేమవుతాను మీకు ?" దేవయ్య ఎగురుకుంటూ వచ్చి ప్రకాష్ ప్రక్కన కూర్చున్నాడు.

ఛాయ టిఫిన్ యిచ్చింది.

ప్రకాష్ నవ్వుతూ అన్నాడు. "మైసూర్ పాకం అవుతావు."

వాడు అక్కడ కూర్చోవడంతో తన పెద్దరిక మేదో దెబ్బతిన్నట్లు బాధపడి పోయాడు సోమయాజులు. "ఒరేయ్ లోపలికి పో..."

"నేను వెళ్ళను...నువ్వే పో..."

వర్ధనమ్మ తలుపు చాటునుంచి ఎదరకి వచ్చింది. ఇద్దర్నీ కళ్ళతోనే గద్దించింది ! "ఛాయా ... కాఫీ తీసుకురా" అని పురమాయించి, "అమ్మగారయినా వస్తారనుకున్నాను బాబూ" అంది ప్రకాష్‌తో మాటలు కలుపుతూ !

"ఆవిడకూడ వచ్చేవారే... రెండు రోజులనుంచి ఆరోగ్యం బాగోటంలేదు."

"అరెరె ... ఆవిడకీ వయసు వచ్చేసింది. ఇంకా వెనుకటి మనుషులం కనుక యిలాగయినా వున్నాం. ఈ కాలంవాళ్ళు యిప్పుడే తోటకూరకాడల్లా వ్రేలాడిపోతున్నారు."

టిఫిన్ పూర్తయ్యేదాకా వర్ధనమ్మ కాలక్షేపంగా మాట్లాడుతూనే వుంది. తర్వాత మొగుడికోసం సాభిప్రాయంగా చూసింది. సోమయాజులు పట్టా నమిత్తే ఆనందంలో వున్నాడు.

"ఛీ...ఏంమనిషో" వర్ధనమ్మ విసుక్కుని తనే ప్రారంభించింది. "నువ్వు మా అల్లుడివికావడం మా అదృష్టమే బాబూ. కానీ మీ ప్రక్కనయినా

నుంచోగలవాళ్ళమే ... మా వాళ్ళంతా యింత పెద్ద సంబంధం తూగగలరా అంటున్నారు."

"మీ రెలాంటి సందేహాలు పెట్టుకోకండి. మీరొకటి మేమొకటి కాదిక. ఈ పెళ్ళి గురించి మీ రేవిధంగానూ శ్రమపడకూడదు. 'పెళ్ళి మా యింటే జరుగుతుంది."

"మా పిల్లకయినా మేం నాలుగూ పెట్టుకోవాలి కదా ! ఛాయా వాళ్ళ పెద నాన్నగారు కాస్త వ్యవధి వుంటే బాగుంటుందంటున్నారు. దీపావళి వెళితే రైతు లేదయినా సాయంచేస్తారు."

ప్రకాష్ జిప్పర్‌లోనుంచి అయిదువేలు తీసిచ్చాడు.

వర్ధనమ్మ ముఖమాట పడిపోయింది. "నాకు మనసు ఒప్పడంలేదు బాబూ తీసుకోడానికి "

"ఫర్వాలేదు వుంచండి."

సోమయాజులు వెకిలిగా నవ్వాడు. "కన్యాశుల్కం."

వర్ధనమ్మ డబ్బు తీసి ఒడిలో పెట్టుకుంది. "మా పిల్లని పొగడకూడదు గాని, ఛాయది బంగారంలాంటి జాతకం. అది మెట్టిన యింట దీపాలు వెలుగుతాయి."

"కొండుబొట్ల సూరప్పచయనులుచేత రాయించానోయ్ దాని జాతకం. అసలు నేనుకూడ జాతకాలు రాస్తాను. నేనయితే పక్షపాతంగా రాస్తానేమోనని ఆయనచేత రాయించాను "

అయిదువేలతో వర్ధనమ్మ ఆనందం తారాస్థాయికి వెళ్ళిపోయింది. కాని ఆమె దానికే తృప్తిపడే మనిషికాదు. అంత సంతోషంలోను భవితవ్యాన్ని మరచి పోలేదు ఆమె.

"బాబూ ! నువ్వూ యిక మాలోనివాడివే. అందుకే నాలుగూ చెప్పుకుం టున్నాను ఇన్నాళ్లూ అది నాలుగురాళ్ళు తెస్తోంది కనుక రోజులు వెళ్ళిపోయాయి. ఆయన పెద్దవారయిపోయారు. వీడో తింగరబుచ్చికదా ! ఛాయమ్మ వెళితే రోజులు ఎలా వెళతాయో !"

"ఛాయతో మీరూ వస్తారు. మీరెందు కిక్కడ ? మీ బాగోగులు యిక మావి. దేనికీ మీరిక వ్యాకులపడక్కర్లేదు."

వర్ధనమ్మలో అన్ని దీపాలు వెలిగాయి.

"నీ మనసు వెన్న బాబూ."



వీరి సంభాషణ వింటూ ఛాయ గుమ్మంలో నిలబడింది. తనవారి యాచకత్వం ఆమెకి తల కొట్టేసినట్లుంది. వీళ్ళని గురించి ప్రకాష్ ఏమనుకుంటున్నాడో !

డ్రైవర్ పళ్ళుబుట్టలు, మిఠాయిలు లోపలికి తెచ్చాడు. బట్టల ప్యాకెట్ ప్రకాష్ విప్పి అందరికీ యిచ్చాడు.

ఆ ముగ్గురూ ఈ ఆనందంలోపడి పెరట్లోకి వెళ్ళిపోయారు.

"దేవిగారు అంతదూరంగా వుంటే ఎలా ?"

"డాబామీద కూర్చుందాం రండి "

ఛాయ అక్కడ కుర్చీ లేకపోవడం చూసి క్రిందకి దిగబోయింది. ప్రకాష్ వారించాడు. "మంచం వుందిగా..."

చల్లటిగాలి వీస్తున్నది ... ఛాయ పిట్టగోడ కానుకుని నించుంది. "మీరు డబ్బు ఎందుకిచ్చారో నా కర్థంకాలేదు !"

"ఇదన్న మాట మీ అలుకకి కారణం...ఛాయా... డబ్బుకోసం నేను బాధపడేస్థితిలో లేను. కావాల్సినవారికి ఆమాత్రం సాయంచెయ్యగలను."

"వాళ్ళు అవకాశవాదులు. మిమ్మల్ని పూర్తిగా ఉపయోగించుకుంటారు."

"చెప్పానుగా నీ ముందు నాకు తక్కినవేం కనిపించవ్."

ఆకాశంలోకి చంద్రుడు, నక్షత్రాలు, వచ్చేశాయి. వాళ్ళు కాంక్ష మనసులతో భవితవ్యాన్ని తీయతీయగా అంచనా వేసుకున్నారు సమీక్షించుకున్నారు.

"మన కలయికకి గుర్తుగా ఏదైనా బహుమతి యివ్వవూ ఛాయా ?"

"మీకేం యివ్వగలను."

"ముద్దు..."

ఛాయ కళ్ళు వాలిపోయాయి సిగ్గుతో. ప్రకాష్ ఆమెని తన ఒడిలోకి తీసుకుని వక్షంమీదుగా వంగి చెక్కిళ్ళమీద ముద్దుపెట్టుకున్నాడు. పువ్వులాంటి ఛాయ స్పర్శతో అతడి కళ్ళు "కోరిక"తో వెలిగాయి.

"అక్కా...భోజనానికి రమ్మంటోంది. అంటూ దేవయ్య వచ్చాడు."

వారంరోజులు గడిచాయి. ప్రకాష్ దగ్గర్నుంచి ఉత్తరం వచ్చింది. ఏడవ తేదీన కారు పంపిస్తున్నాను... బయలుదేరి రమ్మని.

వర్ధనమ్మ యిక పెళ్ళి ప్రచారంలో పడింది సోమయాజుల కప్పుడే స్టేషన్ వచ్చేసింది. పౌరోహిత్యానికి వెళ్ళడం నామోషీగా వుండి మానేశాడు. రోజు వారీగా తనతో మాట్లాడేవారితో కూడ బెట్టుగా వుంటున్నాడు.

ఏర్పరచిన ముహూర్తానికి ఛాయ...ప్రకాష్ ల వివాహం జరిగిపోయింది.

"మనింట్లో అక్క పెళ్ళయిపోయింది. ఇక నావి, నీది, నాన్న పెళ్ళికావాలే అమ్మా" అన్నాడు దేవయ్య.

"మా పెళ్ళి అయిందోయ్ వెర్రి వెధవా ... ఇక నీదే తరువాయి." సోమయాజులు తిట్టాడు.

"అమ్మా ! నాక్కూడా పెళ్ళవుతుందేమిటే ?"

"ఎందుక్కాదురా బాబూ. దివ్యమైన సంబంధం చూసి చేస్తాను. నీకు పిల్లనివ్వడాని కప్పుడే పోటీపడుతున్నారు." వర్ధనమ్మ సముదాయించింది.

దేవయ్య ముఖం పెళ్ళిసంబరంతో నిండిపోయింది

## 5

వాళ్ళు ఏడడుగులు కలిసి వేశారు. అనుబంధం కల్గింది. వివాహంలోని మాధుర్యాన్ని, మందహాసాన్ని, మార్ధవాన్ని ఎంతో ఆత్రంగా జుర్రుకున్నారు.

వివాహం ఒకరివలన మరొకరు, ఒకరికోసం మరొకరు, ఒకరినుండి మరొకరు చైతన్య స్రవంతి పొందేమార్గం. వ్యక్తిని వ్యవస్థకి పరిచయంచేసే సూత్రం. స్వార్థంతో ప్రారంభించబడి పరమార్థానికి దారితీస్తుంది.

ఏడునెలలు ఏడుక్షణాల్లా కరిగిపోయాయి.

"అర్జంటుగా బయలుదేరిరా !" ప్రకాష్ దగ్గర్నుంచి ట్రంకాల్ వచ్చేసింది.

ఛాయ కంగారుపడింది. ప్రక్కనున్న సోమయాజులు ఆ భయాన్ని యింకా ఎక్కువచేశాడు. "ఏదయినా జబ్బు చేసిందేమో అమ్మాయ్. లేకపోతే ఎందుకు రమ్మంటాడు ?"

నీలాంబరి గదికి వెళ్ళింది. ఆమె భోంచేసి నిద్రపోతోంది. నిద్రలేపితే ఆమె సహించదు. ఛాయ రెండుక్షణాలు నిలబడి, హడావిడిగా సూట్‌కేసులో నాలుగు జతలు పడేసుకుని డ్రైవర్ని పిలిచింది. వర్ధనమ్మని పిలిచినా పలకలేదు.

ఆలస్యం చెయ్యకుండా ఛాయ వెంటనే బయలుదేరింది.

హైదరాబాద్ చేరుకునేసరికి చీకటిపడింది. ప్రకాష్ తరచుగా దిగే హోటల్‌కి తీసుకుపోయాడు డ్రైవర్.

కౌంటర్‌దగ్గర బయటికి వెళుతున్న ప్రకాష్ కనిపించాడు. ఛాయని చూసి దగ్గరకి వచ్చి "ఇంకా రాలేదని చూస్తున్నాను."

ఇద్దరూ గదికి వచ్చారు.

"మీ కేమయిందోనని కంగారుపడిపోయాను." సోఫాలో అలసటగా కూర్చుంటూ అంది.

"పూర్ గర్ల్" నవ్వుతూ ఆమె మెడమీద చెయ్యివేసి ప్రక్కన కూర్చున్నాడు.

"మీకు నవ్వుగానే వుంటుంది."

"చూశావా...కోపంలో యింకెంత బాగున్నావో. ఏం చెయ్యను డియర్... హైద్రాబాద్ వచ్చినపని నాలుగురోజులు ఆలస్యమయ్యేలా వుంది. ఇన్నాళ్లు నిన్ను వదిలి ఎలాగ వుండటం చెప్పు."

"అన్నీ దొంగవేషాలు."

"నీకోసమే ఛాయా ?" బుగ్గమీద చిటికెవేస్తూ అన్నాడు.

ఇంతలో ఫోన్ మ్రోగింది.

"వచ్చేస్తున్నా... ఓ.కె." ప్రకాష్ ఫోన్ దించి, "మన హైద్రాబాద్ బ్రాంచి

వాళ్ళు ఫంగ్షన్ ఏర్పాటుచేశారు. నువ్వు స్నానం చేసేయ్...బయలుదేరుదాం అన్నాడు.

ఛాయకి అలసటగా వుంది. కదలాలని లేదు. అయినా బలవంతంగా ఆమె బాత్‌రూంలోకి నడిచింది. ప్రకాష్ కంపెనీ లేకపోతే తానూ ఆగిపోతానంటాడని వెళ్ళడానికి నిశ్చయించుకుంది

క్రీం కలర్ శారీలో పదినిముషాల్లో ఛాయ తయారైంది.

"కనీసం గంట లేటు వుంటుందనుకున్నాను." ప్రకాష్ నవ్వాడు.

"ఇప్పుడు అలంకరణ మగవాళ్ళ అలవాటయిపోయింది."

టేబిల్‌మీద రిఫ్రెష్‌మెంటు వుంది.

"మీక్కో ?"

"నువ్వు వచ్చేముందే లాగించాను. డిన్నర్‌కోసం యింటర్వెల్ యిచ్చాను."

అందరూ ప్రకాష్‌కోసం ఎదురుచూస్తున్నారు. గేటుదగ్గర్నుంచే యిద్దర్నీ సాదరంగా ఆహ్వానించి తీసుకెళ్ళారు.

సాంస్కృతిక కార్యక్రమాలు ప్రారంభమయ్యాయి.

"ని న్నేదయినా పాడమంటున్నారు " ప్రకాష్ ఆమె చెవిలో చెప్పాడు.

"నయం. మీరంతా లేచి వెళ్ళిపోవాలి."

"ఏదయినా మాట్లాడు."

"దేన్ని గురించి?"

"ఏం మాట్లాడినా ఫర్వాలేదు."

వక్తగా ఛాయ కాలేజీలో బహుమతులు పొందింది. ఉపన్యాసాలు ఆమెకి చాల ఇష్టం. బ్రతిమాలించుకోకుండా మైక్ అందుకుంది.

'సామాన్యుడు...కళలు' గురించి అనర్గళంగా ఉపన్యసించింది.

గంటయిందని ఎవరికీ తెలియలేదు. చప్పట్లు మార్మోగాయి. మిసెస్ ప్రకాష్ లెక్చర్‌తో ప్రోగ్రాం జయప్రదమైనదని అన్నారు.

డిన్నర్ తొమ్మిదింటికి ముగియగానే బయలుదేరారు. "నీలాంటివారు రాజకీయాల్లో వుండాలోయ్...టికెట్ సంపాదిస్తా వచ్చే ఎలక్షన్లో."

ఛాయ నవ్వి ఊరుకుంది.

హోటల్‌కి వచ్చేసరికి ప్రకాష్‌కోసం కలకత్తానుంచి వ్యాపారబృందం ఎదురు చూస్తున్నది. ఆ డీల్ పూర్తయ్యేసరికి రెండయింది. ప్రకాష్ లోపలికి వచ్చాడు

ఛాయ సోఫాలోనే పడుకుని వుంది. చదువుతున్న పుస్తకం జారిపోయింది. ఫాన్ గాలికి చీర చెదిరింది. ప్రకాష్ ఆమెని ఎత్తుకుని మంచంమీద పడుకోబెట్టాడు.

ఛాయకి మెలకువ వచ్చేసింది.

"సోఫాలోనే నిద్రపోయావు." ఆమెని తనదగ్గరగా లాక్కుంటూ అన్నాడు.

"ఇప్పుడే పట్టింది కునుకు...ఇందాకట్నుంచి అన్ఈజీగా వుంది."

"మరి నన్ను ఎందుకు కేకెయ్యలేదు."

"మిమ్మల్ని డిస్టర్బ్ చెయ్యడ మెందుకు ? అయినా యిప్పుడు బాగానే వుందండి."

ప్రకాష్ ప్రొద్దుటే లేడీడాక్టర్ని పిలిపించాడు.

"ఛాన్స్ ఫర్ థర్డ్ వన్" అని చెప్పింది డాక్టర్.

ఇద్దరి మనస్సుల్లోనూ పాలపుంత తొంగిచూసింది.

* * *

సంతృప్తి లేనిదే ప్రశాంతి లేదు. అసంతృప్తి లేకపోతే ప్రగతి రాదు.

తన తండ్రి సంపాదించినదానితో తృప్తిపడి ఊరుకునే మనిషికాదు ప్రకాష్. అతడు మరికొన్ని కొత్తమార్గాలు అన్వేషించాడు. అనుభవం చాలకో, అదృష్టం రాకో మధ్య మధ్య దారి తప్పుతున్నా ప్రకాష్ దీక్షగా ముందుకే సాగిపోయాడు. భయపడి తిరోగమించలేదు. ఛాయ అండదండలు, సహకారం మరింత ధైర్యాన్నిచ్చాయి. ప్రోత్సాహాన్ని ఇచ్చాయి.

తాళంచెవులు ఛాయ ఒడిలో పడేశాడు.

"ఇవేమిటి ?" మధ్యాహ్నం భోజనాలయ్యాక ఛాయ తాంబూలం తయారు చేస్తోంది.

"ఇకనుంచి ఇంటిభారం నీది."

ఛాయ తాంబూలం అతడి నోట్లో పెట్టింది. ప్రకాష్ వేలుకూడ కొరికాడు.

"మీ రెప్పుడూ ఇంతే..." బుంగమూతి పెట్టింది.

"నీ వేళ్ళు తమలపాకుల్లా కనిపిస్తున్నాయి...ఆ చేతులు కలువ కాడలు... ముక్కు సంపంగి మొగ్గ...ఆ కళ్ళు అరటి పువ్వులు...ఆ నడుం..."

చేత్తో నోరుమూస్తూ, "ఆగండి ఇక. ఎవరయినా వింటే నవ్విపోతారు."

ప్రకాష్ సిగరెట్ వెలిగించుకుని మంచంమీద పడుకున్నాడు. "ఛాయా...ఈ

రోజునుంచి నాకు రెండువంతులు బరువు తగ్గిపోయింది ... ఏంచేసినా నీ ఇష్టం."

తన బాధ్యత పెరగడం ఆమెకి భయంగా వుంది. ఛాయ సీరియస్‌గా మారిపోవడం చూసి "ఏమిటలా అప్‌సెట్ అయ్యావు ?" అనడిగాడు.

"ఈ భారాన్ని నేను మోయగలనా ?"

"...గలవు."

వరండానుంచి సి.ఐ.డి.లా ఇది సోమయాజులు గమనిస్తూనే వున్నాడు. వెంటనే పరుగుమీద క్రిందికి వచ్చాడు.

"వర్ధనం" అంటూ కేకేశాడు. ఆమె పలకలేదు.

దేవయ్య ప్రైవేటు చెప్పించుకుంటున్నాడు. "మీ అమ్మేదిరా ?" అంటూ వాడ్ని అడిగాడు హాల్లోనుంచి.

"చూసిరానా నాన్నా ?"

దేవయ్య ప్రైవేటు మానివేసే సూత్రాలు అన్వేషిస్తూంటాడు. ఇక్కడికి రావడం మొదట్లో వాడికి చాల సంబరంగా వుండేది. కారెక్కడం ... కొత్త బట్టలూ... అడిగేసరికి వడ్డించే వంటమనిషీ ... 'బాగుంది. ఇంటిదగ్గరకంటె అనుకున్నాడు.' కాని ప్రకాష్ ఊరికే తిరగడానికి ఒప్పుకోలేదు. ఇద్దరు ప్రైవేటు మాస్టర్లని పెట్టాడు.

"నాకు చదువురాదండీ బావగారూ !"

"నేర్చుకుంటే రానిదేం వుండదు. బుద్ధిగా చదువుకో."

ప్రొద్దుట ఒక ప్రైవేటు...సాయంత్రం మరొకటి. దేవయ్య కీ చదువు గండం భరించలేనిదిగా వుంది. కాని మార్గాంతరం లేదు.

"నువ్వెందుకులే...నీ ఏడుపు నువ్వు ఏడు."

వర్ధనమ్మ ఎదరగదిలోకి వెళుతోంది. సోమయాజులు సైగచేశాడు.

దూరదేశంలో గర్భశత్రువులయినా మాట్లాడుకుంటారు. ఈ ఇంటికి రాగానే భార్యాభర్తలమధ్య అన్యోన్యత పెరిగింది. ఈ నాగరికతలో తాము చాల అల్పజీవులుగా కనిపిస్తున్నారు. ఈ పరిస్థితిని దాటడానికి ఒకరి సాయం మరొకరు అపేక్షిస్తున్నారు.

"తాళాలు మన అమ్మాయికి వచ్చేశాయి..."

"రాకేం చేస్తాయి. ఇక చూడండి ... " వంటమనిషి పిలవడంతో వెళ్ళిపోయింది.

ఐశ్వర్యం చాటున బ్రతకడం సోమయాజులకి అభ్యంతరంలేని విషయం. కాని అది తన జీవితాన్ని శాసించకూడదు. తన దారికి వచ్చి కలిసిపోవాలి.

ఇక్కడ అది జరగలేదు.

రాజభోగాలు జరుగుతున్నాయి. కాని పేకాట కుదరడంలేదు. ఇతర వ్యసనాలు కుదరడంలేదు. అర్థంలేని సంభాషణంచేసే స్నేహితులు లేరు. సోమయాజులకి ఇంటికి వెళ్ళిపోవా లనిపిస్తోంది. అక్కడ దరిద్రమే వున్నా ఎంతో సంతోషంగా గడిచింది.

ముఖ్యంగా సోమయాజులు చేతిలో డబ్బు ఆడటంలేదు. ఎవర్నో అడగవలసి వస్తోంది. ఇది సోమయాజులుకి ఎంతో కష్టంగా వుంది. ఈ బాధపడలేక ఆ మధ్య కృష్ణగట్టున ఎవరికో శ్రాద్ధం పెట్టిస్తున్నాడు పాతిక రూపాయిలకి. ఇది పరమహంస చూసి చెప్పేశాడు.

ఇంట్లో అందరిచేతా అక్షింతలు పడ్డాయి.

"కుక్క సింహాసనంమీద కూర్చుంటుందా ?" నీలాంబరి వ్యాఖ్యానించింది.

వర్ధనమ్మకిమాత్రం సుఖంగానే వుంది. ఏ పనీ చెయ్యాలన్న బాధలేదు. పెత్తనం సాగించడమే. నీలాంబరి సూటి పోటి మాటలు అన్నా ఆమె లెక్క చేసేదికాదు. ఇక్కడ తాము ఉండడానికి హక్కు వున్నట్లు ప్రవర్తించసాగింది. ఆ చుట్టుప్రక్కల ఇళ్ళలోవారిని పరిచయం చేసుకుంది. "ఇలాంటివి మాకు అలవాటు లేదు." నీలాంబరి హెచ్చరించింది.

"అలా రోగిష్టివాళ్ళలా కూర్చోవడం నాకు చేతకాదండి వదినగారూ నలుగురితో కలిసి మెలిసి వుండాలి అదీ నా తత్వం."

వర్ధనమ్మ సున్నితమైన మనిషికాదని రాక్షసజాతిదని నీలాంబరి గ్రహించి వేసింది. ఆమెతో మాట్లాడడానికి కూడ బెరుకుగానే వుంటోంది.

అయిదువేలలో ఆమె ఖర్చుపెట్టిందేంలేదు. అంచేత డబ్బు కటకట ఏమీ రాలేదు. రోజూ ఏదో సినిమా చూసే అలవాటు చేసుకుంది.

ఖర్చుచేస్తే కొండలు ఆగుతాయా ?

'ఛాయకి తాళాలురావడం శుభసంఘటనగా తోచింది. ఉ, దీపం ఉండగానే నాలుగూ చూసుకోవాలి. దీన్ని ఉపయోగించుకుని నాలుగురాళ్ళు జాగ్రత్త పెట్టుకోవాలి. మనుషు లెప్పుడెలా వుంటారో ఎవరు చెప్పగలరు ?'

* * *

విస్కీ-సీసాలు ప్రకాష్ గదిలో రిజర్వుగానే వుంటాయి. 'ఎదుటివారి ఆనందాన్ని తాము శాసించకూడదని' ఛాయ రాజీపడిపోయింది. త్రాగడం ఈనాడు నాగరికత చిహ్నం.

ఖాళీగా కూర్చునే సోమయాజులు వాటిని చూశాడు. ప్రకాష్ లేనప్పుడు ఓ సాయంత్రం సీసా తస్కరించి తన గదిలో కూర్చుని పుచ్చుకున్నాడు. నిషాగా...అదో లోకం కనిపించసాగింది. మంచ మనుకుని క్రిందపడుకున్నాడు.

"లే నాన్నా...అడ్డంగా..." దేవయ్య వస్తూ అన్నాడు.

"స్వ...ర్గంరా..."

చచ్చిపోకుండా స్వర్గానికి ఎలా వెళతారో దేవయ్యకి తెలియలేదు. తండ్రిని అటుఇటు కుదిపాడు. సోమయాజులు మత్తులో యిక మాట్లాడలేదు.

చచ్చిపోయాడని నిర్ధారణకి వచ్చేశాడు దేవయ్య.

"అమ్మా...నాన్న చచ్చిపోయాడు ... స్వర్గం వెళ్ళిపోతున్నాడు." కేక పెట్టాడు.

వర్ధనమ్మ రాగాలుతీస్తూ వచ్చేసింది. ఛాయ, నీలాంబరి, నాయర్ కూడ వచ్చారు.

"నన్ను అన్యాయంచేసి పోయారా?" వర్ధనమ్మ శోకం ప్రారంభించింది.

నాయర్ పరీక్షగా చూశాడు. విస్కీ వాసన వస్తోంది. తట్టి లేపి కూర్చో పెట్టాడు... "ఎక్కడున్నా...స్వర్గమేనా?" సోమయాజులు వాగసాగాడు.

"అయ్యగారు మందుపుచ్చుకున్నారమ్మా" నాయర్ వెకిలిగా నవ్వాడు.

"ఛీ...తింగరమనుషులు...వెధవగోల" నీలాంబరి వెళ్ళిపోయింది.

అత్తగారు విసుక్కోవడంతో ఛాయకి పెదనాన్నమీద కోపం రేగింది. "ఈ వయసులో ఈ అలవాట్లేమిటో? ఒకరేమనుకుంటారోనన్న జ్ఞానంకూడా లేదు. మీవల్ల నేను తలఎత్తుకోలేకపోతున్నాను."

"అమ్మాయ్...ఆ సీసాలు కనిపించకుండా పెట్టమ్మా. అల్లుడికి తెలిసినా బాగోదు."

"బుద్ధి మంచిదవ్వాలి " ఛాయ అక్కడ వుండలేదిక.

అలా రుచిచూసిన సోమయాజులకి, మళ్ళీ మందు కావాలనిపిస్తోంది. కాని ఎంతప్రయత్నించినా దొరకలేదు.

డబ్బుంటే బజారులో దొరుకుతాయి కదా అనుకున్నాడు.

డబ్బుకోసం ఛాయని పీడించసాగాడు. కాదనలేక పది...యిరవై యిస్తూ వుంది. సోమయాజులు ఆ పేటచివర్నవున్న పేకాటక్లబ్‌లో సభ్యుడయ్యాడు. ఛాయ యిచ్చేది ఏంసరిపోతుంది ?

"అమ్మాయ్ నాకో యాభై కావాలి...మందులు తెచ్చుకోవాలి." ప్రకాష్ లేడనుకుని ఛాయదగ్గర కెళ్ళాడు.







"నిన్ననేకదా  పెదనాన్నా పాతిక యిచ్చాను." కాస్త  అదుపు వుంచాలని ఛాయ తాపత్రయం.

సోమయాజులు మాట్లాడలేదు.

"ఇవ్వు ఛాయా..." ప్రకాష్ చెప్పాడు.

యాభై తీసుకుని "వస్తానోయ్." పంచె దులుపుకుంటూ వెళ్ళిపోయాడు.

నాయర్ తెచ్చిన టీ అందుకుంటూ "వాళ్ళు మనమీద ఆధారపడి వున్నారు. ఆమాత్రం సాయం చెయ్యకపోతే ఎలా?" అన్నాడు ప్రకాష్.

"ఆయనది అర్థంలేని ఖర్చు."

"ఈ వయసులో అయినా కాస్త సుఖపడనీ."

ఓ రోజున సోమయాజులు పేకాటలో రెండువందలు బాకీపడ్డాడు. "రేపిచ్చేస్తాను" అన్నాడు. రోజూవచ్చే అసామీ కనుక అవతలివాడు ఒప్పుకున్నాడు.

ఏంచెయ్యాలి? ఛాయ అంత డబ్బు యిస్తుందా? సోమయాజులు ఆ రాత్రంతా ఆలోచించాడు. ఉదయం టిఫిన్‌చేశాక నీలాంబరిగదిలోకి వెళ్ళాడు. ఆమె లేదు. డ్రెస్సింగ్ టేబిల్‌మీద గొలుసువుంది. తటపటాయించి జేబులో వేసుకున్నాడు.

పూజయ్యాక గొలుసుకోసం వెతుక్కుంది కనిపించలేదు. ఈ రోజు గుమస్తా రాలేదు. నాయర్ చిన్నప్పట్నుంచి యిక్కడ వుంటున్నాడు. ఎవరుచేశారు మరి?

"ఏరా గొలుసు తీసావా?" దేవయ్యని అడిగింది.

"నేనేమయినా ఆడపిల్లనేమిటండీ? గొలుసు మగవాళ్ళకెందుకు?"

వాడికేం తెలియదు దొంగతనం సోమయాజులే చేసివుండాలి. నీలాంబరి మనస్సు వుడికిపోయింది. కడుపుచించుకుంటే కాళ్ళమీద పడుతుంది. మావగార్ని దొంగంటే కొడుకు బాధపడవచ్చు. కోడలు ఏమనుకుంటుందో?

ఇరుకుగదిలో వున్నట్లు వుంటోంది నీలాంబరి పెళ్ళయినప్పట్నుంచి. ఇంటిలో వుండటం ఏమీ ఉత్సాహంగాలేదు.

నెల్లూరు సమీపాన వున్న ఆశ్రమానికి బయలుదేరింది.

"ఇప్పుడేమయిందమ్మా! ఈ వైరాగ్యం దేనికి?" ప్రకాష్ ఆందోళనలో పడ్డాడు.

"ఇప్పుడు కావల్సింది వైరాగ్యమే నాయనా! ఎక్కడయితే వుండడానికి. నిన్ను చూసుకోవడానికి భార్యవుంది. ఇప్పుడయినా నన్ను కాస్త ప్రశాంతంగా వుండనీ."

చెబితే వినేరకంకాదని ప్రకాష్ మాట్లాడలేదు. సంతకం పెట్టిన చెక్కు పుస్తకం యిచ్చాడు. నీలాంబరి పుచ్చుకోకుండా కారులో కూర్చుంది.

"నెలకి నువ్వే పంపు......" అన్నది. కారు బయలుదేరింది.

వర్ధనమ్మకి ఆటవిడుపు దొరికింది.

"ఎందుకో బాధపడి వెళుతున్నారావిడ. నావల్ల పొరపాటు జరగలేదుకదా." ఛాయ భయపడింది.

"అరవై దాటాక మనిషి పిచ్చివాడిక్రింద లెక్క. డోంట్‌వర్రీ. ఒకటో తారీఖున రెండువేలు పంపించు" అన్నాడు ప్రకాష్ బెంగుళూరు వెళ్ళిపోతూ.

ఛాయ మనసు శూన్యంగావుంది.

* * *

నర్సింగ్‌హోంలో ఛాయ ఆడపిల్లని ప్రసవించింది. ప్రకాష్‌కి బెంగుళూరు ట్రంకాల్ వెళ్ళింది. ఆ రాత్రికే ప్రకాష్ తిరిగివచ్చాడు.

"నా ముద్దే తీర్చావన్నమాట."ఉయ్యాలలో ఉన్న పసిగుడ్డును చూసి భార్య కేసి తిరిగాడు.

ఛాయ మధురంగా నవ్వింది. "ఇక అల్లుడివేటలో పడాలి మీరు."

"నాలాగే వెతుక్కుంటూ వాడే వస్తాడు మా అమ్మాయిదగ్గరకి."

"బడాయికి పోకండి."

సోమయాజులు పంచాంగం తిరగవేస్తూ వచ్చేశాడు. "అబ్బాయ్... నక్షత్రం మంచిదికాదు అఖండమైన శాంతి చెయ్యాలి."

"ఆ ఏర్పాటు మీరు చూడండి...మంత్రాలు మీ చేతిలో వున్నాయికదా!"

బాలసారెనాడు శాంతిచెయ్యడానికి నిశ్చయించారు. ఛాయ అన్నీ చూడలేదని పాపకోసం ఆయాని పెట్టాడు ప్రకాష్.

తల్లిని రమ్మని ప్రత్యేకంగా ఉత్తరం రాశాడు. నీలాంబరిదగ్గర్నుంచి ఉత్తరం మాత్రం వచ్చింది. "చిరంజీవికి ఆశీస్సులు...రాలేకపోతున్నాను."

"ఏమిటో యిప్పట్నుంచి ఆవిడ కా వైరాగ్యం! పిల్లాపాపని చూసుకోకుండా." వర్ధనమ్మ అల్లుడు ఎదురుగుండానే అనేసింది.

"నీకెందుకు దొడ్డా!" భర్త ఏమనుకుంటాడోనని మందలించింది.

పెళ్ళిఅయిన దగ్గర్నుంచి నీలాంబరి ప్రవర్తన ఛాయ గమనిస్తూనేవుంది. ఈ సంబంధం ఆమె బలవంతంగా అంగీకరించివుండాలి. ఆమధ్య ఆమెతరఫున బంధువులు వచ్చినప్పుడు 'పెళ్ళిచేసుకున్నవాడు, వాడికి లేని యిబ్బంది నాకెందుకు?' అనడం తాను వింది. తనమాట చెలాయించుకోడానికి సినిమా అత్తగారిలా యుద్ధాలు చెయ్యకుండా తనదారి తాను వెతుక్కుంది.

బాలసారె ఘనంగానే చేశారు. బంధువులతో, స్నేహితులతో రెండ్రోజులు కళకళలాడిపోయింది. వర్ధనమ్మదీ, సోమయాజులదీ హడావిడి.

అందరూ వెళ్ళిపోయాక ఆ సాయంత్రం తోటలో కూర్చున్నారు.

"పాపకేం పేరుపెడదాం?" ప్రకాష్ అడిగాడు.

"నాపేరు పెట్టండి బావా!" దేవయ్య పాపముఖంలోకి చూస్తూ అన్నాడు.

వర్ధనమ్మ తిట్టింది. "నోర్మూసుకుని కూర్చో."

"అత్తయ్యగారిపేరు పెడదాం."

ప్రకాష్ సిగరెట్ కాల్చుకుంటూ కాస్సేపు విశ్రాంతిగా కూర్చున్నాడు. "అలా పేర్లు పెట్టినంత మాత్రాన మనకి పెద్దవాళ్ళమీద ప్రేమ గౌరవం వున్నాయని అర్థంకాదు ఛాయా! అదో బలహీనత. పేరు ఈ కాలానికి తగ్గట్టు వుండాలి."

"అదీ నిజమేనమ్మాయ్." సోమయాజులు సమర్థించాడు.

"దీపంలా వుంటుంది కనుక దీప అనిపెడదాం. వాళ్ళమ్మలా రెండక్షరాలే.

"దీప, దీప, దీప" అంటూ దేవయ్య అరిచాడు.

రోజులు గడిచిపోతున్నాయి.

ఓ రోజున సోమయాజులు పేకాడుతూండగా పోలీసురైడింగ్ జరిగింది. అందర్నీ స్టేషన్‌కి లాక్కుపోయారు.

ప్రకాష్ చుట్టమని తెలియగానే యస్.ఐ. ఫోనుచేశాడు కేసుపెట్టకుండా.

ప్రకాష్ చెప్పగానే వదిలేసారు.

"మీకు జైలుకుపోయే రాతకూడ వుందేమో...అవ్వ...అవ్వ...మన మేమిటి? ఈపనులేమిటన్న జ్ఞానంకూడవుందా? తాటిచెట్టుకి వచ్చాయి ఏళ్ళు... ఎందుకు యింగితంలేకపోయాక." వర్ధనమ్మ యింటికిరాగానే ప్రారంభించింది.

ప్రకాష్కూడ యింటిదగ్గరే వున్నాడు. "మీరేపనిచేసినా గౌరవాన్నిదృష్టిలో పెట్టుకుని చేస్తూండాలి. మరచిపోకండి."

అందరితిట్లకన్న ప్రకాష్మాటలు సూటిగా తాకాయి.

ఇది జరిగినప్పట్నుంచి ఛాయని డబ్బుఅడగటం మొహమాటంగా వుంటోంది. వర్ధనమ్మకూడ "యివ్వకమ్మాయ్...ఇస్తే మనిషికాడు" అని చెప్పింది.

చేపకి నీళ్ళుండాలి; సోమయాజులకి డబ్బువుండాలి.

న రంగ్ థియేటర్ సమీపాన ఓసారి అనుమయ్య కనిపించాడు. సోమ యాజులు స్నేహితుడ్నిచూసి కౌగలించుకున్నాడు, "ఎన్నాళ్ళకిరా?"

ఇద్దరూ మ్యాటినీ కెళ్ళారు.

"రోజులు వెళ్ళిపోతున్నాయి కాని ఏం సుఖంలేదురా."

"అదేమిట్రా బంగారుపిచికలాంటి అల్లుడు..."

"అతడు మంచివాడేనోయ్! నా పెళ్ళాం...ఛాయా రాక్షసులు."

పదోవారంలో ఆ సినిమా డల్గావుంది. స్నేహితులిద్దరూ మనసువిప్పి చెప్పుకోడానికి అవకాశం దొరికింది.

"కొండ మనదగ్గరికి రాకపోతే మనం కొండదగ్గరకే వెళ్ళాలి."

"అంత తెలివివుంటే యిలాగెందుకు ఏడవడం?"

అనుమయ్య సినిమా చూస్తూనే ఆలోచనచేశాడు. స్నేహితుడిమీద ప్రేమతో కాదు. తనకికూడ ఏదైన లాభంవుంటుందని.

అయిదున్నరకి సినిమా విడిచారు.

"నాకు బాగా ఆకలివేస్తోంది...ఏదైనా హోటలుకి వెళదాం. టిఫిన్ పడితే గాని బుర్ర సరిగ్గా పనిచెయ్యదు."

"పోనీ అప్పుడేనా పనిచేస్తుందా?"

అనుమయ్య నవ్వాడు, హోటల్మెట్లు ఎక్కుతూ.

## 6

సోమయాజులు బిగ్గరగా పేపరు చదువుతున్నాడు. ఛాయ కూడ హాల్లోనే వుంది దీప కేరింతలు వింటూ. ఆయా అప్పుడే బయటికి వెళ్ళింది.

"ఏమండీ ?" గుమ్మంలోనుంచి కేక.

సోమయాజులు లేచి వెళ్ళాడు. అతడికి దాదాపు ముప్ఫయ్యేళ్ళుంటాయి. నల్లగా, పొట్టిగా వున్నాడు. గడ్డం మాసి వుంది. ఎర్రపువ్వుల చొక్కా, తెల్ల పాంటు వేశాడు. చేతికి పాతకాలం వాచీ వుంది.

"నేను శివపాదాన్నండి ... మావగారూ ... గుర్తుపట్టలేదా ?" ముఖంలోకి ఆసక్తిగా తొంగిచూస్తూ చెప్పాడు.

"శివపాదం !" గొణుక్కున్నాడు సోమయాజులు.

"మీ తమ్ముడు అల్లుడ్ని. ఛాయ మొగుడ్ని." అతడు మరింత స్పష్టంగా చెప్పాడు.

సోమయాజులు కంగారు దాచుకుంటూ లోపలి గదిలోకి దారితీసి "రా బాబూ, లోపల కూర్చుని మాట్లాడుకుందాం" అన్నాడు.

శివపాదం లోపలికి వెళ్ళాడు. సోమయాజులు లోపలికెళ్ళి భార్యని కూడ పిలుచుకువచ్చాడు. వీరంతా కంగారుగా వెళ్ళడం ఛాయకి అనుమానంవేసింది.

వర్ధనమ్మకి అతడ్ని చూపించి "మన పరశురాం అల్లుడు ... " పరిచయం చేశాడు.

శివపాదం ప్రక్కనున్న పుస్తకం చూస్తున్నాడు. వర్ధనమ్మ రాగానే సర్దుకుని కూర్చుని "బాగున్నారా అత్తయ్యగారూ ... ఛాయ ఏది ?" అడిగాడు.

"ఇన్నాళ్ళు ఏమైపోయావు బాబూ ... నువ్వు యుద్ధంలో చచ్చిపోయావన్నారే ?..."

"అదృష్టం బాగుండి తప్పించుకోగలిగాను. రెండేళ్ళనుంచి మీ గురించి చూస్తున్నాను. ఇవాళ్టికి నా అన్వేషణ ఫలించింది."

"నువ్వు చచ్చిపోయావని తెలియగానే మాకు మతిపోయిందంటే చెప్పు. మంచంమీద వుండి కూడ ఎంతో వైభవంగా చేయించింది మీ పెళ్ళి మా చెల్లెలు ! ష్ ... ఏమిటో ఏ ముచ్చటా చూసుకోకుండా వెళ్ళిపోయింది." వర్ధనమ్మ కళ్ళనీళ్ళు పెట్టుకుంది.

"ఇక్కడుంటున్నారేమిటి ?"

వర్ధనమ్మ...సోమయాజులు ముఖాముఖాలు చూసుకున్నారు.

"ఛాయ ఎక్కడ ?...కనిపించదేం ?" శివపాదం బీడీ తీసి వెలిగించాడు.

"నాయనా శివపాదం... భగవంతు డిలా ఎందుకుచేశాడో అర్థంకావడంలేదు.

బాల్యవివాహం కదా మీది. నువ్వు పోయేసరికి ఛాయకి ఏడేళ్ళు. జీవితాంతం విధవలా కూర్చోపెట్టట మెందుకని పెళ్ళయిన సంగతి చెప్పలేదు మేము. ఈ మధ్య మంచి సంబంధం చూసి పెళ్ళికూడ చేశాం. ఇంతలో పిడుగులా నువ్వొడి పడ్డావ్ ?" వర్ధనమ్మ నెమ్మదిగా వివరించింది.

శివపాదం కాళ్ళతో నేలని తన్ని నిటారుగా కూర్చున్నాడు కోపంగా.

"నా పెళ్ళాన్ని వెతుక్కుంటూ రావడం నా తప్పన్నమాట......... ఏం ? అంతేనా ?"

"కోప్పడకు బాబూ ... తెలియక ఏదో అంది." సోమయాజులు సర్ది చెప్పాడు.

"నేను బ్రతికుండగా నా పెళ్ళానికి మళ్ళీ పెళ్ళి చేస్తారా ... మీరు మనుషులే."

"నువ్వున్నావని మాకేం తెలుసు బాబూ. నీ మరణవార్త మీ చిన్నాన్నే చెప్పాడు."

శివపాదం లేచి బయటికి దారితీస్తూ "మీ అందరికీ ఎలా బుద్ధి చెప్పాలో నాకుబాగా తెలుసు. తగిన శాస్తిచేస్తాను, తొందరపడకండి," హెచ్చరించాడు.

సోమయాజులు వెళ్ళి అతడ్ని తీసుకువచ్చి కూర్చోపెట్టాడు. "నువ్వు అలా రంకెలువేస్తే మేం ఏంచెప్పం బాబూ...స్థిమితంగా మాట్లాడుకుందాం... వర్ధనం నువ్వెళ్ళి కాఫీ, టిఫినూ తీసుకురా !"

వర్ధనమ్మ వెళ్ళిపోయింది. వెళుతూ ఆమె ఛాయతో "మీ పెదనాన్న పిలుస్తున్నారు." అన్నీ చెప్పి వంటింట్లోకి వెళ్ళింది.

ఛాయ గుమ్మంలోనుంచే "పిలిచావా పెదనాన్నా?" అనడిగింది.

"ఇలా రామ్మా...ఇతడెవరో గుర్తుపట్టావా ?"

శివపాదం ఛాయని తదేకంగా చూశాడు. ఆమె సౌందర్యానికి ముగ్ధుడయ్యాడు. శరీరం వేడెక్కింది.

"పెళ్ళి మాటే చెప్పనపుడు నన్నెలా గుర్తుపడుతుంది. ఛాయా ... నేను నీ మొగుడ్ని. అగ్నిసాక్షిగా నిన్ను పెళ్లాడాను."

ఛాయ పళ్ళు కొరుకుతూ "జాగ్రత్తగా మాట్లాడు. నీ ముఖమే నేను ఎరగను. నన్ను పెళ్లాడానంటా వేమిటి ?" అని వెనక్కి తిరిగింది.

వర్ధనమ్మ టిఫిన్‌తో ఎదురుపడింది. అది శివపాదాని కిచ్చింది. "ఛాయా... ఇలారా..." అంటూ కిటికీదగ్గరకి తీసుకెళ్ళింది.



శివపాదం టిఫిన్‌మీద పడ్డాడు. బల్లమీద బీడీ కట్టలోనుంచి బీడీ తీసి సోమయాజులు వెలిగించాడు. అతడు భార్యకేసి చూస్తున్నాడు ఆసక్తిగా.

"మీ అమ్మ జబ్బుతో మంచం ఎక్కింది. నీ పెళ్ళి చూడాలని పట్టుపట్టింది. మీ నాన్న, పెద్దనాన్నగారు సంబంధం చూసి చేశారు. నీ పెళ్ళి చూసి మీ అమ్మ ప్రాణాలు విడిచింది. తర్వాత ఆస్థి తగాదాల్లో శివపాదం ఇంటినుండి పారిపోయి మిలట్రీలో చేరాడు. రెండేళ్ళతర్వాత చనిపోయాడని తెలిసింది. నీ బ్రతుకు బండలుచెయ్యడం ఇష్టంలేక నీ కా సంగతి చెప్పలేదు. శివపాదం యుద్ధంలో చనిపోలేదట. మనల్ని వెతుక్కుంటూ వచ్చాడు."

ఛాయ ముఖం పాలిపోయింది. దడ ... ఆందోళనలతో చెమటపట్టింది. నిలుచోవడం కూడ కష్టమై గోడకి జారగిలబడింది.

శివపాదం జేబులోనుంచి ఫొటో, పాత శుభలేఖ తీసి "చూడు ఛాయా... మన పెళ్ళి ఫొటో...అప్పుడు చిన్నపిల్లలం మనం" ఆమె దగ్గరకి వచ్చాడు.

ఫొటోలో తమని పోల్చుకోలేకపోయింది. పెదనాన్న స్పష్టంగా కనిపిస్తున్నాడు. శుభలేఖ చదవగానే నిజమేనని అనుకుంది.

"అయితే ఇప్పుడేం చేద్దాం ?" జనాంతికంగా సోమయాజులు అడిగాడు.

"ఛాయ నా భార్య. నాతోనే వస్తుంది." శివపాదం స్థిరంగా చెప్పాడు. తీసుకు వెళ్ళే నిశ్చయం మాటల్లో కనిపించింది.

"అదెలా కుదురుతుంది ? ఎంతో కొంత డబ్బిస్తాం, పట్టుకుపో. దానివల్ల యిద్దరి జీవితాలూ బాగుపడతాయి." సోమయాజులు పరిష్కారం సూచించాడు.

"ఈ వయసులో నాకు పెళ్ళాం కావాలి." ఛాయని క్రీగంట చూస్తూ "పనస తొనలా, పంచదార చిలకలావుంది... నాకు నా పెళ్లాం తప్ప ఏమక్కర్లేదు." నవ్వాడు.

ఛాయ అక్కడ ఉండలేకపోయింది. విసవిసా మేడమీదకి వెళ్ళిపోయింది. ఫ్రిజ్‌లోనుంచి రెండు కోకోకోలా తీసి తాగి నిర్వేదంగా సోఫాలో వాలి పోయింది.

తనకి ఊహతెలియకుండానే పెళ్లయింది. ఇది ఆయనకి తెలిస్తే...అర్థంచేసు కుంటారా ? ఆవేశపడతారా ? మరొకరి భార్యనని తెలిశాక హావభావాలు ఎలా వుంటాయి ?

ఆ శివపాదం ధోరణే వెగటుగా వుంది. వాడికి భార్యగా వుండేకంటె చావడం మంచిది. ఎక్కడా సంస్కారం కనిపించడంలేదు మనిషిలో.

సోమయాజులు, వర్ధనమ్మ హడావిడిగా వచ్చేశారు.

"డబ్బిస్తే పోతాట్టమ్మాయ్ ఓ పదివేలిమ్మంటున్నాడు" వర్ధనమ్మ చెప్పింది.

"పదివేలా ?"

"అసలు పాతిక యిమ్మన్నాడు. నేనే బ్రతిమాలి తగ్గించాను."

"అంత డబ్బు నా దగ్గర ఎక్కడుంది దొడ్డమ్మా."

"పిచ్చిపిల్లా... వెన్న చేతిలో పెట్టుకుని నెయ్యికోసం తిరుగుతావు. తాళాలు నీ చేతిలోనే వున్నాయి కదా."

"ఆయనకి తెలిస్తే..."

"ఎలా తెలుస్తుంది ? అయినా డబ్బుదగ్గర నిన్ను నిలవేస్తాడా ఏమిటి ? ఏదో సర్దిచెప్పవచ్చు. ప్రకాష్ రాకముందే వీడ్ని పంపేయాలి. ఈ గండం గడిస్తే చాలు మనకి."

ఛాయ యాంత్రికంగా లేచింది. డబ్బు తీస్తో : ణికిపోసాగింది. ఏదో తప్పుచేస్తున్నట్లు వణికిపోయి తూలింది. పగలే చీకటిగా వుంది. డబ్బు తీసి తిరిగి లోపల పెట్టేసింది.

"అదేమిటే?" వర్ధనమ్మ వడిగా వచ్చింది.

"ఆయన్ని మోసంచెయ్యలేను. ఆయన వచ్చాక చెప్పేద్దాం ఏదోకి జరుగుతుంది."

"నీ పిచ్చి మండినట్లుంది. శివపాదం భార్యవని తెలిశాక యింట్లో వుండ నిస్తాడా? మనమంతా రోడ్డెక్కాలి. ఆ శివపాదం ఉత్త వెధవ. మోజుతీరేదాకా నిన్ను వుంచుకుంటాడు.తర్వాత 'వాడితో పిల్లని కని నాతో కాపురమా'అని వెళ్ల గొడతాడు. రెంటికీ చెడ్డ రేవడవుతుంది నీ బ్రతుకు!" వర్ధనమ్మ భవితవ్యాన్ని ఊహించి చెప్పింది.

ఛాయ డబ్బు తీసి సోఫాతో పడేసింది. క్షోభ భరించలేక మంచంమీద వాలిపోయింది. చుట్టూ అంతులేని చీకటి వ్యాపించింది

డబ్బుతీసికొని యిద్దరూ వెళ్ళిపోయారు

ఏమైపోతోంది బ్రతుకు? ఎందుకిలా జరిగింది?ఏం జరుగుతుంది ఇకముందు? అనేక ప్రశ్నలు. దేనికీ జవాబు తెలియడంలేదు.

చదవని విద్యార్థి పరీక్షకి హాజరైనట్లుంది.

ఎవరికయినా సంక్షోభ పరిస్థితి ఏర్పడినపుడు గుండెలు అదరటం సహజం. ఆ చీకటిలో వెంటనే దారి కనిపించకపోవచ్చు. పిరికివాళ్లు శాశ్వతంగానో, తాత్కాలికంగానో తప్పించుకోడానికి అసహజమైన సాహసాలు చేస్తారు. వసంతాన్ని చూసి కేరింతలు కొట్టినపుడు శిశిరం ఎదురయినపుడు అనుభవించడం నేర్చుకోవాలి. అదే జీవితం. రాత్రి గడవకుండా వేకువ వికసించదు.

"దీప ఏడుస్తున్నదమ్మా... పాలివ్వండి." ఆయా తట్టి లేపింది.

ఛాయ వులిక్కిపడి లేచి దీపని అందుకుంది. ఆయా లైటు వేసింది. పిల్లకి పాలిస్తూ "క్రింద ఎవరున్నారు?" అనడిగింది

"ఎవరూ లేరండి .. దేవయ్యా, మీ దొడ్డమ్మ. పెదనాన్నగారు సినిమాకి వెళ్లారు."

"నువ్వు వచ్చి ఎంతసేపయింది?"

"అరగంటయిందండి నేను వచ్చాకనే వెళ్ళారు."

ప్రకాష్ బొంబాయినుంచి రాత్రి తొమ్మిదింటికి వచ్చాడు. ఇల్లంతా నిశ్శ

బ్బంగా వుంది. తన హారన్ వినేసరికి ఎదురుపడే ఛాయ ఎందుకు రాలేదా అని ఆలోచిస్తూ పైకి వెళ్ళాడు.

ఛాయ అచేతనంగా పడుకుని వుంది. ప్రకాష్ ఆమెని తట్టి "పడుకున్నావా?" అన్నాడు. ఛాయకి అతడితో మాట్లాడడానికి జంకుగా వుంది.

ప్రకాష్ తను తెచ్చిన చీరలు, పుస్తకాలు, ఫాన్సీ ఆమె ముందు పెట్టి, కొత్త సూట్‌కేస్ దగ్గరకి లాగాడు.

"కొన్నారా ?" పెకలింపుకుని మాట్లాడింది.

"ఇదంతా మన యువరాణి ప్రత్యేకం... అన్నట్లు దీప ఏది ?"

"ఇప్పటిదాకా ఏడ్చి యిప్పుడే పడుకుంది."

ఛాయ యాంత్రికంగా మాట్లాడుతోంది. ప్రతిక్షణం అంతరాత్మ ఆమెకి ఎదురు తిరుగుతోంది. ఈ సంఘర్షణ భరించలేకపోతున్నది. రోజులు గడుస్తున్న కొద్దీ ఎక్కువవుతున్నది.

ఛాయలోని మార్పు ప్రకాష్‌ని వివశుడ్ని చేసింది. మందహాసంతో మురిపించే ఛాయ నవ్వడమే మరచిపోయింది ఎప్పుడూ పరాకుగానే వుంటోంది.

"నీ బాధ నాకు చెప్పకూడదా ఛాయా ?"

"అబ్బే... బాధేముందండీ..."

"ఇన్ని అబద్ధాలు ఆడేస్తూంటే మళ్ళీ ఆడపిల్లే పుడుతుంది."

"అప్పుడే ముఖం మొత్తిందా ?" తాను నవ్వడానికి ప్రయత్నిస్తూ, ప్రకాష్ ఆలోచన మార్చడానికి అతడి ఒడిలో వాలిపోయింది.

ప్రకాష్ ఆమె ఎత్తయిన వక్షం మీదకి వంగాడు. ఇద్దరి ప్రసంగాలకి యవనిక పడింది. మరో లోకంలో పడ్డారు.

* * *

ప్రకాష్ బాత్‌రూం దగ్గర జారిపడ్డాడు. ఎడంకాలు ఫ్రాక్చర్ అయింది. డాక్టరు వచ్చి కట్టుకట్టి "వారం రోజులు బెడ్ మీదనుంచి కదలకూడదు," అని హెచ్చరించాడు. వైద్యం కూడ అంతస్థునుబట్టి వుంటుందని తల నెరిసిన ఆ డాక్టరుకి తెలియనిది కాదు. ఇదే ఏ సామాన్యుడికో తగిలితే వాడు తనదగ్గరకి వస్తాడా ? ముగ్గో, కాఫీగుండో చల్లి కాలక్షేపం చేసేవాడు.

ఈ విధంగా ప్రకాష్‌కి రెస్టు లభించింది. కాని డాక్టరు ధర్మమాని పట్టణంలో ముఖ్యుల దరికీ తెల్సిపోయింది. పరామర్శలూ... టెలిఫోన్‌లూ... ఉత్తరాలు.

మధ్యాహ్నం ఆకాశం నల్లగా వుంది. మేఘాలు పరుగులు తీస్తున్నాయి. వాన రావడానికి సన్నాహాలు ప్రారంభమయ్యాయి.




ఛాయ ఏదో నవల చదివి వినిపిస్తూంటే ప్రకాష్ వింటున్నాడు సోమయాజులు కిటికీ దగ్గర నెమ్మదిగా శబ్దంచేశాడు. ఛాయ గుర్తించింద. గుండెల అదిరాయి.

ఛాయ పుస్తకం మంచంమీద పెట్టింది. "మంచినీళ్ల త్రాగివస్తానాగండి."

"మంచి సస్పెన్సులో ఆపేశావ్... రాణి ఎవర్ని పెళ్ళిచేసుకుంటుందో?"

ఛాయ హడావిడిగా క్రిందకి వచ్చింది. సోమయాజులు మాట్లాడకుండా తన గదిలోకి తీసుకెళ్ళి తలుపులు మూశాడు.

"వాడు మళ్ళీ వచ్చాడమ్మా? మరో పదివేలు కావాలిట."

"బాగుందీ నాటకం. ఇవ్వమని చెప్పలేకపోయావా ?"

"ప్రకాష్‌తో మాట్లాడతానంటున్నాడు."

ఛాయకి గాలి స్థంభించినట్లయింది.

"ఇలాంటివారితో పేచీ పెట్టుకోకూడదమ్మా ఎలాగో వదుల్చుకోవాలి. ఆవేశపడితే మనమే నష్టపోతాం." ఇచ్చి తీరాలని సూచించాడు.

"మధ్యన నాకు చావు వచ్చిపడింది."

శివపాదం తోటవైపునుంచి కిటికీ దగ్గరకి వచ్చి దగ్గాడు. "దబ్బిస్తావా...

నేను వెళ్ళిపోతాను. ఇవ్వవూ...ఇద్దరం కలిసేపోదాం.ఈ రాత్రి యింటక్కా నీతో స్వర్గం చూస్తాను."

"నోర్మూయ్... ఇడియట్..." పళ్లుకొరుకుతూ అంది.

"అంటే డబ్బు యిస్తావన్నమాట... గుడ్."

సోమయాజులు తొందరచేశాడు. "వాడితో పేచీ ఏమిటి? ఈ కేకలవల్ల నలుగురికీ తెలియడం తప్ప ఏం లాభం... ఛాయా... డబ్బుపడెయ్... ఇక రాకుండా చేస్తాను"

ఛాయ తేరుకుంటూ "ఇప్పుడెలా... ఆయన యింట్లో వున్నారు... రెండ్రోజులు పోయాక రమ్మను," అని చెప్పింది.

అది శివపాదానికి వినపడింది. "రెండు క్షణాలు కూడ ఆగను. నాకు అర్జంటుగా కావాలి."

ఛాయ అచేతనంగా పైకి వెళ్ళింది. ఏం చెయ్యాలి? బీరువా పడక గదిలో వుంది. డబ్బు తీస్తూంటే ఎందుకని అడగరూ?

ప్రకాష్ నిద్రపోతున్నాడు. అయినా ఛాయకి ధైర్యం చాల్లేదు. గిజగిజ లాడుతూ కూర్చుంది. సోమయాజులు కిటికీ దగ్గర నించున్నాడు. ఏమిటా లస్యం?" అన్నట్లు చూశాడు.

ఛాయ ఫ్లవర్ వేజ్ క్రింద పడేసింది. పెద్ద చప్పుడయింది. ప్రకాష్ నిద్ర లేవలేదు. ఎదరకి తిరిగి పడుకున్నాడు. కాష్‌బాక్స్ వెనక వైపున వుంది. ఛాయ రెండు క్షణాలు తటపటాయించి తాళాలు తీసి వెళ్ళింది. ఓ కన్ను ప్రకాష్ మీద వుండనేవుంది. ఉద్వేగంతో డబ్బు తీసి బయటికి నడిచింది. ప్రకాష్ లేవకపోవడంతో నిట్టూర్పు విడిచింది.

రొప్పుతూ మెట్లదగ్గర డబ్బు యిచ్చింది. సోమయాజుల కామె బాధ ఎందుకు కావాలి? నిర్లక్ష్యంగా వెళ్ళిపోయాడు. ఛాయ నిస్త్రాణగా గోడకి అనుకుని నిలబడిపోయింది. ఇంతలో దీప ఏడుపు వినపడటంతో వెళ్ళి ఉయ్యాలనుంచి తీసింది

పది మైళ్లు పరుగెత్తినంత అలసటగా కూలబడింది. అడవిలో క్రూర జంతువు మీదకి వురకబోతూండగా కలిగే వైరాగ్యం ఛాయలో రేగింది.

"ఏమిటి ఛాయా ఆ చప్పుడు...?" ప్రకాష్ లేస్తూ అడిగాడు.

"అబ్బే...పాప ఏడుస్తూంటని హడావిడిగా వచ్చాను క్రిందనుంచి...అంతే." నమ్మలేనట్లు చూశాడు. "ఈ మధ్య నీలో అందోళన కనిపిస్తోంది."

పాకుడు రాళ్లమీద అడుగు వేశాక నిలదొక్కుకోవడం అసంభవం. రక్తం మరిగిన పులి వేటాడకుండా వుండలేదు. శివపాదం వస్తూనే వున్నాడు, ఛాయ డబ్బు అయిష్టంగా యిస్తూనే వుంది. ఇది అంతులేని కథ. సశేషమే కాని సమాప్తముండదు.

కొంత మంది వ్యక్తులకు సమూహానికి వున్నంత చొరవవుంటుంది. వాళ్లు ఏ రకం ఉద్యమానికయినా నాయకత్వం వహించి విజయం సాధించగలరు. కొంతమందికి ఆంజనేయుడిలా వాళ్ళ బలం వాళ్లకి తెలియదు పిరికివాళ్లలా ఆగిపోతారు.

జరుగుతున్న కథ ఛాయకి నిప్పులగుండంలా వుంది. ఇప్పుడు తాను చెయ్యవల్సింది తిరుగుబాటా? విప్లవమా?

రెంటికీ అర్థం ఒకటేఅయినా ప్రయోజనాలు, ప్రగతి వేరు. విషమించిన పరిస్థితిని ఏదోలా వెంటనే నాశనంచెయ్యడం తిరుగబాటు. స్పష్టమైన కొత్త విలువ కోసం సాగించే పోరాటం విప్లవమవుతుంది. ఆవేశంతో ప్రారంభించి ఆలోచనలోపడితే అనర్థమే మిగిలేది.

ఆదర్శానికి ఆచరణకి మధ్య అగాధం ఏర్పడింది దీన్నుంచి లేవాలి. తప్పుకోవాలి. నిర్మాణంకంటె పునర్నిర్మాణం కష్టం.

"ఛాయా... వెంగళరాయుడు ఇరవై వేలు కావాలని మనిషిని పంపాడు. ఆదివారం బ్యాంకువుండదని మనదగ్గిరకి పంపాడు..." ప్రకాష్ చెప్పాడు.

యాంత్రికంగా లేచింది. నిల్వ పదకొండు వేలకంటె లేదు దబ్బు లేదంటే ఆయన నమ్ముతాడా? ఎనభై వేలదాకా వుండాలి. ఛాయ అమావాస్య చంద్రుడైంది. ఇంతకంటె ప్రాణాలు పోతే మంచిదనిపించింది.

"అంత సేపు చేస్తున్నావేమిటి?" ప్రకాష్ లోపలికి వచ్చాడు.

"తాళాలు కనిపించడంలేదండీ... వెతుకుతున్నాను."

ప్రకాష్ కూడా వెతికాడు. "కాస్సేపున్నాక పంపిస్తానని చెప్పు." అంటూ వచ్చిన మనిషిని పంపేశాడు. ఛాయని ఏమనకపోయినా ఛాయకాతడి చూపు బాణంలా తగిలింది.

ప్రకాష్ కోసం ఎవరో రావడంతో క్రిందకి వెళ్ళిపోయాడు. తలలోని పీడనానికి గోడకేసి కొట్టుకోవాలనిపించింది ఛాయకి. ఇక తాను భరించలేదు. జరిగింది చెప్పివేయాలి? ఎన్నాళ్లీ నరకం? శివపాదాన్ని ఎన్నాళ్లు దబ్బుతో కట్టివేయడం?

"అమ్మగారూ..." పరమహంస లోపలికి వస్తూ "భుజంగరావుగారు నలభై వేలు బాకీ యిచ్చారమ్మా" అని మంచంమీద పెట్టి వెళ్ళిపోయాడు.

ఛాయకి తీరం కనిపించినట్లయింది.

మరో అరగంటలో ప్రకాష్ వచ్చి "కనిపించాయా తాళాలు?" అనడిగాడు.

"సిద్ధంగా వుంచాను" డ్రాయరులోనుంచి డబ్బు తీసియిచ్చింది.

మనుషులున్నా డబ్బు జిప్పర్‌లో వేసుకుని కారు దగ్గరకి నడిచాడు. డ్రైవర్ రాడానికి గ్యారేజీ దగ్గరకి వచ్చినా వద్దని తలూపాడు.

ఛాయలోని మార్పు అతడ్ని వివశుడ్ని చేస్తోంది. ఆమెలో చలాకీతనం, ఉత్సాహం అన్నీ యింకిపోయాయి. మృత్యుమందిరంలో నిలబడ్డట్టు మసలుతోంది. ఏం జరిగింది?

ఛాయ చెప్పడంలేదు.

మొన్న మధ్యాన్నం హడావిడిగా డబ్బు తీసింది. నిద్ర నటించి తను చూశాడు. ఈ రోజు తాళాలు కనిపించడంలేదని కంగారుపడింది. రెంటికీ ఏదయినా సంబంధముందా ?

ఛాయకి ఏర్పడిన సమస్య డబ్బుతో ముడిపెట్టబడివుందా ?

ప్రకాష్ స్లోగా డ్రయివ్ చేస్తున్నాడు. అతడి మనస్సు సున్నితం. భర్తగా అధికారం చెలాయించి ఛాయమీద ఏర్పడిన అనుమానాల్ని తెలుసుకోగలడు. సంస్కారమున్న మనిషిగా అతడు అలా చెయ్యలేడు. ఒకర్ని శాసించి తనకి విధేయుడిగా చేసుకోవడం అతడికి నచ్చదు. అన్నివేళలా ఎదుటివారి వ్యక్తిత్వాన్ని మన్నించడం అతడి లక్షణం, లక్ష్యం.

జైహింద్ టాకీసు దగ్గర దేవయ్య కనిపించాడు. మార్నింగ్ షోకి టిక్కెట్టు దొరకక తిరుగుముఖం పట్టాడు. ప్రకాష్‌ని చూసి బెదిరిపోయాడు.

"ఎక్కు" అన్నాడు డోర్ తీసి. దేవయ్య బెదురుతూ ఎక్కాడు ప్రయివేటు మాని యిలా వచ్చినందుకు తిడతాడని భయపడుతున్నాడు.

"అలా నీరసంగా వున్నావేం ? టిఫిన్ చెయ్యలేదా?"

దేవయ్య తలూపాడు. ప్రకాష్ మనోరమముందు కారాపాడు. టిఫిన్ చేస్తూ "ఈ మధ్య మీ అక్కయ్య అదోలా వుంటోంది. మీ అమ్మా నాన్నలతో పేచీ వచ్చిందా ?" అనడిగాడు.

"ఆ మీసాలవాడు వస్తున్నప్పట్నుంచి అమ్మా, నాన్న అక్కయ్యతోనే ఉంటున్నారండి."

"మీసాల వాడెవడు ?"

"ఏమోనండి. మా నాన్నని అడిగితే రహస్యమన్నాడు."

"ఆ మీసాలవాడు-ఎప్పుడొస్తాడు?''

"చాలాసార్లు వచ్చాడండి. తోటలో కూర్చుంటాడు. మా నాన్న ఏదో పొట్లం యిస్తాడు· దాంతో వెళ్ళిపోతాడండి.

సోమయాజులు ఏమిటిస్తున్నాడు? డబ్బా? ఆ మీసాలవాడితో ఏమిటి సంబంధం? ఛాయ ప్రవర్తనకీ వీటికి సంబంధముందా?

''నీకు సినిమాకి డబ్బు లెవరు యిచ్చారు ?"

"అక్కయ్య దగ్గిరకి వెళుతూంటే మా నాన్న 'అదిచ్చేదేమిట్రా... కావలిస్తే నన్నడుగు. మనకి బోలెడు డబ్బుంది' అన్నాడు. పదిరూపాయ లిచ్చాడు."

దేవయ్య నాల్గు ప్లేట్లు లాగించి విశ్రమించాడు.

"ఈసారి మీసాలవాడు వచ్చినపుడు నాకు చెబుతావా? ఎవరికీ తెలియ కూడదు. అలా చేస్తే మంచి టిఫిను పెట్టిస్తాను.''

దేవయ్య అంగీకరించాడు.

మూడు రోజులు గడిచాయి ఉదయం తొమ్మిదిగంటల వేళ. ప్రకాష్ బట్టలు వేసుకుంటున్నాడు. దేవయ్య వచ్చి "ఆ మీసాలవాడు వచ్చాడండి. తోటలో కూర్చున్నాడు." చెప్పాడు.

మొదటి అంతస్థు చివరిగది కిటికీనుంచి చూశాడు. ఔట్ హౌస్ దగ్గర ఓ వ్యక్తి కూర్చుని వున్నాడు. పదినిమిషాల్లో సోమయాజులు వచ్చాడు. మాటలు వినపడలేదు. సోమయాజులు పొట్లం యిచ్చాడు. మీసాలవ్యక్తి వెళ్ళిపోయాడు.

ప్రకాష్‌కి అనుమానం ఎక్కువయింది. వెంటనే క్రిందకి వచ్చి కారుకేసి నడిచాడు.

"టిఫిన్ చెయ్యకుండా వెళ్ళిపోతున్నారేం?" ఛాయ అడిగింది.

"నిండుగానే వుంది ట్రైంలేదు."

"ఇక్కడికి తెస్తానాగండి."

"వద్దు..." కారెక్కాడు.

మీసాలవ్యక్తి సిటీబస్ కోసం చూస్తున్నాడు. ప్రకాష్ దూరంగా కారాపాడు. అయిదు నిముషాల్లో సిటీబస్ వచ్చింది. ఫాలో అయ్యాడు.

పటమట సెంటర్‌లో దిగాడు. ప్రక్కనున్న కిళ్ళీబడ్డీ దగ్గర బర్కిలీ ప్యాకెట్ కొన్నాడు. ఇంతలో ఓ ముసలాయన అతడి దగ్గరకి వచ్చాడు.

"పుష్పకవిమానం ... సోమయాజులు భలే కేసు చూపించాడు" మీసాల వ్యక్తి నవ్వాడు.

"మనవల్ల వాడూ బాగుపడుతున్నాడు, మనకంటె ఎక్కువగా?"

"మనకి నష్టం ఏముంది ?".

ప్రకాష్ యాక్సిలేటరు తొక్కాడు బలంగా. వారి సంభాషణంతో ఊహాగానంగా బొమ్మ ఏర్పడింది.

## 7

మీ దగ్గర ఏదో డబ్బు వుండకపోతుందా, ఏమిటి ?''

"ఛాయ ఊర్లోలేదు. నన్ను చంపకు శివపాదం, నా దగ్గరేముంది దిబ్బ."

"ఎంతో అవసరముంటేగాని నేను రాను కదా !"

వర్ధనమ్మ కూడ మొగుడ్ని సమర్ధించింది "దానిమీద బ్రతికేవాళ్లం. మా దగ్గరేముంటుంది బాబూ ! అది నాలుగురోజులదాకా రాదు.''

ఇద్దరికేసి శివపాదం కోపంగా చూశాడు.

"నాన్నా ! నీ కోసం ఎవరో వచ్చారు..." దేవయ్య ఎగురుకుంటూ వచ్చాడు ఓ అపరిచిత వ్యక్తి సందేహంగా లోపలికి వచ్చాడు.

''ఎవరు కావాలి నాయనా ?'' వర్ధనమ్మ విస్మయంగా అడిగింది.

"నా పేరు శివం'' అంటూ కూర్చుని సిగరెట్టు వెలిగించాడు.

నాలుగు జతల కళ్లు అతడి మీదకి తిరిగాయి. కాషాయరంగు లాచ్చీ, తెల్లటి పైజమా ! గడ్డం అందంగా కత్తిరించబడివుంది. నుదురుమీద పెద్ద గాయపు మచ్చ.

''నేను ఎవరాఅని చూస్తున్నారు...మీ తోడల్లుడిగారి అల్లుడ్ని.ఛాయ భర్తని. మీ కోసం యింటికి వెళితే విజయవాడలో వుంటున్నారని చెప్పారు. ఛాయకి పెళ్ళిచేశారటకదా... పెళ్ళిమీద పెళ్ళి చేస్తావటయ్యా సోమయాజులూ ? మాట్లాడవేం ?" గద్దించాడు.

సోమయాజులు పిరికివాడు. ఎవరయినా గట్టిగా మాట్లాడితే నోరు తేలేస్తాడు. భర్త వైఖరి చూసి, "అలా బెల్లంకొట్టిన రాయిలా కూర్చుంటారేం ?..." శివం కేసి తిరిగి "నువ్వు ఎవరివో మాకు తెలియదయ్యా. వేషాలు వేద్దామంటే కుదరదు. నీ ప్రక్కన కూర్చున్నవాడే ఛాయ మొగుడు. బెదిరించి డబ్బు గుంజాలని చూస్తున్నావేమో'' ఆవేశంగా అంది.

శివం తాపీగా సిగరెట్ కాలుస్తూ "అలా ఎవరయినా చేశారా? చేస్తున్నారా?" అనడిగాడు.

వర్ధనమ్మ నోటికి తాళం.

"మావగారూ! యుద్ధంలో నేను చనిపోయినట్లు తప్పుడు సమాచారం వచ్చింది. పాకిస్తాన్‌వాళ్లు నన్ను బంధించి తీసుకుపోయారు. విడిపించుకుని బయటపడేసరికి ఆలస్యమైంది. రాగానే ఛాయకోసం వచ్చాను.'' శాంతంగా చెబుతూ ఆగాడు.

వర్ధనమ్మ ఈసడించిపడేసింది. "ఈ కట్టు కథలకేంలే !"

"నీకు కథల్లావుందన్న మాట..."శివం జిప్పర్ తీసి పసుపుకాగితం సోమయాజులకిచ్చి ''ఇది మీరు పంపిన లగ్న పత్రిక... ఇదిగో పెళ్ళికి ముందు కట్నం సొమ్ము తర్వాత యిస్తామని పరశురాంగారు రాసిన ఉత్తరం." చెప్పాడు ముఖంలోకి చూస్తూ.

ఆత్రంగా వాటిని సోమయాజులు అందుకున్నాడు.

"తాంబూలాలకి మా యింటికి మీ తోడల్లుడు, మీరు వచ్చారు. కుర్చీలో మిమ్మల్ని తేలుకుట్టింది... నేనే మంత్రం వేశాను."

''....................."

"పెళ్ళిలో మీ గొలుసు పోయిందని గొడవచెయ్యలేదా అత్తయ్యగారూ ?"

సోమయాజులు... వర్ధనమ్మ బిగిసిపోయారు. రక్తం చుక్కలేదు ముఖంలో. పేలిపోయిన బుడగల్లా అయిపోయారు. వెలిసిపోయిన బొమ్మల్లా అయిపోయారు.

"నమ్మకపోతే ఛాయని పిలవండి ... ఛాయ కుడితొడమీద పెద్ద పుట్టుమచ్చ ఉంది... అలా లేకపోతే నేను వెళ్ళిపోతాను."

"నీకెలా తెల్సు ? మీది బాల్య వివాహమని మరచిపోకు.'' శివపాదం అడిగాడు.

"పెళ్లయ్యాక నన్ను పండక్కి తీసుకొచ్చారు. ఛాయ, నేను ఓ రోజున తోటలో ఆడుకుంటున్నాం. ఓ కందిరీగ ఆమె బట్టల్లో దూరింది. అది కుట్టిందేమో ఛాయ పరికిణీ విప్పేసింది... ఇంకా నేనెవరో చెప్పాలా ?" హూంకరించాడు.

"కొంప మునిగింది'' వర్ధనమ్మ సోమయాజులు భావిస్తున్నారు బెంగగా.

"నువ్వేనా ఛాయని పెళ్ళిచేసుకుంట ?" శివపాదం దగ్గర కెళ్లాడు.

"వీడు కాదండి. ప్రకాష్‌గారండి. మా అక్కయ్య మొగుడు. ఆయనదేనండీ ఈ యిల్లు. ఆయనకి చాల డబ్బుంది." దేవయ్య చెప్పేశాడు.

''మరి ఛాయ భర్తని చెప్పారు." శివపాదాన్ని పట్టుకుని వర్ధనమ్మని గద్దించాడు.

"మా వాడో తిరుగరబోతు వెధవ నాయనా... వాడి మాటలు నమ్మకు.''

"నువ్వు చెప్పిన మాటలు రుజువుచేస్తావా ?"

శివపాదం విడిపించుకున్నాడు. రోషంగా చూస్తూ. "ఏయ్ మిస్టర్? ఏమిటీ దౌర్జన్యం ? నాలుగు విషయాలు తెల్సుకుని మమ్మల్ని బెదిరించి మోసంచేద్దామంటే కుదరదు. జాగత్త. అట్టే వేషాలు వేస్తే పోలీసుల్ని పిలిపిస్తాను." విసురుగా అన్నాడు.

శివం ఫోన్ దగ్గరకెళ్ళాడు. డయల్ చేస్తుంటే.

"ఎవరికి ?" ఆందోళనగా అడిగాడు దగ్గరకొస్తూ సోమయాజులు.

"ఆయనకి శ్రమ ఎందుకు ? నేనే రప్పిస్తున్నాను పోలీసుల్ని వాళ్ళే నాలుగూ చూసుకుంటారు ?"

శివం చేతిలో ఫోన్ డయల్‌మీద పెట్టించి అతడితో, "ఏమిటి బాబూ...సావకాశంగా మాట్లాడుకుందాం మనం" అని బ్రతిమాలాడు.

పరిస్థితి విషమిస్తోందని సోమయాజులు సైగచేశాడు. శివపాదం చల్లగా జారుకున్నాడు.

వర్ధనమ్మ లుంగీ యిస్తూ "లే...భోజనంవేళ దాటిపోతోంది నెమ్మదిగా మాట్లాడుకుందాం" అన్నది.

ఆనాడు జరిగిన సంఘటనలు చెబుతూంటే శివం చెల్లెలు అల్లుడిగా యిద్దరికీ నమ్మక తప్పలేదు. భయమూ పెరిగింది.

శివం భోజనాల దగ్గర "ఛాయ కనిపించదేం ?" అనడిగాడు.

తమ విషయాలు తెలుస్తాయని నాయర్‌ని పంపివేసింది వర్ధనమ్మ.

"పెళ్ళికి వెళ్ళింది" ముక్తసరిగా సమాధాన మిచ్చాడు.

శివం సుష్టుగా భోంచేసి గుర్రుపెట్టి నిద్రపోయాడు. సోమయాజులు కళ్ళే నములుతూ వంటింట్లోకి వచ్చాడు. "ఇప్పుడేం చేద్దాం?"

వర్ధనమ్మ అప్పుడే వడ్డించుకుంటోంది. భర్త వైఖరి చూసి "అలా నీళ్లుకారిపోతారేమిటి...భయపడి చస్తే ఎలా ?" మందలించింది.

అంతరాంతరాల్లో ఆమే వణికిపోతున్నది. శివం ఛాయ మొగుడే. కాదనడానికి లేదు. తప్పకుండా ప్రకాష్‌ని కలుసుకుంటాడు. ఛాయకి అధోగతే తమకీ అంతే. మళ్ళీ కాపురం మొదటి అధ్యాయంలోకి వస్తుంది, తప్పదు.




పదవి రుచి మరిగిన నాయకుడ్ని దింపివేస్తుంటే కలిగే బాధ వర్ధనమ్మకి కలిగింది.

శివం మూడింటికి లేచాడు. వర్ధనమ్మ స్వీటూ, వడలూ చేసి పట్టుకెళ్ళింది. శివానికి కొసరి కొసరి తినిపించింది.

"నాయనా...నీ సంగతి తెలియక, దాని జీవితం పాడుచెయ్యలేకా మళ్ళీ పెళ్ళిచేశాం. సుఖంగా దాని కాపురం అది చేసుకుంటోంది......బాబూ శివం...నీ చేతులు పట్టుకుంటాను.దాని కాపురం పాడుచేయకు.నువ్వు మగాడివి. నీకు పెళ్ళికాకపోదు. కావలిస్తే రెండువేలో ... మూడువేలో యిప్పిస్తాను..."

"రెండువేలా ?" శివం గట్టిగా నవ్వాడు.

"అంతకంటే దానిదగ్గర ఉండదు బాబూ ! అదయినా మొగుడికి తెలియకుండా ఎలాగో ఇవ్వాలి..."

"ఛాయ మొగుడు పెళ్ళాన్ని నమ్మడా ?"

"మంచివాడే..."

"అయితే ఛాయ తాళాలు పుచ్చుకోవద్దూ ?"

"మా పరిస్థితికూడా ఆలోచించు నాయనా ?"

శివం మాట్టాడలేదు.లేచి బట్టలు వేసుకున్నాడు.సూట్ కేసు పుచ్చుకొని హాల్లోకి వచ్చాడు. సోమయాజులు భారంగా సోఫాలో కూర్చుని వున్నాడు.

"రండి...అలా వెళదాం..."

ఇద్దరూ రోడ్డుమీదకి వచ్చి రిక్షా ఎక్కారు. హోటల్‌ముందు ఆగింది. శివం రూం తీసుకున్నాడు. బాయ్‌ని పిలిచి వందనోట్లు రెండిచ్చి 'మందు' కి పంపాడు.

'మనం కొడితే కుంభస్థలం కొట్టాలి. దాంతో జీవితం హాయిగా వెళ్ళిపోవాలి. కక్కుర్తివల్ల లాభంలేదు.'

మందు వచ్చింది. కబుర్లు చెప్పుకుంటూ పుచ్చుకుంటున్నారు. సోమయాజులుకి రెండు రౌండ్లకే నిషా ఎక్కిపోయింది.

"సోమయాజులుగారూ...మీకు ప్రస్తుతం బాగానే జరిగిపోతోంది. ప్రకాష్ మంచితనం ఎల్లప్పుడూ ఇలాగే వుంటుందని నమ్మకం ఏమిటి? అతడి కిష్టం లేక పోతే రేపు మిమ్మల్ని పొమ్మనవచ్చు, ఏమంటారు ?"

"నిజం."

"అందుకే దీపం ఉండగా ఇల్లు చక్కబెట్టుకోవాలి. మనిద్దరం కలుద్దాం. లాభం పొందుదాం ?"

"ఎలా ?"

"ప్రకాష్‌ని పైకి పంపించెయ్యడం."

"ఆ !..." సోమయాజులు ఆందోళనగా ముందుకు వంగి గ్లాసులోని విస్కీ తొందరగా తాగేశాడు. సోమయాజులు చిట్టెలుక, సింహంకాదు.

"భయపడకు. ప్రకాష్ పోతే ఆస్తి మనది. చెరిసగం తీసుకుందాం. ఛాయ ఎలాగూ నా పెళ్ళామేకదా ? వాడు పోతే మనకేం నష్టంలేదుకదా ?"

"అయినా..."సంశయంగా పెట్టాడు ముఖం.

"ఆ ఏర్పాట్లు నేను చేస్తాను. నువ్వు చెప్పినట్లు వినడమే "

సోమయాజులు మరో రౌండు కొట్టాడు. విస్కీ దిగగానే ధైర్యం వచ్చింది. ప్రకాష్ ఆస్తి తమది. ఒకరిమీద ఆధారపడనక్కరలేదు....భవితవ్యం ఇంద్ర ధనుస్సులా కనిపిస్తోంది.ఆ నిషాలో సాహసం ఇచ్చే ఫలితం మరింత పసందుగా వుంది.

"షివమ్...నీ బుర్ర...బ్రహ్మాండం. పాడ్రసం...గొప్ప...ప్లానేషావ్... అంటాలా...భం...ఓహో......ఏం తెల్వి ? నే నిన్నాళ్ళు శివపాదం గాడ్నే సుకుని...నాటకం ఆడాను....ఓ యాభై వేలు సంపాదించాను......ఇప్పుడు నీవల్ల...మొత్తానికే అధిప...తినవుతున్నా...టేంక్స్ టేంక్స్..."

"శివపాదం ఎవడు ?"

సోమయాజులు అప్పటికే సమాధిలో ఉన్నాడు. శివం ఒక్కడూ మందు చప్పరిస్తున్నాడు.

తొమ్మిదింటికి సోమయాజులు లేచాడు. "చాలా టైం అయింది."

"ఈ రాత్రి వచ్చి ప్రకాష్ కారుబ్రేకులు తీసేస్తాను. రేపు డ్రయివర్ని రాకుండా కట్టి పడేస్తాను. ప్రకాష్ కారు యాక్సిడెంట్ అవుతుంది..."

"మన పీడ వదులుతుంది."

"అయితే నువ్వు రేపు ప్రకాష్ కారెక్కాక రా !"

"అలాగే," సోమయాజులు బయటికి వచ్చేశాడు.

శివం కాసేపటికి తాళం వేసి క్రిందికి దిగాడు.

* * *

ప్రకాష్ టిఫిన్‌చేసి సిగరెట్ కాల్చుకుంటున్నాడు. దేవయ్య వక్కపొడి తెచ్చియిచ్చాడు. "మీ అక్కయ్య డ్యూటీ నువ్వు పుచ్చుకున్నావా ?" నవ్వుతూ అడిగాడు.

"అది కనిపించక కొట్టుకుపోతున్నాడనుకో." ప్రక్కనుంచి వర్ధనమ్మన్నది.

"అంబుజం పెళ్ళికి వెళ్ళి అక్కడే కూర్చుందేమిటి ?"

"ఏ పరిస్థితిలోను ఇవాళ వచ్చేస్తానంది బాబూ."

ప్రకాష్ తల ఆడించి "నేను తాడేపల్లిగూడెం వెళుతున్నా, రాత్రిదాకా రాను'' అన్నాడు బయటికి వస్తూ.

"నేనూ వస్తానండి బావగారూ." దేవయ్య వెంటవచ్చాడు, కారు దగ్గరికి

సోమయాజులు హడలిపోయాడు. విసురుగా వచ్చి "నువ్వెక్కడికిరా పిచ్చి వెధవా ? ప్రయివేటు మానెయ్యడానికి ఎత్తా ?" రెక్కపట్టుకున్నాడు

"పోనీ రానివ్వండి. ఒక్కరోజులో ఏం విజ్ఞానవంతుడు కాడు."

కొడుకుని లోపలికి గెంటి "వద్దు బాబూ......రోజూ చదువు మానేసి బలాదూర్ వెధవలా తిరిగి వస్తున్నాడు. ఇలా అయితే ఇంక చదువేం వస్తుంది ?" అన్నాడు.

ప్రకాష్ కారెక్కి డోర్ వేశాడు.

సోమయాజులు గుండెలు అదిరాయి 'నీ జీవితం ముగిసిపోతుంది ప్రకాష్' అనుకున్నాడు ప్రకాష్‌ది రాష్ డ్రైవింగ్. యాక్సిడెంటయితే పచ్చడే...

ప్రకాష్ కారుదిగి "ఫైల్ మరచిపోయానే" అంటూ పైకి వెళ్ళాడు.

పావుగంటయింది. సోమయాజులుకు అశాంతిగా ఉంది. ఇంతలో కొత్త ఛవర్లెట్ వచ్చి ఆగింది. ఇద్దరు వ్యక్తులు ప్రకాష్‌కోసం దిగారు. ప్రకాష్ వస్తూ వారిని విష్‌చేశాడు.

"రండి మా కార్లో వెళ్ళిపోదాం" అన్నాడొకాయన.

ప్రకాష్ వారి కారులో వెళ్ళిపోయాడు.

"పీడ దుంపతెగ..." సోమయాజులు నిరాశపడిపోయాడు. వెంటనే శివం కోసం హోటల్‌లోకి పరిగెత్తాడు. శివం గది తాళంవేసి వుంది.

వెయిటింగ్ రూములో కూర్చున్నాడు. పన్నెండుగంటల ప్రాంతంలో శివం వచ్చాడు. తాళం తీస్తూ "మనవాడు స్వర్గమా ? నరకమా ? చేరుకుంటాడు ?" ప్రశ్నించాడు.

"ఈపాటికి తాడేపల్లిగూడెం చేరుకుని ఉంటాడు "

"అదేమిటి ?" విసురుగా అడిగాడు కాలింగ్‌బెల్ నొక్కుతూ.

"మరో కారులో వెళ్ళాడు."

బేరర్ రాగానే బ్రూ ఆర్డరిచ్చాడు శివం.

ఓ గంటసేపు తర్జనభర్జన పడ్డారు. "అదృష్టం వాడిని కాపాడి వుంటుంది. ఈసారి ఎవరూ కాపాడలేరు. రాత్రి మెరికల్లాంటివారిని యిద్దర్ని పంపుతాను. వాళ్ళు హంతకశ్రీలు. హత్యలు వాళ్ళకి బొమ్మలాట లాంటివి."

"హత్య జరిగితే గొడవకాదూ?"

"ఆ భారం నాది. రూపాయలచేత సర్కస్ చేయిస్తే హత్య ఆత్మహత్య అయిపోతుంది."

రాత్రి తొమ్మిదింటికి ప్రకాష్ మేడమీదికి వెళ్ళిపోయాడు. ఛాయ రాకపోవడం అశాంతిగా వుంది. ఆదుర్దాగావుంది.

ఇంటికి వచ్చినా తోచడంలేదు.

మరో గంటలో పైనుంచి గలాటా వినిపించింది. సోమయాజులు, వర్ధనమ్మ పైకి వెళ్ళారు ఆదుర్దాగా. రక్తం మడుగులో ప్రకాష్ వుంటాడనే వారి అంచనా తప్పయింది.

వస్తాదుల్ని ప్రకాష్ చితుచేస్తున్నాడు.

ఇద్దరూ దాసోహానికి వచ్చేశారు.

"ఎందుకు వచ్చారు చెప్పండి ? ఎవరు పంపించారు ?" ప్రకాష్ వాళ్ళని గద్దించాడు.

"ఓ గడ్డపు ఆయన, ముసలాయన మమ్మల్ని ఈడకి పంపించారండి. ఆల్లెవరో మాకు తెలియదు...డబ్బుకోసం కక్కుర్తిపడ్డాం."

సోమయాజులు గోడచాటున దాక్కున్నాడు.వాళ్ళు తనని గుర్తుపట్టి చెబితే...

"పొండి..." ప్రకాష్ వాళ్ళని గెంటి పడేశాడు.

రౌడీలు నిష్క్రమించాక సోమయాజులు, వర్ధనమ్మ దగ్గరికొచ్చాడు.

"వాళ్ళనలా వదిలేశావేమిటి బాబూ...పోలీసులకప్పజెప్పక..."

"వీళ్ళు కిరాయి వెధవలు. అసలువాళ్ళకి బుద్ధిచెప్పాలి. వీళ్ళని జైలుకి పంపించినా ఏం లాభం?"

"నీకేం దెబ్బలు తగల్లేదుకదా నాయనా?" ఆపేక్షగా అడిగింది వర్ధనమ్మ.

"ఫర్వాలేదులెండి." ప్రకాష్ తనగదికెళ్ళిపోయాడు.

రెండో ప్రయత్నం విఫలమవడంతో ఆ రాత్రి సోమయాజులికి నిద్రపట్టలేదు. కసి పుట్టింది. పట్టుదల పెరిగింది.

"ఈసారి నువ్వు ప్రయత్నించు...నా ప్రయత్నాలు రెండూ దెబ్బతిన్నాయి కదా! నీకో పాయిజన్ ఇస్తాను. ప్రకాష్ భోజనంలో కలిపెయ్. రెండుక్షణాల్లో ప్రాణం తీసేస్తుంది. మనకి రిస్కు వుండదు." మర్నాడు హోటల్లో శివం చెప్పాడు.

సోమయాజులు పాయిజన్ అందుకున్నాడు. "ఈసారి వాడ్ని దేవుడుకూడ కాపాడలేడు. ఈ రోజుతో నా అల్లుడు కీర్తిశేషుడు..."

"నీకూ ధైర్యమొచ్చిందే?"

"రాక..."

"ఛాయ ఏడుస్తుందేమో..."

"దాని ఏడుపు మనకెందుకు...ఇక అది నీ పెళ్ళామే..."

* * *

శివం నవ్వాడు.

"అమ్మాయ్...అతడుకూడ వచ్చాడు. ఏకంగా వడ్డించేయ్." సోమయాజులు డైనింగ్ హాల్లోకి తొంగిచూస్తూ కేకేశాడు.

నాయర్‌కి ఒంట్లో బాగులేదు. బలవంతంగా వంటమాత్రం చేసి వెళ్ళి పడుకున్నాడు. వడ్డన సంగతి తాను చూసుకుంటానంది ఛాయ.

ఎవరూ రాకుండా, సోమయాజులు డైనింగ్ టేబుల్‌ముందు కూర్చున్నాడు. ప్రకాష్ ఎక్కడ కూర్చుంటాడో తెలియకుండా పాయిజన్ కలపడం ఎలా? సోమయాజులుకి ఎంతో కంగారుగావుంది. భయంగావుంది. శిధిలమయిన పాత కోటలో అర్ధరాత్రి తిరిగేటప్పుడు కలిగేభావం కల్గుతోంది. నలుగురూ వున్నా ఏకాకిగా ఫీలవుతున్నాడు.

అంతరంగంలో పాపం హెచ్చరిస్తోంది. మరోవైపు ధనలక్ష్మి పిలుస్తోంది.

ఎటుపోవాలి ? చివరికి మనస్సు పాపం చేయడానికే ప్రోత్సహించింది. ఇంత దాకా వచ్చాక వెనక్కి తిరిగిపోవద్దని హెచ్చరిస్తోంది.

పాపం అన్నది అర్థంలేనిమాట. పిరికివాళ్ళు చెప్పేమాట. చంపేదెవరు ? చచ్చేదెవరు ? ప్రకాష్‌కి రోజులు తీరిపోయి వుంటాయి. భగవంతుడు తనకి పురమాయించాడు.

సోమయాజులకి ధైర్యంవచ్చింది.

వర్ధనమ్మ, దేవయ్య వచ్చి కూర్చున్నారు. ప్రకాష్ రాగానే సోమయాజులు అతడి ప్రక్కన కూర్చున్నాడు.

ఛాయ వడ్డన ప్రారంభించింది.

ప్రకాష్ పేపర్ చూస్తున్నాడు.

కప్పుల్లో సేమ్యాపోసి అందరి విస్తర్ల ముందూ పెట్టింది ఛాయ. ఆమె లోపలికి వెళ్ళగానే పొట్లంతీశాడు సోమయాజులు. ప్రకాష్ పేపర్ చరవడంలో వున్నాడు. సోమయాజులు పాయిజన్ సేమ్యాలో కలిపేశాడు. వర్ధనమ్మ పేపరు కేసి... మొగుడికేసి వూపిరి బిగబట్టి చూస్తోంది.

ఛాయ లోపలి నుండి వచ్చి దీప లేచిందని మేడమీదికెళ్ళింది.

ప్రకాష్ పేపరు అవతల పడేశాడు.

"సేమ్యా చాలా బాగుందోయ్" అన్నాడు సోమయాజులు త్రాగుతూ.

"నాయర్ అందులో స్పెషలిస్టు." కప్పు అందుకుంటూ అన్నాడు.

"మా అమ్మాయ్ తయారుచేసింది."

"ఛాయకు వంటవచ్చునని నాకు తెలియదు."

"మా యింటిదగ్గర అదే వండేది "

సోమయాజులు సునిశితంగా పరీక్షిస్తున్నాడు.

దేవయ్య కప్పు ఖాళీచేశాడు. ఖాళీ విస్తరి. ఏంతినడానికీ లేదు. 'అక్కా !' అంటూ కేకేశాడు.

"ఇది తీసుకో...నాకు తర్వాత తెస్తుందిలే మీ అక్క." కప్పు దేవయ్య కిచ్చాడు.

సోమయాజులు రివ్వున లేచాడు. "వాడికి కావలిస్తే అది ఇస్తుందిలే బాబూ. నువ్వు తీసుకో !"

"కుర్రాడు, త్రాగనివ్వండి."

"ఛాయ ఇస్తుందిలే..."

"దీనికి మీ కంత పట్టుదల దేనికి ?"

"అబ్బే..."

"తీస్కో దేవయ్యా." కప్పు ముందుకు జరిపాడు.

"ఏమిటి నాన్నా బావగారిస్తుంటే వద్దంటావ్ ?"

"నోర్ముయ్యరా వెధవా !"

"అనవసరంగా ఆ పిల్లాడిని తిడతావెందుకు ?"

దేవయ్యకి తండ్రిమీద కోపం వచ్చేస్తోంది. లేచి వంగి అందుకున్నాడు. సోమయాజుల్లో రైళ్ళు పరిగెత్తాయి.

"క్రిందపెట్టు..." బలవంతంగా తాను లాగి ఇవతలపెట్టాడు

"బావగారు తినేది తీసుకుంటావా ?" వర్ధనమ్మ మందలించింది.

"నేను యిచ్చేటప్పుడేం ?" కప్పు అందుకుని దేవయ్య కిచ్చాడు.

"నీ ముఖం మండా, త్రాగకరా ?"

ప్రకాష్ విస్మయంగా చూశాడు. కోపంగా "నేనేదో విషం ఇస్తున్నట్లు కంగారుపడుతున్నారేమిటి ?" అడిగాడు.

"అదికాదు బాబూ...ఒంట్లో బాగోటంలేదుగా...జబ్బు చేస్తుందని."

"మరి ముందర త్రాగినపుడు వద్దనలేదేం !"

"అ బ్బే..."

"నేను ఇచ్చేది వారించడమేమిటి ?"

"మరోలా అనుకోకుబాబూ." వర్ధనమ్మ సర్దబోయింది

"దేవయ్యా, త్రాగితేనే అన్నం తింటాను." ప్రకాశ్ భీష్మించాడు.

సోమయాజులు, వర్ధనమ్మలకు వెనుక గొయ్యి ముందు నుయ్యిలా ఉంది. అటు డబ్బు తీపి, ఇటు కన్న మనసు తీపి.

"దేవయ్య సేమ్యా తీస్కో." ప్రకాష్ గద్దిస్తూ చెప్పాడు.

దేవయ్య అందుకోవడం, సోమయాజులు వారించడం జరిగాయి. ప్రకాష్ ఏం మాట్లాడలేదు. నాయర్‌ని పిలిచి ఏదో చెప్పాడు. అయిదు నిముషాల్లో నాయర్ వీధి కుక్కని తీసుకువచ్చాడు. ప్రకాష్ సేమ్యా దానికి పట్టించాడు. అది గిలగిల లాడుకుని చచ్చింది. సోమయాజులు శరీరం చెమటతో తడిసిపోయింది.

"ఆ రూపంలో నన్ను చూడాలని ప్లాన్ వేశావు, అవునా ?" ప్రకాష్ కేకలకి ఛాయ పరుగున వచ్చింది. ఆ దృశ్యం చూసి మాటరాక వుండిపోయింది.

"నాకేం తెలియదు బాబూ." ఏడుస్తూ అన్నాడు.

"తెలియకపోతే కంగారెందుకుపడ్డావ్ ? దేవయ్యకి సేమ్యా ఇస్తూంటే వద్దని అడ్డగించావ్. అంటే అందులో విషం వుందని నీకు తెలుసన్నమాట. అది నేనే త్రాగాలి. నేను లేకుండాపోతే ఆస్తిని నువ్వూ, శివంగాడూ పంచుకుంటారు "

"విషం కలిపాడా ?" ఛాయ ఆదుర్దాగా అడిగింది.

"ఆ కుక్కని చూస్తే తెలియడంలేదూ ! ఛాయా ... నీ పెదనాన్న సామాన్యుడుకాదు, దేవాంతకుడు. అనుమయ్య కొడుక్కి శివపాదం వేషం వేయించి నిన్ను బ్లాక్‌మెయిల్ చేశాడు. అసలు శివపాదం ఎన్నడో చనిపోయాడు. డిఫెన్సులో ఎంక్వయిరీ చేశా ! పెర్సనల్‌గా మేజర్ కూడ అతడు తన బెటాలియన్‌లో వుండేవాడని ... వీరోచితంగా పోరాడుతూంటే శత్రువులు దొంగదెబ్బ తీయడంతో చనిపోయాడని చెప్పాడు. అనుమయ్య సాయంతో మీ పెదనాన్న ఆడిన నాటకం ఇది. డబ్బుకోసం కసాయివాడిలా ప్రవర్తించాడు."

సోమయాజులు తల భూమిలోకి దిగిపోతోంది.

"నిన్ను డబ్బుకోసం ఇద్దరూ పీక్కుతింటున్నారని గ్రహించి 'శివం' వేషం వేశాను. శివపాదం పిన్నిగారివల్ల అప్పటి విషయాలు తెలుసుకోగలిగాను. దాంతో ఛాయ అసలు మొగుడ్ని నేనేనని నావెంటపడ్డారు. వీళ్ళని పూర్తిగా పరిశీలిద్దామని ఇప్పటిదాకా ఆగాను డబ్బుకోసం మీ పెదనాన్న నా ప్రాణం తీసెయ్యడానికి కూడ జంకలేదు. ఇటువంటివాడిని ప్రక్కలో ఎలా పెట్టుకుని వుండమంటావ్ ?"

ఛాయ కాళికాదేవయింది. "వెధవ బ్రతుకులు ... ఛీ ... కుక్కకున్న విశ్వాసం కూడ మీకు లేదు. నా కాపురానికే ఎసరుపెడదామని చూశారా ?... ఏమండీ పోలీసుల్ని పిలవండి...బాగా బుద్ధిచెబుతారు."

వర్ధనమ్మ ఏడుస్తూ రెండుచేతులూ పట్టుకుంది. ఛాయ తోసిపడేసింది.

"అది మనకే అప్రదిష్ట ... పోనీ ... వాళ్ళ దుర్మార్గం వాళ్ళనే నాశనం చేస్తుంది. అనుమయ్య కొడుకులదగ్గర డబ్బు వసూలుచేసి పొమ్మన్నాను."

"ఇలాంటి వెధవలకి మంచితనం పనికిరాదండీ ... మీరు ఈ క్షణం ఇలాగే వెళ్ళిపోవాలి ... నడవండి ... ఇంతటితో మిమ్మల్ని వదిలేసినందుకు సంతోషించండి "

సోమయాజులు తప్పులు ఒప్పుకున్నాడు. వర్ధనమ్మ శోకగీతం పాడుతూ "ఏదో బుద్ధితక్కువగా చేశాం ... ఛాయమ్మ తల్లీ ... ఈ వయసులో

ముందు నిలబడి స్వాగత మివ్వనున్న ఆమెనే చూస్తున్నాయి. ఆ పురింటి ముందున్న ఆమెనే చూస్తున్నాయి. ఆమెను చూస్తున్న అతనినే చూస్తు న్నాయి. చూపులు మార్చుతూ ఆ ఇరు వురినే చూస్తున్నాయి.

సైకిలుకు స్టాండువేసా డతను.

ఆమె ఆశ్చర్యానందాలతో రెండడు గులు ముందుకు వేసింది.

పెద్దకాకులు 'కావు కావు' మన్నాయి. చిన్నకాకులు వాటిని అనుస రించాయి.

కాకులు అరవటం ఆమె విన్నది. కాని ఆమెకు వాటి భాష తెలియక కాబోలు అలానే నిలుచుండిపోయింది. అతన్ని చూడగానే ఆమె కళ్ళలో మెరిసిన కాంతిని ఆ కాకులు గమనిం చకపోయి ఉండవచ్చు.

అతను ఆమెతోపాటు గుమ్మందాటి ఇంటిలోకి వెళ్ళాడు.

కాకులు అరవటం మానేశాయి. నాలుగు పెద్దకాకులు నలుదిశలకు ఎగిరి పోయాయి.

ఇంటి నడినెత్తిన ఉన్న పురిని పీకి కన్నంచేయాలనే కార్యక్రమాన్ని వాయిదావేసుకున్నందుకు నాలుగు పెద్ద కాకులు ఒకదాని నొకటి నిందించు కున్నాయి.

ఆశావాదులయిన మరి రెండు పెద్ద కాకులు చీకటిలో కళ్ళను చించుకు చూడసాగాయి.

ఇంటిలోనుండి వచ్చే మాటలను వినాలనే తాపత్రయంలో పడిపోయాయి మిగతా కాకులు.

చెట్టుమీద నిశ్శబ్దత ఆవరించింది.

పిల్లకాకులు ఆటలు మరచిపోయాయి.

పెద్దకాకులు గుసగుసలు విన సాగాయి.

అతనెప్పుడు ఇవతలికి వస్తాడా అని ఎదురుచూడసాగాయి. అతని వెంట ఆమె వస్తుందని వాటికి తెలుసు.

కాని కొన్ని యుగాలు గడిచినా అతను రాలేదు

ఆ సమయంలో ఎన్నో పొన్న పూలు, కొన్ని మొగ్గలు నేలను పడ్డాయి.

అవి స్వేచ్ఛగా చేసిన ధవళ దరహాసాన్ని చూచి కళ్ళు, ముక్కులు చిట్లించుకున్నాయి కాకులు.

ఒక కాకి విరిసిన పువ్వుతో గుసగుస లాడింది.

వినిలేకపోయింది పువ్వు. బాధతో ముఖం దాచుకుంది. దురుసుగా రెక్కల టపటప లాడించి పువ్వు నొక తోపుతోసి ప్రక్కల కెగిరిపోయింది కాకి. పువ్వు నేలను రాలింది. అతను ఇవతలికి వచ్చాడు ఆమెకూడ అతని వెనుక వచ్చింది. గుసగుసలు ఆగిపోయాయి. అన్ని చెవులు వారివైపే ఓరిగాయి.

"మీరు మరీ మాట వినకుండా పోతున్నారు డాక్టరు బాబూ !"

"నన్నేం చేయమన్నావు పొన్నా ? వెళ్ళకుండ ఎలా ఉండిపోగలను ?"

"మిమ్మల్ని రోజుల తరబడి ఉండ మన్నానా ? గంటలకొలది ఉండిపో మన్నానా ?...ఒక గంట... ఒకే గంట ఉండి, మరీ వెళ్ళమంటున్నాను..."

"ఛ! ఎందుకీ కన్నీరు ?"

"అవును...నా...నా కన్నీరే మీకు కనిపిస్తుంది. కాని మీకు నా బాధ ఎలా తెలుస్తుంది ?"

"తెలుసు పొన్నా, బాగా తెలుసు."

"తెలుసును కాబట్టే కదూ, నన్నింత బాధ పెడుతున్నారు ?"

"నిన్ను బాధపెట్టకూడదనే బాధ పడుతున్నాను. కాని ఇది కూడ నిన్ను బాధపెడుతుందంటే నేనేంచేసేది ?"

"మాటలతోనే యుగాలు గడుపు తున్నారు. కొద్దిగా లోపలికి రండి. నా మాటలు వినరూ ?"

వెనుతిరిగా డతను. అతని ప్రక్కనే సంతోషంతో కదిలిందామె.

ఆ చీకటిలో చేయి చేయి కలిసినదీ లేనిదీ తెలియక కించపడ్డాయి కాకులు.

మాసిన చీరకైనా ఆమె ఒంటి మీదకు చేరగానే ఆ మెరుపు లెలా వస్తాయో తెలియలే దొక కాకికి.

పెరటిలోని కంచెమీద ఆరే ఆ చీర జాకెట్టులకు అంత పొందిక, ఆ పుష్టి, ఆ ఒయ్యారం ఎలా వచ్చాయో అర్థం కాలే దొక అడకాకికి.

పొడవైన ఆ జడను చూచి ఈసు పడిందామె నెచ్చెలి.

ముందుకు అడుగు వెయ్యబోయి కాలిక్రింద పడనున్న పొన్న పూవు నందుకుని ఆమె చేతి కందించాడు అతను.

నవ్వుతూ తలలో తురుముకుందామె

కాకుల కళ్ళు భగ్గుమన్నాయి.

"మొగుడ్ని విడిచినదాని కెందుకో ఇంత కులుకు" అనుకున్నాయి.

"మీరలా మంచంమీద బాగోరండి డాక్టరు బాబూ ! నే ఒక్క క్షణంలో వచ్చేస్తాను" అంటూ దీపం పెద్దది చేసి పెరటిలోకి వెళ్ళిపోయిందామె. చలిగాలి రివ్వున వీస్తోంది.

బట్టలు తీయబుద్ధికాలే దతనికి. మంచంమీద మేను చేరవేసి తలక్రింద చేతుల నుంచుకొని కళ్ళు మూసు కున్నాడు.

అలా శరీరం మంచంమీదకు వాల గానే చల్లని నీడక్రింద చేరినట్టయిం దతనికి. కొద్దిసేపలా ఉంటే బాగుం టుంది, విశ్రాంతి దొరుకుతుందనిపించిం దతనికి

అలసటకు వాలిన కళ్ళు, మగతగా వాలాయి. చిన్న మగత నిద్ర. అదెంత సేపో గుర్తుకురాలే దతనికి.

అంతలో మెలకువ వచ్చిందతనికి.

ఎక్కడికి పోం? ఏంచెయ్యం? ... మామీద దయుంచి మన్నించు తల్లీ!" చేతులు పట్టుకుంది.

"ఆయన వుంచమన్నా నేను అంగీకరించను. పాము మీకంటె నయం ... నడుస్తారా పోలీసుల్ని పిలవాలా ? ... "

ఇక లాభంలేదని సోమయాజులు, వర్ధనమ్మ కదిలారు. వర్ధనమ్మ లోపలికెళ్లి సూట్‌కేస్ తెచ్చుకుంది.

"ఏముందో చూడనీ !" ఛాయ బలవంతంగా లాక్కుని తెరిచింది. నిండా నోట్లకట్టలు. ఇన్నాళ్ళూ తనని బెదిరించి వసూలుచేసిన డబ్బు.

"ఛీ మీ బ్రతుకులు చెడ... మిమ్మల్ని ఏంచేసినా పాపంలేదు," అంటూ ఓ పదిరూపాయలు విసిరి "ఇక నడవండి ... ఆలస్యంచేస్తే ఊర్కోను. ఇంట్లో నుంచి ఏం పట్టుకెళ్లడానికీ ఒప్పుకోను." గర్జిస్తూ అన్నది.

ముగ్గురూ నిష్క్రమించారు.

ఛాయ భోజనం తీసుకుని మేడమీదికి వెళ్ళింది. ప్రకాష్ సిగరెట్ కాలుస్తూ కూర్చున్నాడు. "నన్ను క్షమించరుకదూ." చేతులు పట్టుకుని ఏడ్చింది.

"నీ మెత్తదితనం చూసే వాళ్ళు ఆడించారు."

"పెళ్ళయిన సంగతి నాకు తెలియదండీ "

"ఆ సంగతి నాకప్పుడే చెబితే ఆ రోజే వాళ్ల ఆట కట్టును."

"నన్ను భయపెట్టారు."

ప్రకాష్ భోజనం ముందు కూర్చున్నాడు. "అదో పీడకలగా మరచిపోదాం. వాళ్ళు నిన్ను ఉపయోగించుకుంటూ నీ నాశనానికే గోతులు తవ్వారు... ఇక్కడ్నుంచి వాళ్లపాట్లు వాళ్లవి మనకేం ?"

"ఏ పరిస్థితిలోనూ ఇక రానివ్వను. నా మనస్సు విరిగిపోయింది."

"నీకు తెలియడానికే ఇంత నాటకం ఆడాను."

గడియారం రెండుగంటలు కొట్టింది. ఛాయ భోజనం ప్లేటు ముందుకు తోసి "తినండి...చాల ఆలస్యమైంది" అంది.

"నువ్వే పెట్టాలి !" ప్రకాష్ మారాం చేశాడు.

ఛాయ నవ్వుతూ ముద్ద నోట్లో పెట్టింది.

"ముద్దపెట్టి...ఓ ముద్దు ఇవ్వాలి, లేకుంటే తినను."

"అబ్బో ఆశ..."

ప్రకాష్ ఆమె నడుంచుట్టూ చేతులు పోనిచ్చి దగ్గరికి తీసుకున్నాడు. ఇన్నాళ్ల కలవరానికి చిరాకుపడిపోయిన ఛాయకి ఆ స్పర్శ పులకరింతగా ఉంది. మెరిసే కళ్లతో అతడ్ని చూడసాగింది.

---



# పొన్న



జయంతి వెంకటరమణ

సాయంకాలపువేళ

కార్తీకమాస తొలిదినాలలో గాలులు చలిగా వీస్తున్నవేళ పొన్నచెట్టుక్రింది పురింటిముందు సైకిలు ఆగింది.

చెట్టుమీదనున్న తమ గూళ్ళను చేరుకుని గోలపెడుతూ తమ కష్టసుఖాలను చెప్పుకుంటున్న కాకులు ఒక్కసారి నోళ్ళు కట్టుకున్నాయి. కారణమేమిటో తెలుసుకోలేక చిన్నకాకులు పెద్దకాకుల వైపు కళ్ళు ఇంతలు చేసికొని చూశాయి.

కాకులన్నీ సైకిలువైపే చూస్తున్నాయి. సైకిలు దిగుతున్న అతనినే చూస్తున్నాయి. అతనిని చూస్తూ గుమ్మం-

మైళ్ళకొలది నడచి, అలసిపోయిన కాళ్ళు, పాదాలు మెత్తని చేతులలో లాలించబడుతున్నాయి.

కళ్ళు తెరచి చూశాడు.

మెత్తని చేతులతో పాదాలు వత్తుతోంది పొన్న.

"పొన్నా ! ఏమిటిది ?" కాళ్ళను దగ్గరకు లాక్కున్నాడు.

"ఏం ? తప్పా ?"

"తప్పుకాదా ? నా కాళ్ళను నీవు పట్టుకోవచ్చా ? అదీగాక ఎవరైనా చూస్తే ."

"ఊఁ ! చూస్తే ?"

"నీకు తెలియదు పొన్నా !"

"అవును నాకు తెలియదు. నాకేమీ తెలియదు...నాకేం తెలుసు ? మీరు మా కాళ్లు పట్టుకోవచ్చు. మా పుళ్ళను కడగవచ్చు. చీమూ, నెత్తురును అసహ్యించుకోకుండ తుడవవచ్చు. చిక్కి శల్యమైపోయిన రోగుల శరీరాలను అసహ్యించుకోకుండా మీ చేతులతో తాకవచ్చు. రోగుల బాధలే మీ బాధలని వాళ్ళకోసం మైళ్ళకొలది పల్లెనుండి పల్లెకు పోవచ్చు. తిండి తిప్పలు లేక 'తిన్నావా ? పస్తున్నావా ?' అని అడిగేవారు లేక అలమటించవచ్చు, మాకోసం, మాలాంటి వాళ్ళకోసం. కాని నేను మీ కాళ్లు పట్టుకోకూడదు. భోజనంచేసారా అని అడగకూడదు. నా చేత్తో పట్టెడన్నం పెట్టకూడదు. అంతేకదూ ! ..." ఆమె కళ్ళలో నీళ్లు నిండాయి. ఆ కళ్ళతో అతన్ని చూడలేకపోయింది. మంచం పట్టెమీద తలవాల్చుకుని ఉండిపోయింది.

ఆమె ఏడుస్తోందని తెలిసికోటానికి ఎక్కువకాలం పట్టలే దతనికి. ఆమె తెంకు దగ్గరగా జరిగాడు. పొన్నపూవు అతనివైపు అమాయకంగా చూస్తోంది.

"పొన్నా ! ... ఇదిగో ఒక్కసారి తల ఎత్తి చూడవూ ? ... నిన్నే ... పోనీలే ... ఇలాంటి మాట లనటానికే కదూ ఒక గంట ఉండమన్నావు ! చెప్పు."

తుళ్ళిపడి లేచింది. "లేదు. లేదు..." అంటూ లేచి పెరటివైపు పరుగెత్తింది. ఆమె ఎందుకంత అకస్మాత్తుగా లేచి వెళ్ళిపోయిందో అతనికి అర్థంకాలేదు.

అంతలోనే తిరిగి వచ్చింది 'రండి' అంటూ.

"ఎక్కడికి ? ఎందుకు ?"

"వేడినీళ్ళు పెట్టాను. స్నానం చెయ్యండి. ఒళ్ళు నొప్పులు పోతాయి. ఎన్ని మైళ్లు నడిచారో!"

అవును. సంశయించేలోగా ఆమె అంది, "బట్టలు మార్చుకోండి. ఇదిగో తువ్వాలు." అతను కాదనలేకపోయాడు.

"స్నానంచేసి వచ్చేలోగా భోజనం సిద్ధపరచింది."

"ఇవ్వాళ నాకెంత సంతోషంగా

ఉందో తెలుసా ? ఇన్నాళ్ళకి ఈ రోజున మీరు నా మాట విన్నారు...ఎందుకంత తొందర ... నెమ్మదిగా భోజనం చెయ్యండి ... సైకిలుందిగా ! ఎందుకు నడిచారు ?"

"సగం దారి వెళ్లేసరికి సైకిలు టైరు పంక్చరైంది. తిరుగుప్రయాణాలో గాని బాగుకాలేదు."

"అన్నంవెయ్యనా ?"

"ఊహు !"

"కొద్దిగా."

"చాలు, చాలు, ఇప్పటికే చాల ఎక్కువ వేశావు."

"ఫరవాలేదు. అన్నం కలపండి. రాత్రివేళ పెరుగు వేసికోకూడదు. మజ్జిగ వేస్తాను, కలపండి."

"అదేమిటి ! ఉప్పును దీపానికి చూపిస్తావేం ?"

'మీ ఆయుషు పెరగాలని."

"పిచ్చి !"

"అనుకోండి."

"ఇకనైనా లేవవచ్చా?" అంటూ పీటమీంచి లేచిపోయాడు.

టవలుతో చేతులు తుడుచుకుంటూ మంచంమీద కూర్చుంటూంటే "కాళ్లు నొప్పిగా ఉన్నాయి కదూ ?" అని అడిగింది పొన్న.

"నాకేం కాళ్ళనొప్పి లేదు. నీవు మాత్రం కాళ్లు ముట్టుకోకు" అంటూ పాదాలదగ్గర కూర్చున్న ఆమెనుండి పాదాలు లాక్కొని నిల్చున్నాడు.

"పోనీలెండి" అంటూ దూరంగా జరిగి నిలబడిపోయింది.

"ఇక వెళ్ళనా ?"

"వెళ్ళవచ్చు. కాని రోజూ ఇలా భోజనానికి వచ్చేయకూడదూ ?"

"ఎందుకు ?"

"రాత్రి ఏ పదిగంటలకో వంట మొదలుపెడతారు. ఏ అర్ధరాత్రో భోజనంచేసా వనిపిస్తారు. నాకు బాధగా ఉంటుంది."

"నాకు అలవాటేగా."

"మంచి అలవాటు కాదది."

"మరి నే వెళ్తాను. చెరువు దాటితేనే గాని ఊరురాదు."

"తోడు రానా ?" అడిగింది.

"ఈ దారి నాకు అలవాటే." గుమ్మం వైపు నడిచాడు.

"రాత్రి కేంపు ఎక్కైనా వెళ్ళాలా ?" అడిగింది.

"కేసులుంటే...."

"అంటే అర్ధరాత్రయినా భోజనం ఉండదన్నమాట, అంతేకదూ?"

"నాకు అలవాటేగా ?" సైకి లందుకుంటూ అన్నాడు.

"మంచి అలవాటే." ఇద్దరూ చెట్టు క్రిందికి వచ్చారు.

అతను ముందుకి నడుస్తూ "వస్తానూ !" అన్నాడు.

కాకు లింకా నిద్రపోలేదు. "రేపు రావాలి."

"చూదాం."

"అలాకాదు తప్పక రావాలి."

"మరి వెళ్తాను" అంటూ సైకి లెక్కాడు. సైకిలు ముందుకి సాగింది.

చీకటిలో అతను కనిపించేంత వరకూ చూస్తూ ఉండిపోయింది.

అతను వెనుతిరిగి చూశాడు. ఆమె అలానే నిల్చుని ఉంది.

అతను చెరువు గట్టువైపు తిరిగాడు. ఆమె వెనుతిరిగింది.

కాకులు నవ్వుకున్నాయి.

* * *

అది శ్రావణమాసం. పడమరనున్న కొండలవైపునుండి తొంగిచూసే మేఘా లకు అంతేలేదు. వానలేదు. జల్లుజల్లుగా పడే వాన. బూడిదరంగు మేఘాలనుండి జారిపడే పన్నీటిజల్లు. పగలంతా అదే వరుస. రాత్రెప్పుడో కురుస్తుంది కుండలు బోర్లించినట్టు. ఊరంతా బురద మయం. పొలాల నిండుగా నీరు. నారు పోసిన పొలాలు కొన్ని, ఉబుపులకోసం వేచి ఉన్న పొలాలు కొన్ని, ఊరికి దక్షిణ దిక్కున, తూర్పున పరచుకొని ఉన్నాయి. ఊరికి ఒకటే ఒకటై ఉన్న 'గంగమ్మ చెరువు' ఊరికి దక్షిణాన ఉంది. దానికి దిగువగ సారవంతమైన భూములున్నాయి. పడమరనున్న కొండలు ఉత్తరానికి ఒంగి ఉన్నాయి. కొండలదాపున భూములకు వర్షమే ఆధారం. భూములేమంత సారవంతమైన భూములు కావు. కొండలకు ఆనుకుని రెండు మూడు పల్లెలున్నాయి. చెరువుకు తూర్పు, పడమరలో ఒక్కొక్క గ్రామ ముంది. వాటిని పద్మాపురం, మంగా పురమని అంటారు. పద్మాపురం ఎక్కువ జనాభాగల గ్రామం ఇవన్నీ పట్టణాలకు ఏడెనిమిది మైళ్ళదూరంలో ఉన్నవే. ఆ గ్రామాలు, పల్లెలు ఒక ప్రపంచం. సమష్టిగా బ్రతుకుతేనే బ్రతుకుందక్కడ. చమురు దీపాలే రాత్రికి వెలుగు. అన్ని గ్రామాలకు చెరువులు లేవు. నేల బావులే. అవైనా ఒకటి, రెండు. పెంకు టిళ్ళు అక్కడక్కడ. అవైనా పద్మా పురంలోనూ, మంగాపురంలోనూ. పద్మా పురంలో శివాలయముంది. ఆ దేవుని మహిమలు చెప్పగల పూజారి, శివరాత్రి నాడు దేవుని కీర్తించి జాగరణ చేయించగల భజనపరులు, కాస్తో కూస్తో డబ్బున్నవారు, చిన్న ఎలిమెం టరీ స్కూలు, రాత్రివేళల అందులో బ్రామగన్నుపెట్టి నిద్రపోయే పశువులు, మునసబుగారి ఇల్లరికపు టల్లుడిగారి బ్యాటరీ రేడియో, మొరిగే కుక్కలు, అరచే కాకులు, కష్టపడే కూలీజనం ఉన్నారు. ఆ కూలీజనంపై అజమా యిషీ చేస్తూ మకుటంలేని మహారాజుల్లా చలామణి అయ్యే కామందులు ఉన్నారు.

ఊరి చివర చెరువుకు కొంతదూరంలో ఉన్నదే పొన్నమ్మ ఇల్లు. ఆ ఊరికేకాక ఆ చుట్టుప్రక్కలకు కూడ హాస్పిటల్ ఏదీ లేదు. అక్కడ హాస్పిటల్ ఉండ టాన్ని గురించి ఆలోచించేవారే తక్కువ. హాస్పిటల్ పెట్టినా ఏ డాక్టరూ అక్కడ ఎక్కువకాలం ఉండలేదట. కారణం ఊళ్ళలో సౌకర్యాలు తక్కువట. కరెంటు లేదట. జీపు కూడా రావ టానికి సరియైన దారి లేదట. అసలు ప్రజలకు జబ్బులున్నా గవర్నమెంటు వారి మందులు అక్కరలేదట. శివా లయం పూజారి చేతిమాత్రలు, స్వామి వారి పాదోదకం లను మించిన మందులు లేవట.

అలాంటి ఆ ప్రాంతానికి ఆరునెలల క్రితమే వచ్చాడు, డాక్టరు. గవర్న మెంటు తరపునుండి కాదు. కొన్ని ఆశయాల పైరుల్లో పండివచ్చాడు. కొన్ని ఆశయాలను ఫలింపచేసు కోవటంకోసం వచ్చాడు. 'మందు లిస్తా డట, నయం చేస్తాడట. కాని డబ్బు అడగడట. కుర్రవాడేగాని అనుభవజ్ఞు నిలా మందు లిస్తాడట. జీతంలేదట. మరెందుకున్నట్టో ఊరిలో.' నలుగురూ అతను వచ్చిన క్రొత్తలో అనుకునే మాటలు ఇవి.

కడుపులో నొప్పిని చేతితో తీసివేసి నట్టు నయంచేసిన తరువాత డాక్టరు నడిగా డొకముసలా డిదే ప్రశ్న.

"నే నిక్కడెందుకున్నానో కావాలా ? లేక నా మందు కావాలా ముసలాడా ?" అడిగాడు డాక్టరు.

నవ్వేశాడు ముసలాడు.

"ఇంటి గోడలకు చవుడుపట్టి గోడ పాడయితే ఇటుకలు, సున్నం అవ సరమా కాదా ? మన శరీరానికి కూడ ఇటుకలు, సున్నం అవసరమే. మరి ఇవి ఈ మందుల్లో ఉన్నాయి. నీ గాయ మెలా నయమైందనుకున్నావ్ ? మరి మందు వద్దనవచ్చా ?" అనిన భద్రయ్య గారి ముసలమ్మతో అన్నాడట.

"అయితే తినకూడని పదార్థం తిన్నా వన్నమాట, ఎంత కొద్దిగా అయినా. నీ కిచ్చిన మాత్ర ఎంతుందని ? జబ్బు నయం చేయటంలేదూ " కరణంగారి పాలేరుతో అన్నాడట.

సూరయ్య కోడల్ని బ్రతికించి నందుకు పాతిక రూపాయలు చేతిలో పెడితే "బీదవాడివి నీవు ఇచ్చే దేమిటి? నే పుచ్చుకునే దేమిటి ?" అన్నాడట.

ఇవే మాటలు డాక్టరు వచ్చిన క్రొత్తలో. నీలాటి రేవుదగ్గర శివాలయం అరుగుమీద. నీలాటి రేవుకు నీళ్ళకోసం వచ్చే పొన్నమ్మ జాగ్రత్తగా వినేది, ఆ మాట లన్నింటిని. అత నెలా ఉంటాడో చూడాలనుకునేది. అనుకోవ టమేగాని చూడటం కాలేదు. కాని చూడ గలిగే రోజు రానే వచ్చింది.

శ్రావణమాసం. ఉదయపువేళ.



రాత్రి పడ్డవర్షంతో నేలంతా బురద బురదగా ఉంది. చెరువులో కలువలు, పద్మాలు వర్షపు దెబ్బకు తల ఎత్తుకో లేకపోతున్నాయి. తామరాకుమీద నీటి బిందువులు నీరెండలో మెరుస్తున్నాయి. మర్రిచెట్టు దిగువన ఉన్నది ఆడవాళ్ళ నీలాటిరేవు. ఆ రేవుకు దాపులో ఎగువలో నున్నది మగాళ్ళు స్నానాలు చేసే రేవు. నీటిలోంచి బయటకు వచ్చి వాలిన చెట్టుకొమ్మల దాపునకొస్తే మగాళ్ళకు, ఆడాళ్లు కనపడరు. అక్కడ బట్టలు మార్చుకోవచ్చు. నంది విగ్రహం ప్రక్కనున్న బండలమీద పిండు కున్న తడిబట్టల నుంచుకోవచ్చు. అక్కడకు ఎగువనున్నది మంచినీళ్ళ రేవు. స్నానం చేసినవాళ్లు నీళ్లు రేవులో ముంచు కెడతారు. ఇంటిదగ్గర స్నానం చేసిన తరువాత బట్టలు ఉతుక్కో టానికి, మంచినీళ్లు ముంచు కెళ్ళటానికి అక్కడికి వస్తుంది పొన్న.

ఆ రోజున అందుకే వచ్చిందక్క డికి. మోకాలులోతు దాటి చీరను తడవ కుండా పట్టుకుని, బిందెలో నీళ్ళు ముంచుతోంది పొన్న. మగాళ్ళ స్నానాల రేవులో కలకలం – తల ఎత్తిచూసింది. అందరూ చూస్తున్నారు. పైకి తేలి చేతు లాడిస్తూ మునకలువేస్తూ, మళ్ళా తేలి మునకలువేస్తున్న వ్యక్తిని. కాలేజీ

చదువులు సాగిస్తూ సెలవులకో, మరెందుకో ఇంటికి వచ్చిన కరణంగారి రెండో అబ్బాయి రేవులో చెట్టుమీంచి పిల్లిమొగ్గ వేసినవాడు ఊబిలోకి దిగాడట. అందరూ అనుకుంటూ ఉంటే విన్నది. రక్షించటానికి ఎవరూ రాలేదు నీళ్ళలో ఉన్నవాళ్ళు కూడ ఆదరా బాదరాగా బయట కొచ్చారు. ఈత రానివాళ్ళు మాత్రం అరుస్తున్నారు, కరణంగారి అబ్బాయి మునిగిపోతున్నాడని.

అంతలో పరుగు పరుగున వచ్చా రెవరో — పొడవైన అంతబలిష్టము కాని శరీరము — నీటిలోకి దుమికి - మునిగి ఈదుకుంటూ పోయాడు. రెండు క్షణాలు ఎవరూ నీటిమీద కనిపించలేదు. మరి రెండు క్షణాలు గడిచాయి. ఒక చేత్తో కరణం గారి అబ్బాయిని పట్టుకుని రెండవచేత్తో రేవు ముఖంగా ఈదుకుంటూ, తేలుకుంటూ వచ్చాడతను. అతనే 'డాక్టరు బాబు' అట. పొన్న మనసు ఆనందంతో పులకించింది. అందరియెడల దయచూపించే డాక్టరు ఒక్క ఘన కార్యాన్ని చేస్తూ కనిపించటం మరింత ఆనందదాయకమైందామెకు అందరితో పాటూ తాను కూడా ఆ రేవుకి చేరింది. అతనిని బోర్లా పడుకోపెట్టి రొమ్ము టెముకల క్రింద నొక్కి- నీటిని కక్కిస్తున్నాడు. శ్వాసక్రియను క్రమపరుస్తూ ఉంటే అందరూ డాక్టర్నే వింతగా చూస్తూ ఉండిపోయారు.

వేణు కళ్ళు తెరిచాడు. డాక్టరుబాబు అందరివైపూ తిరిగాడు. "కొద్దిసేపు ఇతనికి విశ్రాంతి కావాలి. ఈ సమీపంలో ఎవరి ఇల్లైనా ఉంటే చెప్పండి. అక్కడికి తీసికెడదాం'' అన్నాడు.

అందరికన్నా ముందే అంది పొన్న, "డాక్టరు బాబూ ! మా ఇల్లు ఇక్కడికి చాలదగ్గర. రండి" అని.

ఆమె ఆహ్వానాన్ని అతను కాదన లేదు. ఇద్దరు రైతులు వేణుని చేతుల మీద మోసుకొస్తూంటే పొన్నమ్మను అనుసరిస్తూ అందర్నీ చూచి "ఇక అతని కేమీ భయంలేదు. మీరు మీమీ పనులు చూసుకోవచ్చు. మీలో ఎవరైనా ఈతని తండ్రిగారికి తెలియజేయండి'' అంటూ ముందుకి సాగాడు. వేణుకు పడక ఏర్పాటుచేసి వేడి వేడి పాలు గ్లాసులో పోసి ఇచ్చింది. వేడి పాలు త్రాగిన తరువాత తేరుకున్నా డతను. పరుగు పరుగున వచ్చారు కరణంగారు. డాక్టరుబాబు చేతులు పట్టుకుని "మీరు దేవుడు'' అన్నాడు.

"కాదు, మామూలు డాక్టర్ని. ఈ రోజు సాయంత్రం వచ్చి చూస్తాను. విశ్రాంతి తీసుకోమనండి'' అంటూ అతనితో వేణుని పంపించేశాడు.

అతనుకూడా వెళ్ళిపోబోతూంటే వేడి పాలగ్లాసుతో ఎదురొచ్చింది. పొన్న. "త్రాగి వెళ్ళండి'' అంది.

"నా కెందుకు ?'' అన్నాడు.

"మీరు దేవుడు. మీకు కాక మరెవరికి ?''

''తప్పు. నేను మామూలు మనిషిని ''

''అవును. మనిషి రూపంలో ఉన్న దేవుడు. తీసుకోండి'' అంది.

వేడి పాలను ఊదుకొని త్రాగాడతను.

''మీకు భయం వేయలేదూ ?''

''ఎందుకు భయం ?''

''మునిగిపోయే మనిషి ప్రమాదకరం కాదూ ?''

''నాకేమి ప్రమాదమైంది ?''

''భలేవారే'' అంది గ్లాసు అందుకుంటూ.

''వస్తాను'' అన్నాడు.

''ఒక్కటి'' అంది పొన్న.

''ఏమిటి ?'' అన్నాడు.

''మీరు మళ్ళా మా ఇంటికి ఎందుకు వస్తారు ? అందులోనూ మాలాంటి వారింటికి.''

''భలేవారే ! వెళ్తాను'' అన్నాడు నవ్వుతూ.

''అయితే మళ్ళీ రారా ?''

"ఎందుకూ?''

''మీరేగా ఇందాక వస్తానన్నారు ?'' అడిగింది.

''వెళ్ళి వస్తాననటం మనలో మామూలు'' అన్నాడు డాక్టరుబాబు.

"అనటం కాదు. మీకు వీలయినప్పుడు రండి. మీలాంటి దేవుణ్ణి చూడటం నా కానందం. ఒక గ్లాసు పాలు త్రాగిపోవచ్చు. అందరూ మీరెంతో మంచివారని అంటే విన్నానే గాని మీరెంత మంచివారో ఈరోజే తెలిసింది.

"ఊరకే పొగిడేస్తున్నారు. సెలవా?" అంటూ నవ్వేశాడు.

ఆ విధంగా ప్రథమంగా కలిసింది డాక్టరుబాబును పొన్న.

* * *

అది నల్లని రాత్రి.

ఆకాశంమీద మేఘాలు క్రమ్ముకున్నాయి. చెరువుగట్టున జువ్విచెట్లు గాలికి రొద చేస్తున్నాయి.

ఏ క్షణంలోనైనా వర్షం వచ్చేటట్టు ఉంది.

మంచంమీద కుర్రాడు జ్వరతీవ్రతతో పలవరిస్తున్నాడు.

మంచంప్రక్క తల్లి కళ్ళనీళ్ళు గ్రక్కుకుంటోంది.

అకాల మరణాన్ని పొందిన భర్తను గుర్తుకు తెచ్చుకుంటోంది. కనిపించని దేవుడికి మొక్కుకుంటోంది. ఆమె బాధను చూడలేకపోతోంది పొన్న. ఆమె అంది :

"సీతాలూ ! ఎంతకని బాధపడతావు ? పద డాక్టరుబాబు దగ్గరకు వెడదాం."

"పొన్నా ! ఈ చీకటిలోనా ? ఈ

గాలిలోనా ?" ఆకాశంవైపు కన్నీళ్ళతో చూస్తూ అంది సీతాలు.

"రంగడి కేమీ కాదు. నాలుగు దుప్పట్లు కప్పి నా భుజాన వేసు కుంటాను. నీవు నా వెంట రా. డాక్టరు దేవుడు." చెప్పి ఒప్పించ ప్రయత్నించింది పొన్న. సీతాలు అంగీకరించలేదు.

"రాలేనే పొన్నా ! నా చేతులారా రాబోయే గాలీ, వానలో నా కొడుకుని చంపుకోలేనే" అంటూ కొడుకుని గుండెలకు హత్తుకుని దుఃఖించ సాగింది.

"సరే ! అలాగే కానియ్యి నేనే వెళ్ళి డాక్టరుబాబును తీసుకొస్తాను. డాక్టరుబాబు రాకపోరు" అంటూ చీకటిలోకి దూసుకునిపోయింది పొన్న.

సుడిలో దూకి ఒక ప్రాణిని రక్షించిన డాక్టరే ఆమె కళ్ళ ముందున్నాడు. చీకటి ఆమెకు కనపడటంలేదు. గాలి వీస్తున్న సంగతామెకు తెలియదు. "డాక్టరుబాబు అంతటి సాహసం చేయగా నేనీమాత్రం సీతాలుకోసం చేయలేనూ ?" పదే పదే అనుకుంటోంది. "తుఫాను వచ్చినా, పిడుగులు పడ్డా డాక్టరుబాబు వచ్చి తీర్తాడు" అనే నమ్మకంతో ముందుకు సాగింది. మంగాపురం చేరి డాక్టరుబాబు ఇల్లు వాకబు చేసింది, అతని ఇల్లు చేరేసరికి ముందున్న గదిలో హరికెన్ లాంతరు వెలుగుతోంది. రెండో గదిలో డాక్టరున్న సవ్వడి వినవచ్చింది.

పిలిచింది పొన్న. రెండో పిలుపు అవసరం లేకుండా వచ్చాడు. "ఎవరూ?" అడిగాడు చీకటిలోకి చూస్తూ.

"నేను డాక్టరుబాబూ ! నేను పొన్నను ... పొన్నమ్మను ... పద్మాపురం..."

"ఓ, ! మీరా ! రండి. ఏం ? ఇలా వచ్చారు ? నా అవసరం ఏదైనా ఉందా ?" ఇంటిలోకి ఆహ్వానిస్తూ అడిగాడు. పరిస్థితి చెప్పింది.

"చాల శ్రమపడి వచ్చారు, ఇంత చీకటిలో. ఈ పరిస్థితిలో నేనెలా వస్తానని అనుకున్నారు ?" అడిగాడు.

"మీరెలాంటి పరిస్థితిలోనైనా ఒక ప్రాణికోసం వస్తారు డాక్టరుబాబూ ! నాకు బాగా తెలుసు."

"నామీద మీకు చాల నమ్మకం."

"గుడిలో దేవుడైనా అన్యాయం చేస్తాడు. మీరుమాత్రం నమ్ముకున్న వాళ్ళను అన్యాయం చేయరు డాక్టరు బాబూ !".

అతను ఆ వెలుగులో ఆమె ముఖంలోకి చూశాడు. అది పొగడ్త కాదు. హృదయం పలికిన పలుకులు. అమాయకమైన కళ్ళు, ఆ కళ్ళలో నిశ్చలభావం అతనిని ఆకట్టుకున్నాయి.

"కూర్చోండి, ఇప్పుడే వస్తాను" అంటూ ఇంటిలోపలికి వెళ్ళాడు

పొన్న నిలబడిపోయింది. మూడుగదుల ఆ ఇంటిలో మందుల వాసన బీరువాల లోంచి రాసాగింది. చివరి గదిలో వంట గిన్నెలు, కిరొసిన్ స్టౌ కనిపించాయి. వంట అయిందో, అవుతుందో, అవలేదో ఆమెకు తెలియదు.

కొద్దిసేపటిలో మెడిసిన్ చెస్టుతోనూ, త్రీ సెల్సు టార్చిలైటుతోనూ వచ్చాడు 'పదండి' అంటూ. ఇద్దరూ ఇవతలికి వచ్చారు. గాలి వీస్తూనే ఉంది. చీకటి చిక్కగా ఉంది. చిన్న చిన్న వానచినుకులు పడసాగాయి. మంగాపురం దాటారు. అతనితో సమంగా నడవలేక పోతోంది పొన్న.

''నేను మీతో పరుగెత్తలేను డాక్టరు బాబూ !'' అంది పొన్న. డాక్టరు వెనుతిరిగి ఆయాసపడుతూ వస్తున్న పొన్నను చూచి నడకవేగం తగ్గించి ఆమెతో కలిసి నడువసాగాడు. ఎదురు గాలిలో కదిలిపోతూ పొన్న అతన చేతిలోని మెడిసిన్ చెస్టునందుకుని అతని చేతిని గట్టిగా పట్టుకుని నడువసాగింది. చినుకులు పెద్దవయినాయి. వాన శృతి మించింది. పొన్నతో డాక్టరు పరుగెత్తి ఓ నాలుగంగలలో పద్మాపురం చేరాడు. వాళ్ళు చేరేసరికి సీతాలు వాళ్ళకోసమే ఎదురుచూస్తోంది.

పొన్న మంచంమీదనున్న కుర్రవానిని చూపించింది. భయపడనవసరం లేదని ఇంజక్షన్ ఇచ్చి, మందులు మ్రింగించి, సీతాలు తృప్తికోసం కుర్రాడు కళ్ళు తెరచి చూచేంతవరకు డాక్టరు అక్కడే ఉండిపోయాడు. పొన్న ఇంటికి పరుగెత్తి కంచుగ్లాసులో పాలు పోసి డాక్టరు చేతికి ఇచ్చింది. అతను భోజనం చేయలేదు. ఆకలిగా ఉంది. అందుచేత ఆ ఆతిథ్యాన్ని కాదనలేకపోయాడు. వర్షం కుండపోతగా పడసాగింది. కుర్రవానికి జ్వరం తగ్గుముఖం పట్టింది.

''అబ్బాయి కేమీ భయంలేదు. మరి నే వెళ్తాను'' అన్నాడు.

అతని దీక్షచూస్తే ఆ వర్షంలోనే వెళ్ళిపోయేటట్టు కనిపించసాగాడు.

"ఈ వర్షంలో మీ రెక్కడికీ వెళ్ళవద్దు. ఇక్కడే ఉండిపోండి, మా ఇంటిలోనే ఈ వర్షంలో వెళ్ళటం మంచిది కాదు. చెరువుగట్టుమీద నాగులు, త్రాచులు ఉంటాయి. మీరు వెళ్ళటం క్షేమకరం కాదు" అంది.

"అవి నన్నేమీ చేయవు."

"మీ ప్రాణం విలువ మీకు తెలియదు. మీలాంటి దేవుడు పోతే మేమంతా ఏమైపోవాలి ?"

"నాకేమీ కాదు. ఈ వర్షంలోనే నాకోసం ఎవరైనావస్తే, ఆ రోగుల రక్షించేందుకైనా నే పోవాలి. నేను వెళ్తాను. రేపు ఉదయం వచ్చి చూస్తాను" అంటూ ఆమె అనుమతికోసం వేచి ఉండక వర్షంలో ముందుకు కదిలాడు

డాక్టరుబాబు అతని పట్టుదల అర్థమైన పొన్న అతనిని ఆపలేకపోయింది.

అది రెండవ పర్యాయం ఆమె అతనిని కలియటం.

ఈ సంఘటన జరిగిన మరి రెండు రోజులకు విచిత్రమైన ఆలోచన వచ్చింది పొన్నకు. సీతాలు కొడుక్కి జ్వరంవచ్చిన వర్షంరోజు రాత్రి డాక్టరు బాబు తను రమ్మనగానే వచ్చాడు. కాని ఆ వేళలో అతను భోజనం చేసినదీ లేనిదీ తను గమనించలేకపోయింది. కాని అతను రాత్రంతా పస్తున్నట్టుగానే ఆమెకు నమ్మకం. తను ఎంతసేపూ తన స్వార్థమే ఆలోచించిందిగాని అతనికి కలిగిన అసౌకర్యాన్ని గమనించలేదు. తనావిధంగా అతని గురించి ఆలోచించలేకపోయినందుకుకించపడింది. అతనిని క్షమార్పణ కోరుకుంటేనేగాని మనసుకు ఊరట చిక్కినట్టు కనిపించ లేదు.

కనుచీకటి పడేవేళ బిందెపట్టుకుని చెరువువైపు నడిచింది, రెండు మాసిన చీరలను బిందెలో వేసుకొని.డాక్టరుబాబు ఏ ఊరినుండి మంగాపురం వెళ్ళినా అక్కడినుండి కనిపిస్తుంది. బాట కనిపించేటట్టు రేవులో కూర్చుని చింత పండుతో బిందెను తోముతూ కూర్చుంది బిందె తోమటం పూర్తయిందిగాని అతను కనిపించలేదు. రెండు చీరలను ఝాడించటం అయిందిగాని అతను రాలేదు.

చీకటిపడింది. అది చంద్రుడు రాని రాత్రి. చుక్కల వెలుగే శరణ్యం. 'ఇంతవరకు ఏ ఊరిలోనూ డాక్టరు బాబు ఉండిపోరు. ఎప్పుడో ఇల్లు చేరి ఉంటారు.' నిశ్చయించుకొని తిరిగి వచ్చింది పొన్న.

భోజనం అన్యమనస్కంగా పూర్తి చేసింది. మనసు నిలకడగా లేదు.

జడను విప్పి మరల వేసుకుని, చీర మార్చుకుని, ఇంటికి తాళంవేసి చెరువు గట్టువైపు నడకసాగించింది.

డాక్టరుబాబును కలిసి క్షమార్పణ చెప్పుకోవాలన్నదే ఆమె కోరిక తప్ప, పదిగంటల చీకటి రాత్రిలో ఒక ఊరి నుండి మరొక ఊరికి తరలిపోయి డాక్టరు కంటపడి క్షమార్పణ చెప్పుకోవాలన్న కాంక్ష తనలో చాల బలీయంగా ఉన్నప్పటికీ, అతని దృష్టిలో అది అల్పమైన విషయంగా కనిపించి, తనను కలియటానికి అది ఒక మిష అని మాత్రం అత ననుకుంటాడేమో అన్న ఆలోచనే ఆమెకు రాలేదు. సీతాలు కొడుకుకోసం డాక్టరు దగ్గరకు పరుగెత్తిన రాత్రివంటి రాత్రి కాదది. ఆ ఆలోచనే ఆమెకు లేదు. కార్యమేవిధంగా జరుగుతుందా అన్న ఆలోచన తప్ప దాని పర్యవసానంమీద ఆమె దృష్టిలేదు.

అదేమి చిత్రమో, ఆమె వెళ్లేసరికి అతని ఇంటికి తాళంఉంది.దిగాలుపడింది పొన్న. చీకటిలో తడకచాటున ఇంటి వరండాలోనే నిలుచుంది. ఎవరో ఇంటి ముందు డాక్టరుబాబుకోసం కాబోలు అటు ఇటు తిరిగి వెళ్ళిపోయారు. డాక్టరుబాబు త్వరలోనే తిరిగి రావచ్చు అన్న ఆశ కలిగిందామెకు. కొన్ని క్షణాలు భారంగా గడిచాయి. అను కున్నట్టుగానే వచ్చాడతను. అతను తలుపు తీసుకొని లోపలికి వెళ్ళిన తరువాతగాని ఆమెకు తోచలేదు, తానెలాంటి వేళలో వచ్చినద్దీ. ఏ తప్పుకు క్షమార్పణ కోరుకోవాలని తాను వచ్చిందో, అదే తప్పును తిరిగి తాను చేయబోతున్నానని తెలుసుకుంది. అతను దీపం వెలిగించాడు. ఆ వెలు గులో అలసిపోయిన అతని ముఖం కనిపించింది. ముందుకు వెళ్ళాలో వెనుకకు తిరిగి వెళ్ళిపోవాలో ఆమెకు తోచలేదు.ఇంటి గదిలోకి వెళ్ళిన అతను తిరిగి ఇవతలకు రాలేదు. చొరవ చేసు కొని ముందు గది, రెండవ గది దాటి వెనుక గదిలోకి వెళ్ళింది. నలుడు, భీముడు వంటింటిని ఏ విధంగా పావనం చేసి ఉంటారో ఆమె చూడలేదు కాని డాక్టరును చూస్తే నవ్వు వచ్చింది. నవ్వు నాపుకుంటూ,

"లోపలికి రావచ్చా డాక్టరుబాబూ?" అని అడిగింది.

ఉలిక్కిపడి తల ఎత్తా డతను. ఆమెను చూచి "ఓ మీరా! ఏం వచ్చారు?" అని అడిగాడు.

"అవును, నేనే. పొన్నను" అంది తడబడుతూ.

"ఏం? మరేదైనా కేసా?"

"అవును. కాని ఏమంత కంగారు కాదు మీరు భోజనంచేసిన తరువాతనే బయలుదేరి వెళ్ళవచ్చు" అంది పొన్న.

"అలాకాదు. పదండి వెళ్దాం" అంటూ రెండో గదిలోకి వచ్చాడు.

ఆ గదిలో దీపంలేదు. చీకటిలోనైనా ప్రక్కగదిలోని దీపం వెలుగువల్ల ఆమె ముఖం,తెల్లచీర, ఆకాశంరంగు జాకెట్టు, వీపుమీద నల్లనిజడ, జడలో కనకాంబ రాలు కనిపిస్తున్నాయి.

"చెప్పానుగా డాక్టరుబాబూ, అంత కంగారు కాదని. ముందు మీ భోజనం కానియ్యండి, వెళ్దాం ... అయినా ఆ నిప్పుమీద గిన్నెలను అలాగే వదలి వస్తే ఏంట ఏమవుతుంది?" అడిగింది.

"అవును, నిజమే. అయితే మీరు ముందు వెళ్ళిపొండి. ఒక అరగంటలో నేనే మీ ఇంటికి వచ్చి పిలుస్తాను."

"ఈ చీకటిలో ఒంటరిగా వెళ్లలేను డాక్టరుబాబూ. ఇద్దరం కలిసే వెళ్దాం. మీరు కూర్చోండి. వంట నే పూర్తి చేస్తాను" అంది. అంటూ వెనక గది లోకి వెళ్ళి బొడ్లో చీర కుచ్చిళ్ళు దోపు కుని, చీర పైటకొంగును బొడ్లో దోపు

కుని కత్తిపీట ముందు కూర్చుని అతను ప్రారంభించిన పనిని పూర్తిచేయటానికి ఉద్యుక్తురాలు కానున్న ఆమెను వారించట మెలాగో తెలియలేదు డాక్టరుకు. అదే సమయంలో 'డాక్టరుబాబూ !' అంటూ అవతలినుండి పిలుపు. అతను వీధిలోకి వెళ్లక తప్పలేదు.

పొన్న వెలుగులో ఉంది. ఆమెకు వీధిలో ఉన్నదెవరో కనిపించలేదు. కాని చీకటిలోనున్నవారికి ఆమె కనిపించి ఉండాలి. పూర్తిగా కాకపోయినా గాలిలో రెపరెపలాడే ఆమె చీర కుచ్చిళ్లు, నల్లని జడ కనిపించి ఉండాలి. చీకటిలో నున్నవారికి వెలుగులో నున్న వారు కనిపిస్తారు. కాని వెలుగులో నున్నవారికి చీకటిలో నున్నవారు కనపడరు మరి.

పది పదిహేను నిముషాలకు అతను వచ్చాడు. ఆ సరికి పొన్న వంటచేయటంలో నిమగ్నమైన తీరును చూచి మాటాడలేక గుమ్మందగ్గరే నిలబడి పోయాడు. చిట్టచివరకు నోరు పెగల్చుకొని "మీ కెందు కింత శ్రమ ?" అని అడిగాడు.

"భోజనం చెయ్యండి చెప్తాను" అంది.

గది తుడిచి కంచంవేసి, అన్నం, కూర వడ్డించి, మంచినీళ్ళగ్లాసు ప్రక్కనుంచి "రండి" అంది.

"మీరు వచ్చిన పని ఒకటి, చేసిన పని మరి ఒకటి ? మీరూ భోజనంచేస్తే బాగుంటుంది" అన్నాడు.

"కాని ఇది ఇద్దరు మనుషులకు సరిపోదు. నేను ఇంటిదగ్గర భోజనం చేసే వచ్చాను. మీరు భోజనం చెయ్యండి" అంటూ అతన్ని భోజనానికి కూర్చో బెట్టింది.

"మీరు మా గురించి ఆ రాత్రి భోజనం మానేశారు. అందుకు నాదే బాధ్యత. అందుకు, తప్పుకు క్షమార్పణ చెప్పుకుందామనే వచ్చాను'' అంది అతను భోజనం చేస్తూంటే. అతను తల ఎత్తి చూశాడు. ఆమె కళ్ళలో ఏదో మెరుపు. అతను తల దించుకొని మౌనంగా భోజనం చేయసాగాడు.

"మజ్జిగ ఎక్కడుంది ?" అడిగింది.

"ఆ గిన్నెలో ఉంటుంది." చూపించాడు. పొన్న గిన్నె అందుకుంది.

"ఇదా ! ఇది మజ్జిగా ! ఇది మజ్జిగేనా ?"

"అవును, ఇది మజ్జిగే. మంగాపురం పెరుగు ఈ రూపానికి వచ్చింది."

అతను చెయ్యి కడుక్కుంటూంటే అడిగింది, "పోనీ మా ఇంటినుండి పాలూ, పెరుగూ పంపనా ?"

"ఇక్కడ దొరుకుతున్నాయిగా."

"చూస్తున్నాగా. ఉంచండి ఆ గిన్నెలు, కంచం."

"అరే ! మీకెందుకు ఆ పని. ఆ ప్రక్కనుంచితే పనివా డుదయం కడి



గేస్తాడు." కంచం, గిన్నెలను ముట్టుకో బోతున్న పొన్నను వారించాడు.

"పోనీ, ఆ ప్రక్కనే ఉంచుతా లెండి."

"అదికూడ ఎందుకు ? తప్పు, వదు...వినండి" అంటూ ఎంగిలి కంచాన్ని పట్టుకోబోతున్న ఆమె చేతిని పట్టుకున్నాడు, వారిస్తూ. పొన్న తన చేతిని విడిపించుకుని చేయి కడుగుకొని, పైటచెరగుతో చేయి తుడుచుకుంటూ రెండవ గదిలోనికి వచ్చింది. దీపం కూడ వారితోపాటు ఆ గదిలోకి వచ్చింది. దీపం టేబిల్‌మీద ఉంది. గోడమీద ఇద్దరి నీడలు పడ్డాయి.

"నన్ను క్షమించారా ?" అడిగింది.

"దేనికి ?" అని అడిగాడు.

"ఆ రోజు రాత్రి భోజనం చెడగొట్టి నందుకు" అంది.

"మీరింకా అదే ఆలోచిస్తున్నారా ? డాక్టరు వృత్తిని చేపట్టిన తరువాత సుఖాలు కోరుకోవటం కూడదు. కష్టాలు ఎలా ఉంటాయో తెలుసుకోవటంకోసమే

నే నీ ప్రాంతానికి వచ్చాను. పట్టణ ప్రాంతాలకు పోతే అక్కడ నేను మను షులనే చూడగలను. సుఖాలను మరిగి, మనుషుల కష్టాలను గ్రహించలేక నలుగురి దృష్టిలో డబ్బును గుంజే జలగనే అవుతాను. జీవితం అంటే ఏమిటో నాకు తెలియాలి. కష్టాలంటే ఏమిటో తెలియనిచోట పుట్టి పెరిగాను నేను. పెరుగు లేనప్పుడు మజ్జిగ గురించి ఆలోచిస్తాం. అదీ లేనప్పుడు పేదవారేం చేస్తారో చాలమందికి తెలి యదు. నాకది తెలియాలి. అదేకదా జీవితం. మనిషిని మనిషి చదవగల చదువునే నేర్చుకోగలగాలి. అందుకనే నే నిక్కడికి వచ్చాను. నా పని పూర్తయిపోగానే వెళ్ళిపోతాను. ఈలోగా ప్రభుత్వం నాకోసం ఖర్చుపెట్టి చదువు కోటానికి అవకాశాన్నిచ్చినందుకు ఈ గ్రామప్రాంతాలలో కొంత సేవచేసి మరికొంత నేర్చుకుని వెళ్ళిపోతాను'' అన్నాడు.

పొన్నకు మాటలు రాలేదు.

ఎందుకో కళ్ళలో నీళ్లు తిరిగాయి. పెదవులు వణికాయి. దీపపు వెలుగులో కళ్లు నీటితో తడిశాయి. ''అదేమిటి అలా ఉండిపోయారు ?'' అడిగాడు.

''నాకు మాటలు రావటంలేదు డాక్టరుబాబూ ! మీరు చాల పెద్దవారు, ఎన్నో విషయాలు తెలిసినవారు. మీరు నేర్చుకోవలసింది ఏముందిక్కడ ?"

''ఎందుకు లేదూ ? మీనుండి నేర్చు కోవలసింది ఎంతలేదు ? నీటిలో మునిగినవానికి ఆశ్రయ మివ్వటానికి అందరికన్నా ముందుమీరెందుకుముందుకు వచ్చారో, ఆకాశం విరిగి మీదపడుతుం దని తెలిసి, చీకటిలో, గాలి, వానల్లో ఒక ప్రాణికోసం ఎందుకు పరుగెత్తు కొచ్చారో, నా చేతిలో గరిటె తీసుకుని వంటకు మీరెందుకు ఉపక్రమించారో, మా ఇంటిలో సోఫాలమీద కూర్చుంటే నాకెలా తెలుస్తుంది చెప్పండి ?" అడిగాడు.

మాట్లాడలేకపోయింది. పొన్న కొద్ది సేపు.

"నేను మీకేమీ సమాధానం చెప్ప లేను. కాని మీలా ఆలోచించేవారు ఎంత మందో ఉండరని చెప్పగలను. మిమ్మల్ని అర్థంచేసుకున్న వారెంతమందో ఉంటా రని నే ననుకోను. కొంతవరకు నాకు అర్థమయ్యా రనిపిస్తోంది ... డాక్టరుబాబూ ... ఇకనుండి నన్ను 'పొన్న' అనే పిలవండి, 'మీరూ' అని మన్నించకండి" అంది.

"అలా పిలవా లనిపించినపుడు అలాగే పిలుస్తాను" అన్నాడు.

"కొద్దిసేపటిలో మనం బయలు దేరదాం !" అన్నాడు.

"మరి మీ రెక్కడికి వెళ్ళనవసరం లేదు డాక్టరుబాబూ," అంది పొన్న.

"ఎందుకని ?"

"మీరు పరీక్షించవలసిన రోగిని నేనే. నన్ను క్షమించమని వేడుకుందా మనే వచ్చాను. మీరు క్షమిస్తే నా మనసు తేలిక అవుతుంది" అంది పొన్న.

"నిజమేనా ? కేసు లేదా ?"

"ఊహూ ! మీరు నన్ను క్షమిస్తారా ?"

"ఇంత చిన్న విషయానికా ఇంత బాధపడుతున్నారు. పదండి, కొంత దూరం వరకు మిమ్మల్ని దిగవిడిచి వస్తాను" అంటూ ఆమెతో ఇవతలికి వచ్చాడు డాక్టరు.

చీకటిలో రెండు ఆకారాలు చెరువు గట్టువైపు కదిలాయి.

* * *

సీతాలు కొడుకు ఆరోగ్యవంతుడై చాలరోజులయింది. వాడు యధా ప్రకారం బడికి పోతున్నాడు.

ఆ రోజు సాయంత్రం నీలాటి రేవు నుండి బిందె నెత్తుకుని సీతాలుతో వస్తున్న పొన్నకు సీతాలు కొడుకుకోసం డాక్టరుదగ్గరికి పరుగెత్తుకుని వెళ్ళిన వర్షపురాత్రి గుర్తు కొచ్చింది. వెంటనే అడిగింది పొన్న.

"సీతాలూ ! రంగడి జబ్బు నయమైందికదా ! డాక్టరుబాబు ఋణం తీర్చుకోవాలనిపించలేదా ?" అని.

"లేకేం పొన్నా ? గుండెనిండా ఉంది, కాని ఆ బాబు డబ్బుతీసుకోరట. మరెలాగ ?" సంశయాన్ని వెలిబుచ్చింది సీతాలు.

"అయితే చేతులు కట్టుకుని కూర్చుంటావా సీతా ? మంచి నెయ్యి కాచి ఇవ్వు. లేకపోతే మీ కోయచుట్టానికి చెప్పి పుట్టతేనె తెప్పించి ఇవ్వు. లేకపోతే సారపప్పు తెప్పించి ఇవ్వు. అదీ కాకపోతే వాడుకలు తగ్గించి పాలు, పెరుగు బాబుకి పంపు, నీకు తోచినంత కాలం."

"నిజమే పొన్నా ! నా మనసుకు తోచలేదు."

"నిజంగా నే చెప్పినట్టు చెయ్యి సీతా ! ఇదే నా కొడుకయితే నేనిలా నీలా ఊరుకునేదానినిగాదు."

పొన్న ముఖంలోకి చూచింది సీతాలు. సీతాలు చూపులోని భావాన్ని గ్రహించి తల దించుకుంది పొన్న.

"నీ పెళ్ళి, నా పెళ్ళి, ఒకవారం రోజుల తేడాలోనే అయినాయి."

"... ' పొన్న మాటాడలేదు.

"మీ ఆయనే నీతో సరిగా ఉండి ఉంటే రంగడిలాంటి కొడుకు నీకూ ఉండేవాడు కదూ ?"

"........."

"నా మాటలు నీకు బాధను కలిగిస్తున్నాయి కదూ ! మీ అమ్మ చనిపోతూ, నీ బాధను నీకే వదిలింది. నీవు ఇంత మంచిదానివి, ఇంత అందమైనదానివి.

మరి నిన్నతడు ఎందుకు కాదన్నాడు పొన్నా ?" అడిగింది సీతాలు.

"ఇప్పు డదంతా ఎందుకులే సీతా ! అతడెవరినో ఏలుకుంటున్నాడుగా," అంది తలదించుకుని పొన్న.

"అతను సుఖపడుతూంటే నీ వెందు కిలా ఉండిపోవాలి ?"

"అంటే ?"

"పెళ్ళిచేసుకోకూడదూ ?"

"వద్దులే సీతా ! అమ్మ ఇచ్చిన కట్నమే తక్కువయిందని తాళికట్టిన భార్యనే పెళ్ళిబట్టలతో బయటికి తరిమి కొట్టిన నా భర్తలాంటివాళ్లే చాలమంది మగాళ్ళు. ఇక ఎవరిని నమ్మను ? ఎలా నమ్మను ? ... మరి నీ పెళ్ళి కుదిరిందటకదా ! మీ మరిదేనా ?"

సీత సిగ్గుతో తలవంచుకుని అవు నన్నట్టు తలూపింది.

"అయితే పెళ్ళెప్పుడు ?"

"పంట ఇంటికి వచ్చిన తరువాత."

ఇల్లుదగ్గర కొచ్చింది. పొన్న ఇంటి దగ్గర ఆగిపోయింది. సీత ముందుకి సాగింది.

బిందెను క్రింద పెట్టి చీర కొంగుతో ముఖంమీది చెమటను తుడుచుకుంది పొన్న. సీతాలు ప్రసంగంతో ఆమె మనసు వికలమైంది. పొయ్యిలోకి కర్రలను ఎగదోసి మండుతున్న మంటనే చూస్తూ పొయ్యి ముందున్న పీటమీద కూర్చుండిపోయింది. పొయ్యిమీది కుండలో ఉడుకుతున్న బియ్యంలా మనసు మదనపడసాగింది. ఎగసేమంటలకు కుండలో నుండి పొర్లుతున్న గంజిని ఆమె గమనించలేదు. ఎర్రని మంటలు ఆమె కళ్ళలోపడి కళ్ళ ఎర్రదనాన్ని మరింత ఎక్కువచేశాయి.

తన పెళ్ళి గుర్తుకొచ్చిందామెకు— పాడిపంటలుగల ఇంటికి కోడలుగా కూతుర్ని పంపగలుగుతున్నందుకు తల్లి పొందిన ఆనందం గుర్తుకొచ్చింది - పెళ్ళిపందిరి గుర్తుకొచ్చింది — కట్నం తక్కువైందని మామగారు కినియటం గుర్తుకొచ్చింది — ఆ కాళరాత్రి కళ్ళలో తిరిగింది - శోభనంరాత్రి ఎంతలో కాళరాత్రిగా మారినదీ గుర్తుకొచ్చింది— భర్త చేతగానితనం— మామగారి తిట్లు— తల్లి ఏడ్పు - గడియలుపడిన వీధితలుపులు-వీధిలో నల్లని చీకటి- ఆ చీకటిలో తల్లి ఓదార్పు- ఏడ్వలేని తన బరువైన గుండె - అంతకన్న బరువైన మంగళసూత్రం - అన్నీ గుర్తుకొచ్చాయి. ఆ రాత్రి చీకటిలో ఇంటికి ఎలా చేరినదీ, ఆ రాత్రి ఎంత భారంగా గడిచినదీ గుర్తుకురాలేదు పొన్నకు.

తల్లి జరిపిన రాయబార మెలా విఫలమైనదీ, తనను సుఖపెట్టాలని తన తల్లిపడిన యాతనలు, పొన్న మరచిపోలేదు. మనోవ్యాధితో మంచంమీద నున్న తల్లిని విడిచి ఎక్కడికీ వెళ్ళలేని

తన పరిస్థితి, నలుగురి మధ్యన నిలబడి 'ఈమె నా భార్య' అని చెప్పగల ధైర్యంలేక, మగాడుగా తననుండి స్త్రీ సుఖాన్ని రహస్యంగా పొందాలని భర్త తన్ను కాంక్షించిన రాత్రి ఆమె పడిన బాధను ఆమె మరచిపోలేక పోయింది. తల్లి మరణం ఆమెకు గుర్తు–ఆమె శవంపై పడి తాను రోధించటం తనకు గుర్తు. భర్త తనపై ప్రతీకారంతో వేసిన నిందలు గుర్తు–మరచిపోవలసినవన్నీ తనకు గుర్తే !

గతంనుండి మనసు మళ్ళించుకోవాలని పొయ్యి ముందునుండి లేచి పోయింది పొన్న. పెరుగు వాడికల కోసం ఎవరో వచ్చారు. గిన్నెలోకి పెరుగును పోస్తూంటే డాక్టరుబాబు గుర్తుకొచ్చాడు– అతని మాటలు గుర్తుకొచ్చాయి. చీకటి గుర్తుకొచ్చింది–వీధిలోకి చూసింది – చీకటిలో అతనే కదలి వచ్చినట్టయింది. మనసులో కలత తొలగిపోయింది.

'ప్రతిరోజు పాలు, పెరుగు డాక్టరు బాబుకు పంపుతేనో !' అనుకొంది. కాని ఎవరితో పంపాలో తెలియలేదామెకు. 'తానే తీసుకెడితే ?' తన ఆలోచనకు తనకే నవ్వు వచ్చింది. తల్లి పోయినరోజులలో ఊరిలో ఉన్న నలుగురు పెద్దల ఇండ్లకు పాలు వాడికగా పట్టుకెళ్ళినప్పుడు జరిగిన అనుభవాలు గుర్తుకొచ్చాయి. కళ్లవెంట నీళ్లు తిరిగినట్టయింది. ఏడవాలనిపించింది. కాని నోరు మెదపలేకపోయింది.

మబ్బులు కొండలను కౌగలించుకొని ఏడుస్తాయి. గాలి చెట్లను పట్టుకుని ఏడుస్తుంది. వాగు రాళ్ళఒడిలో జొరబడి విలపిస్తుంది. కాని మనిషి మనిషిని పట్టుకుని ఏడ్వలేడు. బరువైన గుండెకు లాలించే ఒడి కావాలి. అది పొన్నకు లేదు. ఆ సంగతామెకు తెలుసు. కన్నీళ్ళు రాని కళ్ళను చీర చెరగుతో తుడుచుకొని పశువులశాలలోకి పోయింది పనిమీద పొన్న.

* * *

ఆ ఊరికి వచ్చి సంవత్సరం దాటక పూర్వమే ఆ ప్రాంతమంతా పరిచయమైంది డాక్టరుబాబుకి మంగాపురం చుట్టూఉన్న పల్లెలు, జనవాసాలు అన్నీ బాగా పరిచయమైనా యతనికి. పగలయినా, రాత్రయినా, ఎండయినా, వానయినా ఆ ప్రాంతాలకు స్వేచ్ఛగా వెళ్ళిరాగల దతను రోగిని చూచి మందిచ్చి రావటానికి ఎన్ని మైళ్ళ దూరానైనా లెక్కచేయని అతని దీక్ష, అతని ధ్యేయం ఎవరికీ అర్థం కాలేదు.

ఉచితంగా వైద్యం చేయటంలో అతని మనసులోని మెత్తదనం ఎవరికీ అవగతం కాలేదు.

లోకంలో మంచిపనిచేసేవారు ఉందరని, ఒకవేళ ఎవరైనా ఏ మంచిపనో

చేసినా దానివెనుక స్వార్థం ఉండి తీరుతుందని లోకం ఒక న్యాయాన్ని వ్రాసి పెట్టుకుంది.

మనిషి ఎల్లప్పుడూ మంచిగా ప్రవర్తించకూడదు. కొంత చెడు అయినా చెయ్యాలి. ఆనాడు లోకం అతన్ని తమలో కలుపుకుంటుంది. లేనినాడు అతన్ని వెలివేస్తుంది. అతను చెడు చేయనంతకాలం అతనిలో చెడును వెతకటానికే పూనుకుంటారు. చెడు కనిపించనపుడు అతను చేస్తున్న మంచిలోనే చెడును వెతుకుతారు. ఆ ప్రయత్నంలో కృతకృత్యులు కాకపోరు

"ఇలా చేసి ప్రజలను ఆకట్టుకోవాలన్న ప్రయత్నం కాబోలు" శంకించారు కొందరు శివాలయం మంటపంలో.

"ఎమ్మెల్లే ఎలక్షన్‌కి పోటీచేసి గెలవటానికి పునాదులు వేసుకుంటున్నాడేమో !" ఊహించారు కొందరు పెద్దలు.

"కొంపదీసి క్రిష్టియన్ మతంగాని బోధిస్తున్నాడేమో ! ఇంతమంది మందు కోసం అతగాడి దగ్గర కెళ్తారుగాని ఒక్కడూ నిజం చెప్పడు. చూచి చూచి వీడెప్పుడో అందరి మతాలు మార్చేస్తాడు. అసలు వాడు కిరస్తానీవాడే. వాడింట దేవుడి ఫోటో ఒక్కటి కూడా లేదుట. ఎలాగైనా వీడిని కనిపెట్టి చూడాలి" ఉద్బోధించాడు పూజారి రామప్ప.

"కనిపెడుతున్నా ! కనిపెడుతున్నా ! ఏ ఒక్కనాడైనా ఈ గుడికి వచ్చి దేవుణ్ణి దర్శించిన పాపానికి పోయాట్టయ్యా !" గుర్తుచేసాడు అతని నేస్తం గురువయ్య.

"తీరికుండదు లేవయ్యా !" సర్దాడు పోలయ్య చుట్ట చివర్ని కొరికి, తుంపును ప్రక్కకు ఊసేస్తూ.

విమర్శకు గురియైన వ్యక్తి ఎదుట లేనప్పుడు విమర్శకులలో కొందరు అతని పక్షం వహించి, అత నెలాంటి సమాధానాలు చెప్పగలడో ఊహించి, వాదాన్ని పెంచి, తర్కంద్వారా కొన్ని నిర్ణయాలు చేసి వాటిని స్థిరంచేసి విమర్శకు గురియైన వ్యక్తికి ఆపాదించి, వాటిని వ్యాప్తిచేసి తృప్తిపడతారు. అది ఒక కళ. అందులో పోలయ్యది అందె వేసిన చెయ్యి

"అవునులేవయ్యా ! తీరి కెలా ఉంటుంది ? ఊరూరు తిరగాలి. ఇంటింటికి వెళ్ళాలి. ఎన్నో పనులు చక్కపెట్టాలి. ఎందరినో పలకరించాలి" అన్నాడు రామ్మూర్తి.

"ఏవో కానిపనులు చేసినట్టు మాటాడతా వేమయ్యా ! కనలేక బాధ పడతా ఉంటే సూరమ్మకి మంత్రసాని పనిచేసాడు. అదీ తప్పే." వాదనకు




ర క్తికట్టించే విషయాన్నందించాడు పోలయ్య.

"తప్పేముంది లేవయ్యా! నీళ్ళు తేబోతూ జారిపడ్డ భద్రయ్యగారి కోడల్ని డాక్టరు కాబట్టి చెయ్యి, కాలు పట్టుకున్నాడు అదే అదనులో ఒళ్లు తడిమినా, మరేం చేసినా తప్పేముందయ్యా! అతను డాక్టరు" అన్నాడు రామ్మూర్తి.

"ఇదేనయ్యా! మీతో వచ్చిన చిక్కు, ఇంతంటే అంతంటారు."

"పోన్లేవయ్యా! రామప్పగారి మాత్రల్లమీద ప్రజలకు విశ్వాసం పోయిన తరువాత ఎవరుమాత్రం ఏమి చేయగలరు?"

అంతటితో వారి సంభాషణ ముగిసింది.

కాని అక్కడ ప్రతి సాయంత్రం సమావేశమయ్యే ఆ లోకం రోజురోజుకు కొత్త విషయాల్ని కనిపెట్టి నలుగురికి పంచిపెట్టటానికి తాపత్రయపడుతూనే ఉంది.

* * *

పొన్న డాక్టరుబాబును భోజనానికి పిలిచి వారంరోజులయింది. అంటే రంగడి ఆరోగ్యం కోలుకుని నాలుగు నెలలైంది. ప్రతిరోజు తన ఇంట భోజనంచేసి వెళ్ళమని పొన్న చేసిన అభ్యర్థనను డాక్టరుబాబు మన్నించినట్టు లేదు. కాని అతడు పూర్తిగా తన మాటను కొట్టివేయడన్న నమ్మకం పొన్నకుంది.

అందుకు సుమారు ఇరవై రోజుల క్రితం జరిగిన సంఘటనే నిదర్శన మామెకు.

ఇరవై రోజులక్రితం — డిసెంబరు నెల మొదటివారంలో — పొన్నచెట్టు పొన్న ఇంటిముందు ఒత్తుగ పువ్వులు

రాల్చే దినాలలో – నాయుడు గారింటి పెరటిలో నాలుగు రకాల చామంతులు విరగ బూసిన రోజుల్లో, మిరపళ్ల రైతుల కళ్ళాలలో రంగవల్లికలు తీర్చి దిద్దుకున్న దినాలలో, ముద్దబంతిపూలు పొన్న పెరటిలో మంచు తెరల వెనుక ముసి ముసిగా నవ్వుకుంటున్న ఆ దినాలలో, మంచు దట్టంగా కురిసి కరిగిన ఆనాటి మధ్యాహ్నం ఎండ ఫెళ్ళున కాస్తోంది ఒంటిని చురకపెట్టే ఎండ కాదది. ఒంటిని చెమటతో తడిపే ఎండ కాదది. ముసలివాళ్ళను నీడను ఉండనీయదు – వేడిమితో తలదాచుకో నీయదా ఎండ. ఒళ్లు చిరచిరలాడడంతో సరికాదు. ఎక్కువసేపు ఎండలో ఉంటే కళ్లు భైర్లు కమ్ముతవి. తల తిరుగు తుంది. అది పైత్యపు ఎండ.

ఆనాటి మధ్యాహ్నం పన్నెండు గంటలు దాటిన తరువాత – పొన్న మధ్యగదిలో వెన్న కరగబెడుతున్న వేళ, సైకిలు దిగి సరాసరి ఇంటిలోకి వచ్చేశాడు డాక్టరుబాబు. అతడలా వస్తాడని, అంత అకస్మాత్తుగా వస్తాడని పొన్న ఏనాడూ ఊహించలేదు. అతని రాకతో తికమకపడింది పొన్న.

"ఒళ్లు తిరుగుతున్నట్టుంది. కొద్ది సేపు విశ్రాంతి తీసుకుని వెళ్ళిపోతాను పొన్నా !" అని ప్రాధేయపడుతూనే గది నలుమూలలా పరికించి చూడ సాగాడు ఎక్కడ విశ్రమించటమా అని. కుంపటి ముందునుండి గబగబా లేచింది. పెరటిలో పశువుల పాకకు ముందున్న కరివేపాకుచెట్టు నీడన అంతవరకు తను పడుకున్న మంచాన్ని ఎండలోంచి నీడలోకి లాగి బొంత పరచి, తలగడా వేసి, "రండి డాక్టరుబాబూ !" అంటూ పిలిచింది పొన్న. ఆ పిలుపుకోసమే వేచి ఉన్న అతను తలను రెండుచేతు లలో పట్టుకుని మంచంమీదకు ఒరిగాడు. ఉలుకు పలుకులేక పడుకున్న అతని కోసం తానేమి చేయగలదో తోచలేదు. ఎండలో ఉన్న సైకిలును నెమ్మదిగా వీధి వసారాలోని తడక ప్రక్కన నిలబెట్టింది.

"డాక్టరుబాబూ ! మందేమైనా వేసు కుంటారా ? మంచినీళ్ళివ్వనా ? వేడి పాలు ఇవ్వనా ?" అడిగింది.

"వద్దు ! ... ఒంటిలో పైత్యం ... ఎండ ... విశ్రాంతి ... చాలు ..." అన్నాడు ప్రయాసమీద. ఇంటిలోకి వెళ్ళి నీళ్ళలో ఉప్పు, నిమ్మకాయరసం కలిపి తెచ్చి అతనిచేత త్రాగించింది. అరగంట తరువాత లేచి కూర్చున్నా డతను. అతను లేవటం చూచి పెరటి లోకి వచ్చింది పొన్న.

"నీకు చాలా శ్రమ ఇచ్చాను పొన్నా! రాత్రంతా విశ్రాంతి లేదు. ఉదయం నుండి విరామం లేక తిరగవలసి వచ్చింది. అందుచేత ఒళ్లు అదోలా

అయింది. మరి వెళ్లొస్తాను" అంటూ లేచా డతను.

"అంత విశ్రాంతి లేకుండా ఈ ఎండలో తిరగటం ఎందుకు ? మీరు వెళ్ళినా విశ్రాంతి తీసుకోరు. నాకు తెలుసు. సాయంత్రంవరకు విశ్రాంతి తీసుకుని వెళ్ళండి."

"వద్దులే పొన్నా !" బయలు దేరబోయాడు.

"వెళ్ళకండి, నా మాట వినండి. మీకేమైనా అయితే మేమంతా ఏం కావాలి ?"

"నాకేదో అవుతుందని నీ వెందుకు భయపడతావు ? నాకేమీ కాదు. అయినా నీ కేనాడూ నేను మందివ్వ లేదుకదా, నీ కెందు కంత ఆవేదన ?"

"నాకు సంబంధించినదే లోకమా బాబూ ! నాకు మందివ్వనంతమాత్రాన మీరు డాక్టరు కారా ? డాక్టరుబాబూ, నే నొకటి అడగనా ? ఇంత ఊరుండగా ఈవేళ ఇక్కడికే రావాలని ఎందు కనిపించింది ?" అడిగింది పొన్న.

"నా కెందుకో ఇక్కడికే రావాలని పించింది. ఇక్కడే నాకు విశ్రాంతి దొరుకుతుందనిపించింది పొన్నా ! వచ్చా నందుకే" అన్నాడు. పొన్నకు చెప్పలేనంత గర్వం కలిగింది మన సులో. సాయంత్రంవరకు విశ్రాంతి తీసుకుని వెళ్ళిపోయా డతను. పొన్న భోజనం చేయమంది, కాని అతను అంగీకరించలేదు. ఆ ఉదంతం జ్ఞాప కానికి వచ్చినప్పుడు పొన్నకు అతను వస్తాడన్న ధైర్యం కలుగుతూంటుంది. కాని వారంరోజులయినా అతను రాలేదు. సీతాలు కూడా మాట నిలబెట్టుకోలేదు. డాక్టర్ని కలియలేదు. ఋణం తీర్చు కోనూ లేదు.

ఆ రాత్రి భోజనం లేకపోయినా, గాలి,వానలో అతడు వచ్చి కనకొడుకును చూచివెళ్ళటం సీతాలు మరచి పోగలిగిందా ? అని బాధపడింది పొన్న. సీతాలే కాక అందరిదీ ఒకే ప్రవృత్తి అనిపించింది.పూజారయ్య దేవుని పేరూ చెప్పి డబ్బు గుంజేవాడు. ఆనాడు మందుల పేరిట కాకపోయినా ప్రజలు అతన్ని పోషించారు. అదేవిధంగా మందును ఉచితంగా పుచ్చుకోవచ్చు అన్న అభిప్రాయంలో ఉన్నారు ప్రజలు. డాక్టరుబాబు ఏ దేవుని పేరు చెప్పరు. కనుక ప్రజలు డబ్బు నిచ్చే ఆలోచనే చేయరు. రోగాలు తెచ్చు కోవటం వారి వంతు. బాగుచేయటం అతని వంతు—

ఇలా తలచుకుంటూంటే పొన్న మనసు అదోలా అయింది

ఢాక్టరుబాబును కలిసి తన మనసు లోనిది చెప్పా లనుకుంటున్నది. కాని అవకాశం రావటంలేదు.

ఆనాటికి సంక్రాంతి పది దినాలుంది. డాక్టరు కనిపించి పది డినాలు దాటింది.

కాని ఎంతో కాలమైనట్టుం దామెకు. కనుచీకటి పడేవేళ,నిర్మానుష్యంగా ఉన్న ఆ దాపులో డాక్టరుబాబునే తలుస్తూ బిందె నిండా మంచినీరు ముంచుకుని చెరువుగట్టు ఎక్కుతోంది పొన్న. పక్క గ్రామంనుండి నడిచి వస్తున్న డాక్టరు పొన్నను చూచి గట్టుమీదే ఆగి పోయాడు. అతన్ని చూడగానే ఆమె మోము ప్రఫుల్లమయింది.

"చాలకాలమైంది డాక్టరుబాబూ మీరు కనిపించి" అంది సన్నగా నవ్వుతూ పొన్న.

"అవును" అన్నాడు.

"రావాలనే అనిపించలేదా డాక్టరు బాబూ ?" అంది గట్టుమీద ఆగి.

అతను ఆగాడు. ఆమె దగ్గరకు రాగానే, "రావాలనే ఉంది. ఎప్పుడు చికాకుగా, అలసటగా, బాధగా ఉన్నా నీవే జ్ఞాపకానికి వస్తావు. ఓ రెండు క్షణాలు నీతో మాటాడితే బాగుంటుంది. మనసు తేలికవుతుందని అనిపిస్తూ ఉంటుంది. కాని తీరికే దొరకటం లేదు. నీవు నమ్మవుగాని రెండురోజులై 'పొన్న కనిపిస్తే బాగుండును' అనిపిసోంది."

"పోనీ ఇంటికి ఇప్పుడు రాకూడదూ ! కొద్దిసేపు కూర్చుని వెళ్దురుగాని" అంది.

"ఎలా రాను ? ఆ కొండ దాపున ఇక్కడికి మూడుమైళ్ళలో ఒక కేసు చూసి రావాలి. ఆలస్యం కాకూడదు" అన్నాడు.

"పోనీ అక్కడ ఆ రాళ్ళమీద కూర్చుందాం, రండి. నీరు ఎక్కువగా లేదు కూడ. చీకటిపడినా నడిచి రాగలం" అందామె.

ఆ రేవునుండి కొద్దిదూరంలో చాకి రేవుంది. అక్కడ చాకలాళ్ళ బండ రాళ్ళు కూర్చోడానికి అనువుగా కొంత నీటిలోకి దిగి ఉన్నాయి.

నెమ్మదిగా ఇద్దరూ నడిచి వెళ్ళారు. ఆమె నడుమనున్న బిందె నందుకుని ప్రక్కనుంచాడు. ఇద్దరూ ప్రక్క ప్రక్కగా రాళ్ళమీద కూర్చున్నారు. చీర కుచ్చిళ్ళను కొంత పైకి లాక్కుని నీటిలో కాళ్ళుంచి కూర్చుంది పొన్న. కొంతసేపు ఎవరూ మాటాడలేదు. వారి మధ్యనున్న నిశ్శబ్దాన్ని భగ్నపరుస్తూ కొంగల జంట వారి ప్రక్కనుండి నీటిమీదకు ఎగురుకుంటూ పోయింది.

"మీరీ ఊరు విడిచి వెళ్ళిపోండి డాక్టరుబాబూ !" తడబడుతూ అంది పొన్న. ఆ మసకచీకటిలో ఆమెవైపు వింతగా చూశా డతను.

"అవును డాక్టరుబాబూ ! మీరీ ఊరిలో ఉండకండి. ఈ ప్రాంతంలో ఉండకండి డాక్టరుబాబూ ! మీరు వెళ్ళిపొండి." ఆమె గొంతు బొంగురు పోయింది.

"పొన్నా !"

"డాక్టరుబాబూ ! మీరు మంచివాళ్లు. మెత్తనివాళ్ళు. మీరిక్కడ ఉండ కూడదు. ఇక్కడి ప్రపంచం మీ రను కునేదికాదు. మీరిక్కడ పగ, ద్వేషం, అసూయతప్ప మరేమీ చూడలేరు. నేర్చు కోలేరు. సాటిమనిషిని ప్రేమించటం తెలి యనివారి మధ్యన మీ రుండలేరు. మీరు వెళ్ళిపోండి. మీరు తిన్నారో, పస్తు న్నారో వీరి కక్కరలేదు. నిద్ర పోయారా ? జాగరంచేసారా అని కూడా అడగరు. ఇంత ఖరీదైన మందు లెక్కడినుండి వస్తున్నాయని అడగరు. వీళ్ళకు కృతజ్ఞత అంటే ఏమిటో తెలియదు. మీ మంచితనం వీరందరికి అలవాటయిపోయింది. ఏనాడు మీరు వాళ్ళకు అనుకూలంగా లేకపోయినా మీకు ప్రమాదం తప్పదు. నేర్చు కున్నది చాలు, మీరిక వెళ్ళిపోండి, డాక్టరుబాబూ !" అంది పొన్న. ఆమె మాటాడుతూంటే ఆమె కంఠం వణికింది.

"కొంతమందిని చూచి అందరూ అలానే ఉంటారని అనుకోవటం పొర పాటు. నీకు తెలియదుగాని నే చేసిన దానికి ప్రత్యుపకారం ఎలా చెయ్యాలా అని తపనపడేవాళ్ళను చూశాను. వాళ్లు చేయలేకపోవచ్చు అంతమాత్రాన వాళ్లు కృతఘ్నులు కారు. నే నిచ్చే మందుల గురించి నీవు బాధపడనక్కర లేదు. వాటిని కొనగల స్తోమత నాకుంది నీ వన్నట్లు ఇక్కడి ప్రపంచం నాకు అర్థంకాకపోలేదు. కాని నాకేమీ కాదు. నన్నెవరూ ఏమీ చేయ లేరు. నేను ఒకరిని ఆశ్రయించాలనీ రాలేదు. ఒకరిమీద ఆధారపడాలనీ రాలేదు. నా గురించి నీవు చింతించ వద్దు. నీలాంటి ఆత్మీయురాలున్న తరువాత నాకేలోటూ లేదు" అన్నాడు.

"కాదు డాక్టరుబాబూ ! మీరుండ కండి. మీకు తెలియదు. మీరు వెళ్ళి పోండి వీళ్ళందరికోసం మీరు బాధ పడటం నే చూడలేను." అతని రెండు చేతులు పట్టుకుని కన్నీళ్ళను ఆపుకో లేక అతని చేతుల్లో తల నుంచుకుని ప్రాధేయపడసాగింది పొన్న.

"మీ కాళ్ళు పట్టుకుంటాను డాక్టరు బాబూ ! మీరు వెళ్ళిపోండి."

"పొన్నా !...పొన్నా !...ఏమిటిది ? లే...పిచ్చి ఏడ్వక ... నాకేమీ కాదు ... ఒకసారి తల ఎత్తి నావైపు చూడు ... ఛ ... కన్నీ రెందుకు ... ఊరుకో పొన్నా ... " ఆమె తల, వీపు నిము రుతూ, ఆమెను శాంతపరచజూశాడు. ఆమె అతని కాళ్ళను విడువలేదు. ఆమెలో అజ్ఞాతంగా ఏదో భయ మున్నదన్న విషయం అవగతమైంది అతనికి. ఆమె చేతులను తన చేతుల్లోకి తీసుకుని ఆమెను తన వైపు తిప్పు కున్నాడు.

"నా మాట విను పొన్నా ! నే వెళ్ళి పోతాను. నే వెళ్ళిపోతాను పొన్నా. కొద్దిరోజుల్లో వెళ్ళిపోతాను. ఇక ఊరు కోపు !" అంటూ కన్నీరు తుడిచాడు.

అతని మాటల్లో నమ్మకాన్ని వెతుకుతూ అతని భుజంమీద తల వాల్చి ఉండిపోయింది. ఆమె చేతులను లాలనగా నిమురుతూ అన్నాడు, "పొన్నా ! నా కొక సంశయముంది, తీర్చవూ. నాకేదైనా అయితే వీళ్ళంతా దిక్కులేని వాళ్ళవుతారని బాధపడేదానవు. మరి ఇప్పుడు నన్ను వెళ్ళి పొమ్మంటున్నావేం పొన్నా ?"

పొన్న తల ఎత్తలేదు. కాని సమాధాన మిచ్చింది. "చెట్టుకు నీరుపోసి, సంరక్షణచేసి పువ్వులు, కాయలు కోసుకోవటం న్యాయం డాక్టరుబాబూ ! కానీ నీరు పొయ్యక, సంరక్షణ చెయ్యక పువ్వులు, కాయలు కోసుకోవటమేకాక, ఆకుల రెమ్మలు త్రుంచి, కొమ్మను నరికేయటం న్యాయంకాదు డాక్టరుబాబూ. మీ మంచితనం వీళ్ళకు అర్థంకాలేదు సరికదా, మిమ్మల్ని కిస్తానీలనీ, ప్రజల నాకట్టుకోవాలని వచ్చిన రాజకీయ నాయకులని, శీలంలేనివారని వీళ్ళంతా అనటం నేను సహించలేను డాక్టరు బాబూ ! వాళ్ళన్నమాటలే నిజమయితే ఈ చీకటిలో ఒంటరిగా మీ సమీపంలో ఉన్న నన్ను మీరేమీ చెయ్యరేం ? ... మీ మంచితనం వీళ్ళకేం తెలుసు ? అస లెలా తెలుస్తుంది ? ఇంకా ఈ ఊరిలో ఉంటారా డాక్టరుబాబూ ! చెప్పండి?" అతని రెండు భుజాలను కుదుపుతూ అతని ముఖంలోకి చూస్తూ అంది పొన్న.

తన భుజాల పైనున్న ఆమె చేతులను నెమ్మదిగా తీసివేశాడు. లేచి నిలబడ్డాడు. పొన్న కూడా నిలబడింది. బిందెను నడుమునకు అందించాడు. అతను మాటాడలేదు. నెమ్మదిగా నడిచాడు. ఇద్దరూ చెరువు గట్టు ఎక్కారు. మౌనంగా చీకటిలో ఆమెతోపాటు ఊరివరకు వచ్చాడు.

"వెళ్తాను." ఆమె చెయ్యిపట్టుకుని అన్నాడు.

"డాక్టరుబాబూ ! వెళ్ళేముందు కనపడకుండా వెళ్ళిపోరుకదూ?" వణుకుతున్న గొంతుతో అడిగింది పొన్న. ఆమె కళ్లలో నీళ్ళున్నాయి.

''కనపడే వెళ్తానులే పొన్నా ! చీకటి ... దారి చూసుకో ... వెళ్లు'' అంటూ ఆమెను సాగనంపాడు. ఆమె పొన్నచెట్టు దగ్గరకు వెళ్ళేంతవరకు ఆగి వెనుతిరిగాడు.

* * *

"విన్నావా పోలయ్యా, మీ డాక్టరుబాబు ప్రతాపం !" దేవాలయం మంటపం అరుగుమీద భుగంమీది తుండుగుడ్డతో దుమ్ము దులుపుకుని కూర్చుంటూ అన్నాడు రామ్మూర్తి.




"ఊఁ ఏదో వార్త తెస్తేనేగాని ఉండలేవు రామ్మూర్తీ !" అన్నాడు నాగన్న.

"ఊఁ, ఊఁ ! ఏదో కథే ! చెప్పు రామ్మూర్తీ ఏమిటి కథ?" అన్నాడు రామప్ప.

"అందరికీ తెలిసిన కథే నయ్యా! కాపోతే మనకే ఆలస్యంగా తెలుస్త. మన డాక్టరుబాబు గోపికాలోలుడయ్యాడు కాదూ !" అన్నాడు రామ్మూర్తి.

"ఎవరా గోపిక ? సొంతం చెప్పు !" అన్నాడు శివయ్య ముక్కుపొడుం పట్టుపట్టబోయి. రామ్మూర్తి ప్రారంభించాడు – "ఇంకెవరు ? ఆ గొల్లది. మొగుడ్ని విడిచిన పొన్నమ్మ. రాత్రి, పగలు దానింటిలోనే నట వాడి మకాం. కూడు, కుమ్ము అక్కడేనట. పాలు, పెరుగు పెట్టి పోషిస్తోంది వాడిని. వాడు రాకపోతే అదే రాత్రి అక్కడికి పోతుందట. చెరువుగట్టున సరసాలు, కౌగిలింతలూనట. చాలాసార్లు వాడింటిలో కనిపించిదట ఆ ఊరిలో వాళ్లకి. మొన్నరాత్రి చెరువు గట్టున శోభనాచలం తమ్ముడు సిమ్మాద్రి ఇద్దరూ సరసాలాడుకోవటం కళ్ళారామూశాడట. ఊరంతా ఒకటే గోల కదయ్యా!" వీలయినంత తొందరలో అంతా చెప్పేశాడు.

"అవునయ్యా ! దొరికి దొరికి దానికి వాడే దొరకాలా ! ఊరంతా గొడ్డుపోయిందిటయ్యా ! ఎంత ఉంచుకున్నా జాతి అక్కరలేదూ?" అన్నాడు శివయ్య.

"అవునులేవయ్యా ! ఊరంతా దాన్ని చూసి నోరు చప్పరించారేగాని ఒక్కడు ... ఏదీ ఒక్కడు ... మగతనంతో చెయ్యి పట్టుకోగలిగాడయ్యా?" ఊరి కొచ్చి సంవత్సరం కాలేదు, వాడి చెయ్యి పడని ఆడదిలేదు, చూపు పడని చిన్నది లేదు. ఏవన్నా అంటే డాక్టరు. వాడి మందే మందు. ఊరికి బుద్ధి లేక పోయిన తరువాత బాహాటంగా సరసాలు మొదలుపెట్టక ఊరుకుంటాడటయ్యా !" తన కసినంతా తీర్చుకున్నాడు రామప్ప.

"ఎంతలా పనాడివైనా తొందర పాటు కూడదయ్యా ! అప్పుడే అంతా అయిపోయినట్టే మాటాడతావేమయ్యా! అసలు కథ ఇప్పుడే కదా మొదలవుత," అంటూ అందరికీ దగ్గరగా జరిగాడు పోలయ్య." దాని మొగుడు విన్నాడు. వాడే కాదు, దాని మరదులూనూ. నేడో రేపో వాడిమీద విరుచుకపడరుటయ్యా!" అని అన్నాడు.

"వాళ్లు కాకపోతే మనం. వీడి ఆటలు సాగితే సంసారులు ఏమైపోవాలి." బాధపడ్డాడు శివయ్య.

"అదీ కథ" అంటూ అందరికీ దగ్గరగా జరిగాడు పోలయ్య. అత నేదో రహస్యంగా చెప్పడంతో అందరూ అతనికే చెవుల నందించారు. ఆలయం మంటపంమీది కాకులు నలుదిశలా చెదరిపోయాయి.

* * *

రెండురోజులనుండి పొన్న మనసు, మనసులో లేదు. వీధివంక చూడలేక పోతోంది. నలుగురి ముఖం చూడలేక పోతోంది. ఇంటి ముందునుండి నడిచే జనం కూడా ఇంటిలోకి చూపులు విసిరి మరీ పోతున్నారు సీతాలు మాటలు ఆమె మరచిపోలేకపోతోంది. "మొగుణ్ని విడిచినదానవు...అతనితో ఉంటున్నావట ... చెరువు గట్టున సరాగాలట ... రాత్రి, పవలు నీ మకాం అక్కడేనట ... అతనికోసం ఎంత రాత్రయినా పోతావట...నిజంగా అంతనంటే నీ కంత మనసా ? ..."

కన్నీరు వచ్చింది పొన్నకు. ఆ రోజు భోజనం సహించలేదు. నిద్ర రాలేదు. రెండురోజులయి అదే పరిస్థితి.

ఆ రోజు కూడా భోజనం సహించ లేదు. మర్నాడే భోగి. కాని మనసు మనసులో లేదు. గడపలకు పసుపు రాయలేదు, బొట్లు పెట్టలేదు. నున్నటి జేగూరురంగు గచ్చుమీద అందమైన ముగ్గులు వేయలేదు. గడపలకు బంతిపూ తోరలుణా కట్టలేదు. ఏ పనీ చేయ మనసు కాలేదు. అది కృష్ణపక్షం. ఆమె మనసులోలాగే ఊరంతా చిక్కని చీకటి. రాత్రి పదివరకు పెరటిలోనే కరివేపాకు చెట్టుక్రింద పడుడున్నది,కాని నిద్రరాలేదు. చలిగాలి రివ్వున వీస్తూంటే ఇంట్లోకి వచ్చి నడుము వాల్చింది, కాని నిద్రరాలేదు. అంతలో తలుపు చప్పు

దయింది. పాలు, పెరుగుకోసం ఎవరు వచ్చినా పిలుస్తారు తప్ప తలుపులు తట్టరు. డాక్టరుబాబు అవుతాడన్న నమ్మకం ఆమెకు కలుగలేదు. మళ్ళా ఎవరో తలుపు గట్టిగా బాదారు. ఏదో సంకోచంతో తలుపు తీసింది. ఎదురుగా కనకరాజు. "నువ్వా !" అంది కంపిత స్వరంతో.

"అవును, నేనే ! ఏం ? పేరు చెప్పాలా గడపలో నిలబెట్టావు ? కనకరాజునే నేను, నీ మొగుడ్ని." మీసంమీద చెయ్యివేసి అన్నాడు.

"హుఁ! మొగుడు, కాపరం చేయ టాని కొచ్చావా కనకరాజు మొగడా ? రాత్రివేళ తప్ప పగలు తీరిక దొరక లేదా ?"

"హుఁ! కాపురం చెయ్యటానికి కాదే, కాపురానికి తీసుకెడదామని వచ్చాను. ఆ డాక్టరుగాడి సంగతేదో తేల్చుకుందామని వచ్చాను.'' లోపలికి అడుగుపెట్టబోయాడు కాని పొన్న దారివ్వలేదు. "పొన్న అంది, డాక్టరు బాబు సంగతేంగాని, నీతో అంత సులభంగా రాలేను కనకరాజు బావా ! పంచాయితీ పెట్టించు. నేను నీ భార్య నని ఒప్పుకో. నేను నిన్ను వదలిపెట్టింది అబద్ధమని అందరికీ చెప్పు. నా తల్లిని చంపింది నీవేనని అందరిముందు ఒప్పుకో ... డబ్బుకు గడ్డికరచి నన్ను, అమ్మని ఇంటినుండి తరిమిన రాత్రి గుర్తురాలేదా ? నామీద లేనిపోని నిందలు మోపిన రోజున గుర్తురాలేదా! ఇప్పుడు నేను నీ భార్య నయ్యానా ! నన్ను విడిచిపెట్టింది నా భార్యే అని గర్వంగా చెప్పుకున్న మగాడివి, సిగ్గులేక కాపరానికి పిలువ వచ్చావా?నీ అవసరం తీర్చుకుందామని వచ్చావా? బయటికి నడువు "

అతని కళ్ళలో కెంపులు మెరి శాయి. అవమానాన్ని నిగ్రహించుకో లేకపోతున్నాడు. కాని నిలదొక్కు కున్నాడు. పళ్ళు పటపట కొరికాడు

"నేను నీ భర్తను కానన్నా, నీవు నా భార్యవు కావన్నా, నేను నీ కుల పోడినే. నేను నీ డాక్టరుకన్న బల వంతుడ్ని, అందగాడిని. ఊరు కాని వాడిని పంచన చేర్చావు. నేను నీకు కాకపోయానా ?"

"ఎన్నైనా కావచ్చు. కాని నీవు కుక్కవి. అందుకే నీ కుక్క బుద్ధి చూపించావు నాతో వాదన పెంచకు. డాక్టరుబాబు పేరు మలినం చెయ్యకు. వెళ్ళు,"అంటూ నిశ్చేష్టుడైనకనకరాజును నెట్టి తలుపులు మూసేసింది పొన్న.

కనకరాజులో రౌద్రం రగిలి ఉంటుంది. తిట్టుకుంటూ, "నిన్నూ, నీ డాక్టర్నీ ఏంచేస్తానో చూడు" అంటూ తలుపు నాలుగుసార్లు బాది వెళ్ళిపోయాడు కనకరాజు.

కనకరాజు బెదిరింపులు మనసులో తిరుగాడుతుండగా చాల రాత్రివరకు నిద్రరాలేదు పొన్నకు.

* * *

చిక్కని చీకటి. రాత్రి పన్నెండు గంటలవేళ. చీకటిని చీల్చుకుంటూ టార్చి - టార్చిని పట్టుకుని డాక్టరు బాబూ అతని వెనుక నలుగురు మనుషులు.

పద్మాపురానికి దగ్గరగా చెరువుగట్టు మీది జువ్విచెట్టు దగ్గర కొచ్చారు.

"ఆగండి, డాక్టరుబాబూ!"

వెనుతిరిగాడు డాక్టరు. "ఎందుకు?" అడిగాడు

"మనం ఇక ముందుకి పోనక్కర లేదు" అన్నా డొకతను.

"అదేం! మీ ఊరికి మైలుదూరంలో రోగి ఉన్నాడంటివిగా, రోగి అక్కడ లేడా ?"

''అక్కడ లేడు డాక్టరుబాబూ ! ఇక్కడే ఉన్నాడు'' అంటూ ముగ్గురు దగ్గర కొచ్చారు. రెండు చేతులను బిగిసి పట్టుకున్నారు. అతను గింజుకుంటూంటే జువ్విచెట్టు దగ్గరకు లాక్కెళ్ళారు. అంతకుముందు దాచి ఉంచిన త్రాళ్ళతో అతన్ని చెట్టుకు కట్టేశారు. జువ్విచెట్టు చువ్వల నందుకున్నారు

"అక్రమం ! అన్యాయం !! మోసం !!!" అరిచాడు డాక్టరు.

నవ్వాడు కనకరాజు. "అది కనుక్కుందామనే తెచ్చాం. ఏ ఊరు నీది ? ఎందుకొచ్చావు ఇక్కడికి ?" అడిగాడు

''నీవు కొత్తగా వచ్చావా ఇక్కడికి? నే నెందుకు వచ్చానో అందరికీ తెలుసు. నీకు చెప్పక్కరలేదు." గింజుకుంటూ అన్నాడు డాక్టరు.

"పోనీ చెప్పకు, పొన్న ఎవరో తెలుసా ?"

"తెలుసు, ఆమె దేవత."

"కాదు, దెయ్యం. ఆమె సంగతి మరిచిపోకు. ఊరు విడిచి వెళ్ళిపో !"

"ఆ సంగతి చెప్పడానికి నీ వెవరివి ?"

"నీ పాలిటి యముడ్ని." హూంకరించాడు కనకరాజు.

"అది నీ ఇష్టంకాదు. ఈ ఊరిలో ఉండడానికి అందరిలా నాకూ స్వేచ్ఛ ఉంది" అన్నాడు డాక్టరు.

"ఉంటుంది - ఉంటుంది" అంటూ త్రాళ్ళతో, చువ్వలతో కసితీర చావ బాదారు నలుగురు.

"చేతులు అలసిన తరువాత, రేపుదయం, నీలాటి రేవు కొచ్చే ఆడంగుల ముఖాలు చూచి ఇంటి కెల్దువు గాని" అంటూ చీకటిలో అతన్ని వదలి నలుగురూ పద్మాపురంవైపు కదలారు. అతను స్పృహతప్పిన విషయం వారు గమనించలేదు.

* * *




భోగిమంటలు వీధులలో మండుతున్న వేళ.

తెల్లవారుఝామున వేణు పిలుపు విని కరణంగారింటికి పరుగెత్తింది పొన్న.

మంచంమీద కమిలిపోయిన శరీరంతో పడి ఉన్నాడు డాక్టరుబాబు. అతన్ని చూడగానే ఆమె కళ్ళు తిరిగాయి. "డాక్టరుబాబూ !" అంటూ అతని కాళ్ళమీదపడి ఏడ్వసాగింది. చుట్టూ ఉన్న జనం గురించి ఆలోచించే పరిస్థితిలో లేదామె. కరణంగారి భార్య, పంతులుగారి కోడలు ఆమెను ప్రక్కకు తీసుకెళ్ళి "అతని కేమీ ఫరవాలేదు" అని శతవిధాల బోధపరచిన తరువాత దుఃఖాన్ని కొంత దిగమ్రింగుకొని గోడప్రక్కకు వెళ్ళి ఏడ్వసాగింది పొన్న.

వేణు డాక్టరుకోసం పట్నం పరుగెత్తాడు. పంతులుగారి తండ్రి దెబ్బలకు ఆకుపసర్లు పట్టించారు. డాక్టరుబాబు మూలుగుతున్నాడేగాని కళ్ళు తెరచి చూడలేదు. కుమిలిపోసాగింది పొన్న. కరణంగారు నెమ్మదిగా దగ్గర కెళ్లారు. "పొన్నా ! ఇదంతా ఎవరివల్ల వచ్చిందో తెలుసా ?" అడిగారు. ఆమె సమాధానాన్ని ఊహించేలోగా ఆయనే అన్నారు: "నీవల్లే !" అయోమయంగా చూచింది.

"నీవు అతనికి సమీపంగా వెళ్ళకుండా ఉంటే ఇంత జరిగేదికాదు పొన్నా. నిన్ను తప్పుగా అర్థంచేసుకొని నే ననటంలేదు. ఊరంతా చెవులు కొరుక్కుంటున్నా నీమీద నాకు నమ్మకముంది. నా కొడుకును రక్షించిన డాక్టరు దేవుడు. ఆయన ఎదుట నీవు

హారతివి. అతని మెడలో మాలికవు. వేణుకి ఆశ్రయం ఇచ్చిననాడే తెలుసుకున్నాను. డాక్టర్ని అర్థంచేసుకున్నది నీ వొకర్తివే. నే నతన్ని చాల ఆలస్యంగా తెలుసుకున్నాను. ఇక అతనికి ఏ లోపంరాదు. నే నతన్ని నా కన్నకొడుకులా చూసుకుంటాను. బాధపడకు." లాలనగా అన్నాడతను.

పొన్నకు దుఃఖం ఆగలేదు. పెరటిలో బంతిచెట్ల మధ్య బండరాతిమీద కూర్చుని కుమిలి కుమిలి ఏడ్వసాగింది.

పదిగంటలవేళ వీధిలో కారాగింది. వేణుతోపాటు డాక్టరు దిగాడు. మంచం మీదనున్న డాక్టరుబాబును చూస్తూ "ఇతను... ఇతను... శేఖర్ ... మా బంధువు !... శేఖర్ ! నీకేనా ఈ శిక్ష పడింది ? ...ప్రజాసేవ చేస్తానని వెళ్ళిపోయావన్నారే మీ ఊళ్ళో. నీవు ఇక్కడికా వచ్చింది ... " అంటూ బాధపడ్డాడు.

శేఖర్‌ను పరీక్షిస్తూనే అతనన్నాడు-

"ఇతను చాల మంచి కుర్రవాడు. ఇంత మంచివాడిని ఎవరు ఎందుకు ఇంతలా హింసించారో నాకు తెలియదు. కాని ఈ ఘోరాన్ని చేసినవారు ఎవరైనా తెలుసుకుని తీర్తాను. వాళ్లు మాత్రం శిక్షను తప్పించుకోలేరు" అన్నాడతను, పెదవులు బిగబట్టి శేఖర్ జబ్బమీద ఇంజక్షన్ ఇస్తూ.

"శిక్షను తప్పుచేసినవా రేనాడూ తప్పించుకోలేరు డాక్టరుగారూ. నేరస్థుని పట్టి ఒప్పగిస్తాం. మా డాక్టర్ని బ్రతికించి మాకు ఒప్పచెప్పండి" అన్నాడు కరణం.

కొద్దిసేపు మౌనంగా ఉండి అన్నాడతను-

"ఇతన్ని నేను నాతో తీసుకెళ్తున్నాను. ఇతను తేరుకున్న తరువాత ఇతన్ని ఇంటికి పంపిస్తాను. ఇతను మరి ఇక్కడకు రాడు. నేను రానివ్వను."

కరణంగారికి మాటలు రాలేదు. పొన్న డాక్టరుకు దగ్గరగా వచ్చి నిలుచుంది. ఆమెను డాక్టరు కెలా పరిచయం చెయ్యాలో అతనికి తెలియ లేదు. డాక్టరు కూడా ఆమెను గమనించ లేదు.

"డాక్టరుగారూ ! మీరు మీ ఇష్టం వచ్చినట్టు చెయ్యండి, కాని ఒక ప్రార్థన. ఇక్కడినుండి తీసుకెళ్ళేలోగా ఒక్కసారి కళ్లుతెరచి చూస్తే మా కందరికీ తృప్తి. చూడండి, ఎంతమంది అతన్ని చూడాలని తహతహ లాడుతున్నారో. వీళ్ళందరికీ సేవచేసిన డాక్టరు ఏమైపోతాడో అని వారి బాధ," అన్నారు కరణంగారు అందర్నీ చూస్తూ.

"నా ప్రయత్నం నేను చేస్తున్నాను. ఈ లోపుగా ఎవరినైనా పంపి అతని సామాను తెప్పించండి. నా కారును తీసుకెళ్ళమనండి" అన్నాడు డాక్టరు.

వేణు ముందుకి పరుగెత్తాడు. డాక్టరు మరో ఇంజక్షన్ ఇచ్చాడు.

కారు రాకకు కొద్దిగా ముందుగా శేఖర్ తల, చేతులు కదల్చాడు. అతని పెదవులు కదిలాయి. "పొన్నా! డాక్టరుబాబు మాటాడుతున్నాడు, రా పొన్నా, రా!" కేకవేసి పిలిచారు కరణంగారు. పొన్న పేరు విని కాబోలు శేఖర్ కళ్లెత్తి చూశాడు. పొన్న అతని ముందుకు పరుగెత్తుకుని వెళ్ళి మంచంప్రక్కన కూలబడి రెండు చేతులు జోడించి "డాక్టరుబాబూ!" అంది కన్నీరు నిండిన కళ్లతో అతన్ని చూస్తూ.

అతను పొన్నను చూచి,

"వెళ్ళి ... పొమ్మన్నావుగా ... పొన్నా! ... వెళ్ళి ... పోతు ... న్నానులే! ..." అంటూ చేతిని బహుశా ఆమె కన్నీరు తుడవటంకోసం కాబోలు ఎత్తి మరి పైకి ఎత్తలేక వదిలేశాడు. చేయి జారిపోయింది. తల ప్రక్కకు తిప్పుకున్నాడు. కనులు మూతపడ్డాయి. వేణు వచ్చాడు. మూలుగుతున్న శేఖర్‌ని కారులో పడుకో పెట్టారు.

కారు కదలబోతూంటే "వెళ్ళి పోకండి డాక్టరుబాబూ! ... ఇలా వెళ్ళి పోకండి, తిరిగి రండి డాక్టరుబాబూ, తిరిగి రండి" అంటూ ముందుకు పరుగెత్తింది పొన్న. ఆమెను పంతులుగారి తల్లి, కోడలు పట్టుకున్నారు. కారు ముందుకు కదిలింది. పొన్న వారి పట్టును తప్పించుకుని ముందుకు పరుగెత్తింది." "డాక్టరుబాబును బ్రతికించమనిచెప్పండి" అంటూ ఆమెను అడ్డుకున్నవారందరికి చెప్పుకుని వారి పట్టువదలించుకుని ముందుకు పోబోయింది. ఆమె నెవరూ ఆప లేకపోయారు. కారుఎంతదూరం పరుగెత్తి నదీ ఆమెకు తెలియదు. కాని అతని ఆరోగ్యం ఏమవుతుందో అన్న ఆవేదన అత నెక్కడికి వెళ్తున్నాడో తెలుసు కోవాలన్న చింత ఆమెలో ఉన్న సంగతి ఎవరికీ తెలియదు. ఏదో ఒక భ్రాంతి, ఒక ఆశ ఆమెను నడిపించాయి. నల్లని కారు నందుకోవాలన్న ఆశతో ఆమె మెరుపులా పరుగెత్తింది.

దారిప్రక్కన ఎండలో మండుతున్న కర్రదుంగల మంటలు స్పష్టంగా ఎవరికీ కనపడటంలేదు.

కాకులు ఆమెను చూస్తూ ఉండి పోయాయి.

ఆమె రోడ్డును వదలి చేలకు అడ్డంగా నేల బావులను తప్పించుకుంటూ పరుగెత్తింది. చేను మధ్యలో కుడి అరి కాలిలో ఏదో బలంగా దిగింది. బాధ గుండెలో కలుక్కుమంది. ఎండ నెత్తిన మొత్తింది రక్తం తడిసిన ఆ చోట ఆమె నిలువలేకపోయింది, కళ్లు తిరిగాయి, ఆమె స్పృహతప్పి అక్కడే పడిపోయింది.

కారు మలుపు తిరిగింది.

---




## 12

"ఏమిటయ్యా? బెల్లంకొట్టిన రాళ్ళలా ఎవ్వరూ మాట్లాడరేం? నా మేనకోడళ్ళు ఏమయిపోయారు? వాళ్ళని ఏంచేసారు మీరు? మేము ఎరగం అంటే అయిపోతుందా? వాళ్ళు యిక్కడ లేరు అంటున్నారు మా ఊరు రాలేదు పిల్లలు కనిపించక నెలరోజులు అవుతుంటే, మీరు మాటమాత్రం నాకు తెలియచేసారా? కనీసం కార్డుముక్కయినా రాసారా? మీ రసలు మనుష్యులేనా?" పుండరీకాక్షయ్య నిప్పులు కురిపిస్తూ అరుస్తున్న అరుపులు ఆ యిల్లంతా ప్రతిధ్వనిస్తున్నాయి

చలపతిరావుగారు మంచంలో దిళ్ళకి ఆనుకుని కూర్చున్నాడు తండ్రి మంచం ప్రక్కన భవానీప్రసాద్ నిలబడి వున్నాడు కవిత, కల్పన అక్కడే వున్నారు శారద కూడా అక్కడే వుంది వేణుగోపాల్ కిటికీరెక్కకి ఆనుకుని నిలబడి, మధ్య మధ్యలో, కల్పనవైపు గూఢార్థంగా చూస్తున్నాడు

ఉదయం బండికి, ఉత్తరంపత్తరం లేకుండా, అరటిపళ్ళగెల, బందరు

లడ్డూలు, హల్వా పొట్లాలు పెట్టిన తాటాకుబుట్ట పట్టుకుని, పుండరీకాక్షయ్య ఆటో దిగి యింట్లోకి వస్తూ "పెద్ద పాపా, చిన్నపాపా" అని పిలుస్తుంటే, ఆయన్ని చూడగానే అందరూ ప్రాణాలు పైకి ఎగిరిపోయినట్టు అయారు

శారదకి ఆయనెవరో తెలియక పోయినా, ఆ పల్లెటూరి వాలకం, చనువుగా వున్న ఆ పిలుపూ చూసి, పిల్లల మేనమామ అయివుంటాడని ఊహించింది

కవిత తెలివిగా ఆయనని తాతగారి దగ్గరకి తీసుకువెళ్ళి కూర్చోపెట్టింది

కొద్దిసేపు ఆయన చలపతిరావు ఆరోగ్య పరామర్శ ధోరణిలోపడి, పిల్లల్ని మళ్ళీ పిలవలేదు

కవిత లోపలికి వచ్చింది

కల్పన షాంపూచేసుకున్న జుట్టు ఆరబెట్టుకుంటోంది

"కల్పనా ! మనం అనుకున్నంతా అయింది ఇప్పుడేం చేయటమే ? ఆయన సరాసరి రానే వచ్చాడు," అంది ఆదుర్దాగా

"వస్తే రానీ ! వచ్చిన దోవనే మళ్ళీ తిన్నగా తిరిగిపోతాడు నువ్వేం భయ పడకు నేను మాట్లాడతాను" అంది

ఇద్దరూ తాతగారిదగ్గరికి వచ్చారు

కవిత, కల్పనలని చూసి ఆయన "అబ్బ ! చిట్టికాయలుగా వున్నప్పుడు చూసాను చాలా పెద్దవాళ్ళయి పోయారే ! చిన్నమ్మాయే పెద్దమ్మాయి లాగుంది" అన్నాడు

"ఏం చదువుకుంటున్నారు ?" అని అడిగిన ఆయన ప్రశ్నకి చలపతిరావు సమాధానం చెప్పాడు

ఇంతలో వేణుగోపాల్ ఏదో పని మీద అక్కడికి వచ్చాడు

"ఈ అబ్బాయి ఎవరూ ?" అని ఆరా తీసాడు

"వేణు అని మా అమ్మాయి సెక్రటరీ" అన్నారాయన

"అలాగా ! నేనింకా అల్లుడేమో అనుకుంటున్నా ఏమిటో ! యీ పట్నంలో ఆడపిల్లలకి ఎంత వయసు వచ్చినా ఎందుకు పెళ్ళిచేయలేదని ఎవ్వరూ అడగనే అడగరు అమ్మాయి లను చూస్తే పిల్లతల్లో, చదువుకుంటున్న పిల్లో తేడా కాస్తకూడా తెలియదు మొన్న బెజవాడలో మా బావమరిదికి ఓ పిల్ల బాగుందంటే చూడటానికి వెళ్ళా తీరా అడిగితే, ఆ పిల్లకి పెళ్ళి అయి యిద్దరు పిల్లలుట ! ఓర్ని అనుకున్నా—" అంటూ ఆయన నవ్వ సాగాడు

చలపతిరావుగారు నవ్వు రాకపోయినా నవ్వారు

ఆయన బుంగమీసాలు, లావు

శరీరం, బొంగురుగా వున్న గొంతు, నవ్వుతుంటే కదులుతున్న పొట్ట, యివన్నీ కల్పన ఒక విచిత్రమైన వస్తువుని చూసినట్టు ఎగా దిగా చూస్తోంది

ఆయన కూడా కల్పనని అలాగే చూస్తూ, "అవునూ, ఈ యిద్దరిలో ప్రసాద్‌కి కాబోయే భార్య ఎవరూ !" అని అడిగాడు

కవిత ముఖం చిట్లించింది

కల్పన కోపం చూపుల్లోనే అదిమి పెట్టింది

ఆయన కుర్చీపక్కన పెట్టిన తాటాకు బుట్టలోకి చెయిపోనిచ్చి పొట్లం తీసి కల్పన చేతికిస్తూ, "బందరు హల్వా, తీసుకో" అన్నాడు

"నాకు సయించదు," అంది కల్పన

"సయించదా! ఎప్పుడన్నా తిన్నావా అసలు తిని చూడు ఒకసారి తిన్నా వంటే కొట్టైక్కడ అంటూ పరుగెత్తు తావు తీసుకో, తీసుకో," అంటూ బలవంతంచేస్తూ పొట్లం అందించాడు

"నాకు సయించదు దాన్ని చూ స్తేనే అసహ్యం "

"అసహ్యమా! ఆ! ఆదీ! అందుకే అట్లా చెక్కబొమ్మలా వున్నావు నాతో రా మా ఊరు తీసుకువెళతా ! పాలు, నెయ్యి పట్టించావంటే రబ్బరుబొమ్మలా అవుతావు ఏరి యీ పిల్లలు ? పెద్ద పాపా "

ఆయన పొలాల్లో కేకపెట్టినట్టు అరిచాడు ఎక్కడా సమాధానం వినిపించలేదు

"పిల్లలు లేరా యింట్లో" అని అడిగాడు

"ఏ పిల్లలు ?" ఎలాటి తొట్రుపాటులేకుండా అడిగింది కల్పన

"ఏ పిల్లలా ! నీ మామ కూతుళ్ళు. రేపు నువ్వే మీ మామయ్యని చేసుకుంటే నీ సవితి కూతుళ్ళు "

కల్పన ముఖం ఎర్రబడింది దురుసుగా ఏదో సమాధానం చెప్పబోయి తమాయించుకుంది

"కల్పనా! ఈయన పిల్లల గురించి అడుగుతున్నాడు " చలపతిరావుగారు నిస్సహాయంగా చూసాడు

"ఏ పిల్లలు తాతయ్యా? మనకేం తెలుసు ?"

పుండరీకాక్షయ్య ముఖం జేవురించింది చేతిలో హల్వా పొట్లాం బుట్టలో పెట్టేసాడు

"ఇదుగో, పిల్లోయ్ ! నా పేరేమిటో తెలుసా ? నా గురించి మీ అమ్మ నీ కెప్పుడూ చెప్పలేదా ?"

"చెప్పకేం, బాగానే చెప్పింది ! మిమ్మల్ని చూడకపోయినా, మా అత్తయ్యని ఎరగకపోయినా, మాకు అంతా తెలుసు "

"ఏమిటీ! చాలా వుందే వ్యవహారం. సరే ! నువ్వు అనసూయమ్మ కూతు

రుని ! నీతో మాట్లాడలేను గాని, నీతో నా కెందుకు ! ఆ పిల్లల్ని యిట్లా పిలు "

"మాకు ఏ పిల్లల గురించీ తెలియదు "

ఆయన కల్పనవైపునుంచి చలపతి రావుగారివైపు తిరిగాడు

"చలపతిరావుగారూ ! పిల్లల్ని పిలి పించండి "

"కల్పన చెప్పింది నిజమే, పుండరీ కాక్షం పిల్లల గురించి మాకేం తెలియదు "

"తెలియదా ?" ఆయన క్షణంసేపు నోట మాట రానట్టు అయాడు

"పిల్లల్ని వెంకటస్వామి తీసుకు వచ్చి దించాడుగా "

"అని మీతో చెప్పాడు కాబోలు ! మా కెవరికీ అప్పచెప్పలేదు" అంది కల్పన.

ఆయన కుర్చీలోనుంచి లేచాడు అంతవరకూ నవ్వుతున్న ఆ ముఖంలో క్రోధఛాయలు తొంగిచూసినాయి.

"ఇదుగో ! ఈ నాటకం నా దగ్గర కాదు పిల్లల్ని యిక్కడ దించి వచ్చా నని వెంకటస్వామి చెప్పాడు వాడు అబద్ధంచెప్పే మనిషికాదు మర్యాదగా చెప్పండి. ఏమయ్యారు వాళ్ళు ? ఎక్క-డికి పంపించారు ?"

"మా కసలు తెలియదంటుంటే "

"తెలియదా ! తెలియకపోతే, నేను ఉత్తరం వ్రాయగానే నా కెందుకు జవాబు వ్రాయలేదు "

ఏదీ, మీ యింట్లో వంటచేసే పిల్ల ఎవరో వుందిట ? ఆ అమ్మాయికి అప్ప చెప్పి వచ్చానని చెప్పాడు ఆ పిల్లని యిలా పిలు "

కల్పన రయ్యిన వంటయింటివైపు వచ్చింది

"శారదా ! నీకేం తెలియదని చెప్పు "

కంఠం తగ్గించి ఆజ్ఞాపించింది

ఈ కేకలు విని భవానీప్రసాద్ కూడా అక్క-డికి వచ్చాడు

అతను పుండరీకాక్షయ్యని చూడ గానే ఖంగుతిన్నట్లుగా అయాడు !

మనిషిలో ఒక్క-సారిగా చాలా తొట్రుపాటు కనిపించింది

శారద చేస్తున్నపని మధ్యలో వది లేసి, చేతులు తుడుచుకుంటూ వచ్చింది.

"ఈ అమ్మాయి శారద కావలిస్తే అడగండి " అంది కల్పన ధీమాగా

"ఏమ్మా ! పిల్లలు యిక్క-డికి రాలేదా నువ్వు వాళ్ళని చూడలేదా ?" కొట్టినంత తీవ్రంగా అడిగాడాయన

శారద వెంటనే మాట్లాడలేదు

కల్పన, కవిత, భవానీప్రసాద్, వేణుగోపాల్, చలపతిరావు అందరూ శారదవైపే చూస్తున్నారు

శారద నోటి వెంట రాబోయే మాట

మీదనే అంతా ఆధారపడి వున్నట్టుగా వుంది.

"చెప్పమ్మా, వచ్చారా లేదా ?" ఆయన నిగ్గదీసాడు.

"వచ్చారండీ." అంది శారద.

చలపతిరావు ముఖం వెలతెలా పోయింది !

కల్పన కళ్ళలో కోపం, కసి కస్సు మన్నాయి.

కవిత ఖంగారుగా చూస్తోంది.

వేణుగోపాల్ తమాషా చూస్తున్నట్టు కుతూహలంగా అయాడు.

పుండరీకాక్షయ్య బెబ్బులిలాఅయాడు.

"చూసావా ! రాలేదని నన్ను దగా యిస్తున్నారు. అసలు యింతకీ పిల్లలు ఎక్కడ ? నేను ఊళ్ళో లేకపోవటంతో, నా భార్య చేసినపని అమ్మా యిది. వీళ్ళకి కష్టంగా వుంటే నా వెంట తీసుకు పోతాను. మా అమ్మ చచ్చిపోయినా, నేను బ్రతికేవున్నాను." అంటూ గుండెలు చరుచుకున్నాడు.

ఇక లాభంలేదనుకున్న చలపతి రావుగారు జరిగిందంతా చెప్పేసాడు. నెపం తమమీద వుంచుకోకుండా పిల్లల మీదకి తోసేస్తూ "ఆ పిల్లలు వుండ కుండా పారిపోయారు. మేమేం చెయ్యం చెప్పు. మీ ఊరు వచ్చేసారని అనుకున్నాం."

"అనుకున్నారా! మీరు మనుష్యులేనా? నా కసలు ఎందుకు తెలియచేయలేదు?" పుండరీకాక్షయ్య విరుచుకుపడ్డాడు.

ఆయనకి కోపంవస్తే మనిషికాదని అనసూయమ్మగారు చెప్పినమాట అక్ష రాలా నిజం అని ఆ క్షణంలో కవితకి, కల్పనకి తెలిసిపోయింది.

"పిల్లల్ని మీరే చంపేసి వుంటారు ! గొంతు పిసికి ఏ గోతిలోనో పాతి పెట్టించి వుంటారు ! ఆ రోజున నా చెల్లెల్ని అలాగే చేసారు. ఆ రోజే మీ అంతు తేలుస్తానంటే మా అమ్మ నన్ను మాట్లాడనీయకుండా చేసింది. ఈ రోజు మా అమ్మ లేదు. దానికీ, దీనికీ కలిసి వడ్డీతోసహా శాస్తి చేస్తాను. నేను యిప్పుడే పోలీసుల దగ్గరకి వెళ్తున్నా. రిపోర్టు యిస్తున్నాను. మీ సంగతేమిటో వాళ్ళే తేలుస్తారు." అరుస్తూనే అంగ లేసుకుంటూ బయలుదేరాడు.

"కల్పనా, వేణూ, శారదా,ఆయన్ని ఆపండి. వెళ్ళనీయకండి." చలపతిరావు మొత్తుకుంటున్నట్టుగా అన్నాడు.

"వేణుగోపాల్ గభాల్న ఆయన వెంట వెళ్ళాడు."

"మీరలా తొందరపడితే ఎలా ? ఒక్క నిముషం కూర్చోండి," అంటూ ఆయనకి సర్దిచెబుతూ బ్రతిమిలాడాడు.

భవానీప్రసాద్ తండ్రి మంచందగ్గర నుంచి రొప్పుతున్నట్టు ఊపిరి పీలుస్తూ, తడబడుతున్న అడుగులలో తన గది లోకి వచ్చాడు. అతని చేతులు వణుకు

తున్నాయి. పెదవులు కంపిస్తున్నాయి. అల్మారా తలుపు తెరిచి, మందుసీసా తీసి రెండుమాత్రలు ఒకేసారి నోట్లో వేసుకుని మింగేసాడు !

"ఆ రోజున నా చెల్లెల్ని కూడా అలాగే చేసారు."

పుండరీకాక్షయ్య కంఠం వేయి కంఠాలుగా మారి అరుస్తోంది !

అతని నరాలు చిట్లిపోతాయేమో నన్నంత బాధగా వుంది !

రెండుచేతులతో కణతలు నొక్కి-పట్టాడు. అతనికి ఏడుపు వస్తోంది ! ఆపుకోవటానికి విశ్వప్రయత్నం చేస్తున్నాడు !

దేనికో యీడ్చి కొట్టాలి ! అతని చేతులు గుప్పిళ్ళుగా, ఆవేశంగా మారి పోతున్నాయి !

దేనినో నలిపి వేయాలి! ఈ బాధ కన్నా, యీ నరకయాతనకన్నా, హత్యచేయటం ! అదే హాయి ! అదే చేయాలి ! చేయాలి అనుకోవటంకాదు ! చేసెయ్యాలి ! అతను టేబిల్‌మీద గుప్పెట బిగించి కొట్టాడు !

అతని కళ్ళమీదకి మత్తులాటిది రాసాగింది. చెవులనిండా గోలగా, ఏవో మాటలు, ఏడుపులు, తిట్లు, శాపనార్థాలు. నువ్వు చేతకాని వెధవ్వి! వెక్కి-రింతలు ! అతను వుక్కి-రిబిక్కి-రి అవుతున్నాడు ! కానీ అది ఎంత సేపో నిలబడలేదు. కన్నతల్లి స్పర్శలా అతనికి నిద్ర వచ్చేసింది ! ఘర్షణకి గురిఅయిన అతని మనసు సొమ్మసిల్లి నట్టుగా అయిపోయింది ! అతని తల టేబిల్ మీదకి వాలిపోయింది.

చాలా సేపయిం తర్వాత, అతనికి మెలకువ వచ్చింది ! ఎన్నో లంకణాలు చేసినంత నీరసంగా వుంది !

"ఇదుగో, కాఫీ." శారద గొంతు వినిపించింది. అతను, నిద్రలోనుంచి యింకా విడిపోని అయోమయంలో నుంచి బయటపడటానికి ప్రయత్నిస్తు న్నట్టుగా చూసాడు.

"కాఫీ తీసుకోండి. వేడిగా వుంది. చల్లారకముందే తాగండి." శారద కంఠం స్నేహపూరితంగా, అంతకు ముందు వచ్చిననిద్రలా, ఆత్మీయంగా వుంది !

అతను కాఫీ తాగాడు ! ఆ వేడి కాఫీ అతని అలసిన శరీరానికి కాస్త ప్రాణం తెచ్చింది.

"ఆయన వెళ్ళిపోయాడా?" క్రిందకి చూస్తూ అడిగ డు.

"ఉహుం ! వున్నారు."

భవానీప్రసాద్ వులికిపాటుగా చూసాడు

"భోజనం చేస్తున్నారు. యిప్పుడే పిల్లలు వచ్చారు. వాళ్ళతో మాట్లాడు తున్నాడు."

"పిల్లలా !" అతను ఆశ్చర్యంగా చూసాడు.

"వాళ్ళు దొరికారా?ఎక్కడున్నారు?"

శారద నిట్టూర్చింది ! ఆ రోజున తాను చేసినపని చెప్పింది.

అతను చకితుడైనట్టుగా చూసాడు ! ఆ చూపులు క్రమంగా సంభ్రమంగా, కృతజ్ఞతగా ప్రశంసాపూర్వకంగా మారినాయి.

"నాకు చెప్పనేలేదేం?" అన్నాడు అస్పష్టంగా.

"మీ రెవ్వరూ అడగలేదు. ఆ పిల్లలు ఆ ఊరు వెళ్ళటానికి భయపడుతున్నారు. బలవంతంగా పంపేస్తే, ఏ అఘాయిత్యం చేస్తారోనని ఆ పని చేసాను."

అతను నిట్టూర్చాడు.

శారద కాఫీ కప్పు తీసుకుంది. వెళ్ళిపోతూ ఆగి అంది.

"ఆ పిల్లల్ని ఆయన తీసుకువెళతానంటున్నాడు ! పెద్దపాపేమో న రహస్యంగా, 'ఆ ఊరు వెళ్ళం శార హాస్టల్లోనే వుంటాం,' అంటుంది. ఆయ చెప్పినా వినటంలేదు," అంది.

అతను విని వూరుకున్నాడు.

శారద క్షణంసేపు తటప యించింది.

మళ్ళీ ధైర్యం తెచ్చుకున్నట్టుగా-

"ఆ పిల్లలు ఎంత దురద వంతులు ! మీరు వుండికూడా ఎవ లేని అనాధలు అయారు ! ఏమిా ఒక్కొక్కళ్ళ జాతకం !" అ వెళ్ళిపోయింది !

ఆ కంఠంలో ఎత్తిపొడుపుకం సానుభూతి ఎక్కువగా వుండటం అతనికి ఆ మాటలు కోపం తెప్పి లేదు.

ప్రసాద్ చాలాసేపు ఆలోచన మునిగిపోయినట్టుగా, అరచేతులు చూ కుంటూ కూర్చున్నాడు.

(సశేషం)



వేములపల్లి స్వర్ణ

# అమూల్య



ఆ బొమ్మ నన్నెంతగా ఆకర్షించిందంటే, ఆ గది వదిలి నేను బయటికి వెళ్ళలేకపోయాను చాలాసేపటి వరకూ. నిలువెత్తు తైలవర్ణ చిత్రం. జోడించిన చేతుల పసిమిఛాయ, ఎడమ చేతి చిటికెనవేలికున్న చిన్న ముత్యపు ఉంగరం, చూస్తున్నకొద్దీ చూడాలనిపిస్తున్నాయి. నిండుగా చీరకట్టుకుని భారతీయ సంస్కృతిని ప్రతిబింబిస్తూ ముగ్ధలా నిల్చున్న పాతికేళ్ళ అమ్మాయి బొమ్మ అది. ఆ కళ్ళూ, వాటిలోని మెరుపూ, చూపరులను కదలనివ్వవు. ఆ మొహంలోని జీవకళా, ఆ బుగ్గల్లో లాలిత్యం, ఆ పెదాల ఎరుపూ ... నా జీవితంలో అలాంటి అమ్మాయిని చూసి ఎరగను. క్రమంగా నా ఉనికి ఆవిరిగా మారి, ఆ పటంలోకి నేను కూడా ఇమిడిపోతున్న భావం కలిగింది నాకు. ప్రాణం పోసుకుని ఆ అమ్మాయి గోడ దిగివచ్చి నా ముందు నిల్చున్న అనుభూతి. ఇంకా దగ్గరకు వెళ్ళి చూశాను. ఓ మూల కనపడీ కనపడకుండా రాసి ఉంది 'ప్రసాద్' అని. ఇంకో మూల 'అమూల్య' అని. 'అమూల్య !' ఎంత

చక్కని పేరు  మనసులో పదే పదే అనుకున్నాను ఎవరీ ప్రసాద్! అప్పటి వరకూ రవివర్మ తప్ప ఇంకొకరు ఆ బొమ్మ వేయగలరని ఊహించని నాకు చెప్పలేనంత ఆశ్చర్యం కలిగింది

ఉలిక్కిపడ్డాను, మా బాస్ షిండే అరుపు విని

"వాట్ ది హెల్ ఆర్ యూ డూయింగ్ హియర్ నీకేం చెప్పాను నేను ?"

"అంతా వెతికాం సార్ ! ఎక్కడా ఏమీ కనిపించలేదు" వినయంగా సమాధాన మిచ్చాను

"కిచెన్‌లో చూశారా ?"

"బాత్‌రూమ్స్ కూడా వదల్లేదు సార్ ! కాంపౌండ్‌లో ప్రతి అంగుళం తవ్వి చూశాం "

"ఇంపాసిబుల్ ! మన కొచ్చిన ఇన్ఫర్మేషన్ ఫాల్స్ కావటానికి వీల్లేదు " గొణిగాడు షిండే అప్పటివరకూ ఆయన వెనకే ఉన్న బట్టతల ముసలాయన, ముందుకు వచ్చాడు ఆయన మొహం చూస్తే ఎవరికైనా గౌరవభావం కలుగుతుంది కానీ మా బాస్‌కు కలిగినట్టు లేదు

"ఎక్స్‌క్యూజ్ మీ సర్ ! ప్రభుత్వం మీకిచ్చిన అధికారాన్ని ప్రశ్నించే హక్కు నాకు లేకపోవచ్చు మీకొచ్చిన కంప్లైంట్లను ఆధారం చేసుకుని మీ వాళ్లు మా ఫర్నిచర్, శానిటరీవేర్, ఒకటేమిటి, ఖరీదైన ప్రతి వస్తువూ నాశనం చేశారు నేనిప్పుడు కాంపెన్సేషన్ల గురించి ఆలోచించడంలేదు ఎందుకంటే ఈ ఇల్లు నా ప్రాణంతో సమానం అది కాస్తా ధూళిలో కలిసిపోయాక నష్టపరిహారాల ప్రసక్తేలేదు కానీ నా నిజాయితీమీద మీకు నమ్మకం లేనప్పుడు, దాన్ని తొలగించడానికి నేను దేనికీ వెనుకాడను అభిమానంకన్నా, ప్రాణం ముఖ్యం కాదు నాకు "

అసహనంగా చూశాడు షిండే బ్లాక్ మనీ బయటికి తియ్యడంలో అందెవేసిన పెద్ద చెయ్యి. వెళ్ళిన ప్రతిచోటా పది లక్షలైనా పట్టుకోకుండా వదలడని ప్రతీతి ఈ ఇంట్లో ఏమీ దొరక్కపోవటం ఆయనకు తల తీసేసినట్లుంది అయినా అంత తేలిగ్గా ఓటమిని అంగీకరించే వ్యక్తి కాదతను

"నన్ను నమ్మండి" అన్నట్టు చూశాడా ముసలాయన

'పోనీ నమ్మేదామా' అన్నట్టుగా చూశాను నేను మా బాస్‌వైపు

'మీరుకాదు, మీ బాబులు దిగి వచ్చినా వాళ్లను కూడా నమ్మను' అన్నట్టు మా ఇద్దరివైపు చూశాడు షిండే

స్మశానంలో రాబందుల్లా తిరిగేస్తున్నారు మా వాళ్ళు కాఫీ సిప్‌చేస్తూ అన్నాడు ఆయన

"మిస్టర్ షిండే, నా సంగతి తెలిసిన

వారూ, నా గురించి చెప్పగలిగినవారూ ప్రస్తుతం ఈ లోకంలో ఎవ్వరూ లేరు, నేను తప్ప."

నాకు ఆయన వాలకం విచిత్రంగా ఉంది. లక్షల ఖరీదుచేసే ఆ రాజభవనం లాంటి ఇంటిని మా వాళ్లు సర్వనాశనం చేస్తున్నా ఆయన ప్రశాంతంగానే ఉన్నాడు. మా వృత్తిధర్మం నిర్వర్తిం చేప్పుడు కాళ్లపట్టుకునే కోటీశ్వరుల దగ్గర్నుండీ, ప్రాణం తీస్తామని బెదిరించే లక్షాధికారులవరకూ ఎంతోమందిని చూశాను నేను. కానీ ఈయన అందుకు భిన్నంగా ఉన్నాడు. తను కూడా మాతోపాటు రైడ్‌కు వచ్చిన పెద్ద మనిషిలా, నిమ్మకు నీరెత్తినట్టు కూర్చున్నాడు.

"చిన్నప్పట్నుంచీ, నాతోపాటు పెరుగుతూ వచ్చిన కోరిక ఒక్కటే. ఎవరూ ఊహించని, ఇంతకుముందు ఎవరూ నిర్మించని, ఓ మహత్తర కళా ఖండంగా మిగిలిపోయే, అపురూపమైన భవంతి ఒకటి కట్టుకోవాలని, ఎండా వానలనుండి మమ్మల్ని కాపాడలేక పోయిన మా పూరిపాక నా కోరికలకు పునాది. నాకు ఇరవై ఏళ్లొచ్చేసరికి అది ఆల్‌మోస్ట్ నా జీవితాశయం అయి పోయింది. కానీ లక్ష్యంకన్నా మార్గం ముఖ్యం నాకు. విధం చెడ్డ ఫలం నాకక్కర్లేదు. నేను కట్టుకోబోయే ఇంటి విషయంలో కొన్ని నిర్దిష్టమైన నిర్ణ యాలు తీసుకున్నాను. ఎంత అందమైన దైనా పవిత్రతలేని ఇల్లు ప్రత్యక్ష నరకంతో సమానం. నేను కట్టబోయే ఇంట్లో ప్రతి ఇటుకముక్కా, ఇసుక రేణువూ, నా కష్టంలోనుండి ఖరీదు కట్టుకోవాలి. నా శ్రమ, నా చెమటకు న్యాయంగా లభించే విలువతోనే ఆ భవంతిని నిర్మించుకుంటాను. ఆ కట్ట డంలో అన్యాయాలకు బలైపోయిన అమాయకుల ఆక్రందనలూ, మోసాలకు గురైపోయిన మోడుబ్రతుకుల ఘోషా, వినిపించకూడదు. నేను న్యాయంగా, ధర్మంగా సంపాదించే ప్రతిపైసా ఆ ఇంటిమీద ఖర్చుపెడతాను. ఒకరిని మోసంచేసి సంపాదించిన డబ్బు దాని మీద వెచ్చించి దాన్ని మలినం చెయ్యలేను.

ఈ ఆశయంతో నా కెరీర్ ప్రారంభ మైంది. నాకు ఊహ తెలిసేప్పటికే నా వారెవరూ మిగల్లేదు. లోకజ్ఞానం సంపా దించిన తర్వాత, ఒంటరిగా ఉండటమే ఉత్తమం అనుకున్నాను. ఏకాంతంలో ఎన్నో ఏళ్ళు, కేవలం నా కోరికతో మాత్రమే స్నేహంచేస్తూ సంవత్సరాలు గడిపాను" గుక్కతిప్పుకోవటానికి ఆగా డాయన.

పరిశీలనగా చూశాను ఆయన్ని. అప్పటివరకూ ఉన్న గౌరవభావం క్రమంగా నాలో తగ్గిపోతూ వచ్చింది. ఒక స్నేహితుడూ, సన్నిహితుడూ లేని

జీవితానికి అర్థం ఏమిటి! నీ చుట్టూ నువ్వు గిరిగీసుకుని ఇంకొకర్ని లోపలికి రానివ్వకపోవడం, నీ స్వార్థానికీ, సంకుచిత మనస్తత్వానికీ, అహంకారానికీ నిదర్శనం. అందుకే సాటి మనుషులకు దూరంగా, ఏకాంత ద్వీపాల్లో నివసించే ఇలాంటి ఒంటరి పక్షుల్ని నే నిష్టపడను

"నా వయసు మూడు పదులు నిండినప్పుడు మూడు వందల్తో చిన్న వ్యాపారం మొదలెట్టాను క్రమేపీ అది పెరుగుతూ వచ్చింది దాదాపు పదిహేను సంవత్సరాలపాటు నేను నా ప్రాణం, ధ్యానం అన్నీ దానిమీదే కేంద్రీకరించాను మధ్యలో ఏర్పడిన ఎన్నో అవాంతరాలను ఒంటరిగా ఎదుర్కొన్నాను లక్ష్యంమీద చూపుంచిన వాడికి మిగతా వేవీ కనిపించవు అందుకే, వ్యామోహాలూ, వ్యసనాలూ, దర్జాలూ, భోగాలూ నా దగ్గరకైనా రాలేకపోయాయి

జీవితంలో ఒక దశ అలా నిస్సారంగా గడిచిపోయింది అందుకు నే నెప్పుడూ పశ్చాత్తాప పడలేదు నే ననుకున్నంత డబ్బు సంపాదించిన తర్వాత, స్థలం కొన్నాను నేనే స్వయంగా ప్లాన్ వేసుకున్నాను రెండు సంవత్సరాలపాటు కూలీలలో ఒకడినై వాళ్ళ కష్టాన్ని నేనుకూడా అనుభవిస్తూ, ఈ ఇల్లు కట్టుకోగలిగాను. నా అభిరుచులకు అనుగుణంగా, ఎన్నాళ్ళగానో కంటున్న కలలతో ఎంతమాత్రం రాజీకి రాకుండా నా ఊహలకు వాస్తవరూపం ఇచ్చుకోగలిగాను మీరు అడుగుపెట్టే సరికి ఈ ఇల్లు ఎలా ఉందో మీకు తెలుసు ఇప్పు డెలా మారిపోయిందో మీరు చూస్తూనే ఉన్నారు" ఒక్క నిమిషం విశ్రాంతి తీసుకున్నా రాయన

నిజమే కేవలం ఒక్క మనిషికి రెండంతస్తులూ, పది గదులూ, ఎకరాల కొద్దీ పూలతోటా, ముట్టుకుంటే మాసిపోయేట్టున్న గోడలూ, అద్దాలు లేకపోయినా ఇబ్బంది పడనక్కర్లేనంత శుభ్రంగా ఉన్న పాలరాతి ఫ్లోరింగ్, మహారాజుల వైభవాన్ని గుర్తుకు తెచ్చే గాజు షాండిలీర్స్, పట్టుమీద నడుస్తున్న అనుభవాన్నిచ్చే తివాసీలూ, కూర్చోగానే తమలోకి లాక్కునే మెత్తని సోఫాలూ, గాలి ఎక్కణ్ణుంచి మోసుకొస్తుందో తెలీని వింత పరిమళాలూ, దాదాపు అన్నీ కేవలం ఆ ఒక్క రేపో మాపో రాలిపోయే వ్యక్తికే అంకితం అన్న ఈర్ష్య మినహాయిస్తే, నా కా ఇల్లు ఎంతో బాగుంది

బొంబేలో ఓ పెద్ద బట్టలమిల్లు యజమాని ఆయన ఇతరత్రా పార్ట్‌నర్స్ ఎవరూ లేరు ఒంటరిగాడు పెళ్ళాం, బిడ్డలు కూడా లేరు మా లెక్కల ప్రకారం అతనిదగ్గర కనీసం పదిహేను లక్షలైనా బ్లాక్‌మనీ ఉండాలి కానీ

ఎకౌంట్సు అన్నీ చాలా పకడ్బందీగా ఉన్నాయి. ఎక్కడా వేలెత్తి చూప డానికి వీల్లేదు గవర్నమెంటుకు రెగ్యులర్‌గా టాక్స్ కట్టేవాళ్ళలో ఆయ నొకడు

"చూసేవాళ్ళకు నా ఇల్లూ, మిల్లూ రెండే కనబడతాయి ఈ ఇంటిమీద నేను పెట్టిన ఖర్చూ, ఈ మధ్య నా బట్టల మిల్లులో నాకు వచ్చిన నష్టాలూ, ఎవరికీ అక్కర్లేదు నిజానికి ఈ ఇల్లు తయారైన తర్వాత నేను వ్యాపారాన్ని అంతగా పట్టించుకోలేదు. అసలు నే నీ గడపదాటిందే చాలా తక్కువ తత్ఫలితంగా విపరీతమైన నష్టానికి గురయ్యాను నేను అయినా పెద్దగా పట్టించుకోలేదు ఎందుకంటే నా లక్ష్యం నెరవేరింది కాబట్టి ఈ రోజున మీరు దాన్ని కూలగొట్టారు ఫర్వాలేదు. నేనెంత క్షోభనైనా నాలోనే దిగమింగు కుంటాను పౌరుడిగా ప్రభుత్వంపట్ల నాకున్న బాధ్యతలు నాకు తెలుసు అందుకే మీకు అడ్డు చెప్పటంలేదు మళ్ళీ ఒకటి రెండు సంవత్సరాలు నేను వ్యాపారంమీద దృష్టిని కేంద్రీకరిస్తే మీరు చెదరగొట్టిన నా కలలన్నీ మళ్ళీ రూపు దిద్దుకుంటాయి "

షిండేవైపు చూశాను దీర్ఘంగా ఆలోచిస్తున్నా డతను. ఆత్మాహుతి చేసుకుంటూ కూడా ఆ సిగరెట్ అతనికి ఆనందాన్ని ఇవ్వలేకపోతోంది అతని చూపు చాలాసేపు ఒకేచోట కేంద్రీ కృతమై ఉంది ఇందాక నేను చూసిన బొమ్మనే అతనూ చూస్తున్నాడు తదేకంగా షిండేకు కళలమీదా, సాహిత్యం మీదా అభిరుచిలేదన్న సంగతి నాకు తెలుసు ఆ బొమ్మలో రంగులుతప్ప అతని కళ్ళకు ఇంకేమైనా కనపడతాయని నేననుకోను మరి... అతనలా ఎందుకు చూస్తున్నట్టు ... అంతే మరునిమిషం నా గుండె జల్లు మంది రాక్షసుడి భావాలు, రాక్షసుడికే తెలుస్తాయి అతని ఆలోచనలు అర్థ మౌతున్నకొద్దీ, నాకు మతిపోతోంది.

"నా జీవితంలో ఆప్తు లెవరైనా ఉంటే ఆ అమ్మాయే" ముసలాయన మెల్లగా అన్నాడు

ఆ గొంతులో అప్పటివరకూ లేని సౌమ్యత, ఆప్యాయత చోటు చేసు కున్నాయి

"మీ కేమౌతా రామె ?" అడిగాను నేను

"నాకా ! ఆమె మనిషైతే కదా ఏమైనా అయ్యేందుకు "

నేను అర్థంకానట్టు చూశాను

"అది కేవలం ఊహాచిత్రంమాత్రమే. ప్రసాద్ అనే కుర్రవాడు దిక్కులేక కొన్నాళ్ళు నన్నాశ్రయించాడు అతను చిత్రించాడా పటాన్ని దాదాపు ఆరు నెలలు పట్టింది అతని కృషికి ఫలితంగా ఎనభై వేలిచ్చాను. ఇప్పుడతను

ఇటలీలో ఏదో మ్యూజియంలో పని చేస్తున్నా డనుకుంటాను "

"చాలా బావుంది" అన్నాను నేను.

తన అభిరుచిని మెచ్చుకున్నందుకు కృతజ్ఞతలాంటి చూపొకటి చూశా డాయన నావైపు

షిండే ఆ బొమ్మవైపు నడిచాడు. ఆ బొమ్మను అటూ ఇటూ కదిలించ బోయాడు కదల్లేదది బాగా మందంగా ఉందా ఫ్రేమ్ చేత్తో తట్టి చూశాడు లోపల బోలుగా ధ్వనించింది నావైపు చూశాడు ఆ చూపుల అర్థం నాకు తెలుసు సన్నని వణుకు పట్టుకుంది, నాకు ముద్దాయికి ఉరిశిక్ష అమలు జరపమని తను తలారికి అధికారి ఇచ్చే ఆజ్ఞ అది నా చేతులు. నా మాట విననంటున్నాయి

ముసలాయన ముందుకు వచ్చాడు ఆయన కళ్ళల్లో అనిర్వచనీయమైన ఆరాధన

"స్త్రీ అంటే ఏమిటో నాకు తెలీ దింతవరకూ ! ప్రేమ, అనురాగాలకు నోచుకోలేదు జీవితమంతా మోడులా పేలవంగా, నిరాసక్తంగా గడిచి పోతున్న రోజుల్లో ఈ బొమ్మ నా బ్రతుకులో అడుగుపెట్టింది అమూల్యా దానిపేరు అది నాకు అందించే భావాలు కూడా అమూల్యమైనవే ఇప్పుడు నా ఊపిరిలో ఒక భాగమది నా వ్యక్తి త్వానికి, నా ఉనికికి ప్రేరణ అది ఈ లోకంలో ఏది లేకపోయినా బతగ్గలను గానీ ఆ బొమ్మను చూడకుండా బ్రతక లేను " చేత్తో ఒకసారి ఆ పటాన్ని ప్రేమగా తడిమా డాయన

"కిషన్" పిలిచాడు షిండే ఆ పిలుపులో మార్దవంలేదు

"బ్రింగ్ యువర్ ఆపరేటస్" యుద్ధానికి సిద్ధంకమ్మని మేజర్ ఇచ్చే ఆజ్ఞ అది

తలెత్తి ఓసారి ఆ బొమ్మవైపు చూశాను ఆ కళ్ళల్లో వెలుగు నన్ను కాల్చేస్తోంది ఈ ప్రపంచంలో అరుదై పోతున్న మానవత్వాన్ని, ప్రేమను మీకు అందిస్తాను అని వాగ్దానం చేస్తున్న ట్టున్న ఆ బొమ్మముందు, వణుకుతున్న రాముడిలా ముసలాయన, సీతాదేవిని చెరచబోతున్న రావణుడిలా షిండే, కర్మకాండను నిర్వహించేకర్తల్లా మా కింకరులూ, పిరికితనం రక్తంగా మారి పోయిన నేనూ నిలబడ్డాం.

"కమాన్ ! చేర్ దట్" గర్జించాడు షిండే, బొమ్మల్లా నిలబడిపోయిన మమ్మల్ని

మరునిమిషం ముసలాయన షిండే రెండుచేతులూ పట్టుకున్నాడు. అంతు లేని బాధ అతని మొహంలో కనిపిస్తోంది

"సర్ ! మీ కాళ్లు పట్టుకుంటాను కావాలంటే ఈ బిల్డింగ్‌లోని ప్రతి అణువూ తవ్వి పారెయ్యండి నాకున్న



యావదాస్తీ తీసేసుకోండి కానీ ఆ బొమ్మనేం చెయ్యకండి నా ప్రాణం అది నా ఉనికి, నా ఊపిరి అది దాన్ని చూడకుండా క్షణంకూడా బ్రతకలేను దాని కేమైనాఅయితే నేను బ్రతకలేను" దాదాపు ఏడ్చేస్తున్నాడాయన.

నా గుండె నీరైంది రెండు నిమిషాలు ఆ బొమ్మముందు నిలబడితేనే అపూర్వమైన ఆనందాన్ని, అనుభవాన్ని నా కందించ గలిగిందది. అలాంటప్పుడు ఎన్నో ఏళ్ళగా అనుబంధాన్ని పెంచు కున్న ఆయన గుండె చెదిరేలా విలపించడంలో నాకు అసహజత కనిపించలేదు

షిండే ముసలాయనను పక్కకు తీసుకెళ్ళాడు బలవంతంగా

"ప్లీజ్ కంట్రోల్ యువర్ సెల్ఫ్! సెంటిమెంట్లకు, ఫీలింగ్స్‌కు మేం

అతీతులం మా డ్యూటీ మేం చెయ్యాలి! నిమిత్తమాత్రులం ఈ విషయంలో నేనేం చెయ్యలేను. క్షమించండి!"

"కావలిస్తే ముందు నన్ను చంపి తర్వాత ఆ బొమ్మను చింపండి. ఆ బొమ్మలోపల ఏంలేదు. అంతా శూన్యమే. నా ఇంటి ప్రాంగణాన్నే ఎంతో పవిత్రంగా చూసుకునే నేను, నా ప్రాణంలో ప్రాణమైన ఆ బొమ్మను, నా మోసానికీ, అవినీతికీ నిలయంగా వాడుకుంటానా! ఆమాత్రం ఇంగితంలేదా మీకు. ఆలోచించలేరా! మనుషులేనా మీరసలు!" తల గోడకేసి కొట్టుకుంటున్నాడాయన.

కిషన్, బలరాం, సింగ్, మూర్తి పరికరాలు చేతుల్లోకి తీసుకున్నారు, అందమైన లేగ దూడను చంపడానికి కత్తులెత్తిన హంతకుల్లా. ఐదునిమిషాలు నా గుండె స్థంభించింది. పిచ్చిపట్టినట్టు ముక్క ముక్కనూ పట్టి చూస్తున్న షిండే కళ్లు నిరాశగా వాలిపోయాయి. ఆ తైలవర్ణ చిత్రపు శిథిలాల్లో మాకా వలసిందేదీ కనిపించలేదు.

నుదుట పట్టిన చెమటను అద్దుకుంటూ సోఫాలో కూర్చోబోతున్న మా బాస్, ముక్కలైన మనసును తిరిగి సరిచేసుకునే ప్రయత్నంలో ఉన్న నేనూ, చింపి పోగులు పెట్టిన ఆ అందమైన అతివ అవయవాలను ఏరుకుంటున్న మా వాళ్ళూ, అందరం ఉలిక్కిపడ్డాం ఒకేసారి.

మా కళ్ళముందే ఆ ముసలాయన మొదలు నరికిన చెట్టులా కూలి పోయాడు. ఒక్క అంగలో ముందుకు ఉరికి ఆయన చెయ్యి నా చేతిలోకి తీసుకున్నాను. అప్పటికే అంతా అయి పోయింది. తీవ్రమైన అశాంతి మొహంలో నింపుకుని, అంతులేని క్షోభ హృదయాన్ని దహిస్తుంటే, అంతిమ శ్వాసతీసుకున్న దీర్ఘరోగిలా ఉన్నాడాయన. నాకు రెండు నిమిషాలు లోకంతో సంబంధం తెగిపోయింది. నేను మళ్ళీ తెలివి తెచ్చుకునేసరికి, నా చేతిలో ఓ కాగితం పెట్టి, "ఆఫీస్‌లో ఇచ్చెయ్" అన్నాడు షిండే వేగంగా బయటకు నడుస్తూ.

తెరిచి చూశాను. అది అతని రాజీనామా.

గుండెను తీసి ఆ స్థానంలో శూన్యాన్ని నింపుకుని ఫోన్‌వైపు నడిచాను.

———




వేములపల్లి మోహనరావు

లండన్ హీత్రూ ఎయిర్ పోర్టులో జంబో దిగగానే నాకు మొదట కనిపించిన వ్యక్తి మహారాణి నన్ను చూడగానే ఆమె కళ్ళు ఆశ్చర్యంతో పెద్దవయ్యాయి ఎంతో ఆప్యాయతతో నా కుడిచెయ్యి నొక్కుతూ అంది - 'వాటే ప్లజంట్ సర్ప్రైజ్ ఇది పారిస్ఫ్లైటనుకుంటాను ఇండియానుండి కాదా మీరు రావడం?'

'లేదు వారమైంది పారిస్ వచ్చి నిన్ననే పనిపూర్తయింది ఈ రోజు ఇక్కడ ఓ ప్రైవేట్ ఫరమ్‌తో అగ్రిమెంట్స్ సైన్ చేయించాలి మళ్ళీ ఎల్లుండి రాత్రికల్లా మిలాన్‌లో ఉండాలి' అన్నాను

ఇంతలో నన్ను చూసి కెర్నీ రిచర్డ్ ముందుకు వచ్చాడు అతను అక్కడ కస్టమ్స్‌లో పనిచేస్తున్నాడు నాకు క్లోజ్ ఫ్రెండ్ అతనుంటే నాకు హోటల్ రిజర్వేషన్‌తోసహా అన్ని ఏర్పాట్లూ తనే చేసిపెడతాడు అందుకే అతను డ్యూటీలో ఉండే సమయాల్లోనే ప్రయాణం పెట్టుకుంటాను నేను

ఫార్మాలిటీస్ అన్నీ పూర్తయి ఎయిర్‌పోర్ట్ బయటకు వచ్చేసరికి టైమ్ ఏడయింది. దీపాల ప్రవాహాల్లా కార్లు ఆ దీపాల వెలుగుపడి తళతళ ప్రతిఫలించే రోడ్లు

'కారుందా, టాక్సీలో వెళ్దామా' అన్నాను.

'ఇంకా నయం ఈ మహానగరంలో కారు లేకుండానా !' నవ్వింది మహారాణి అదే నవ్వు. రాజ్యాలను సైతం జయించి ప్రజల్ని మంత్రముగ్ధుల్ని చెయ్యగలిగే నవ్వు. ఇన్ని సంవత్సరాల్లోనూ ఆమె ఏమీ మారలేదు క్షణం పాటు ఆమెనే తదేకంగా చూస్తూండిపోయాను కించిత్తు సిగ్గుపడిందామె. బట్టలు విప్పుకుని విచ్చలవిడిగా స్త్రీలు మగవాళ్లతో రాసుకుతిరిగే ఈ నగరంలో ఎర్రబడిన బుగ్గలూ, కొంచెం వాలిన కళ్ళూ నాకెంతో రిలీఫ్ నిచ్చాయి

అంత రద్దీరోడ్లలోనూ సిగ్నల్స్ జాగ్రత్తగా గమనిస్తూ నేర్పుగా డ్రైవ్ చేస్తున్నదామె ఎర్రటి బుల్లి వోక్స్ వాగన్‌కారు కొంచెం చలిగా ఉన్నట్లనిపించి హీటర్ ఆన్‌చేశాను. కొద్దిక్షణాల్లోనే కారంతా వెచ్చగా అయిపోయింది

'అవునూ ! ఇంతకీ నువ్వు ఎయిర్‌పోర్ట్ కెందుకొచ్చినట్టు ?' అన్నాను

'నీకోసమే' అంది తను కొద్దిగా పెదవులు బిగబట్టి వస్తున్న నవ్వును ఆపుకుంటూ

'థాంక్స్ ! ట్రై ఎనదర్ కాజ్' అన్నాను

'మా దూరపు బంధువొకాయన ఇక్కడికి విజిట్ కొస్తున్నట్టు కేబుల్ వచ్చింది నాలుగురోజులక్రితం ఆయన్ని రిసీవ్ చేసుకుందామని !'

'మరి ఆ విమానం రాకముందే వచ్చేస్తున్నావే !' అన్నాను కొద్దిగా కంగారుగా

'లెట్ హిమ్ గో టు హెల్ హీ ఈజ్ నాట్ సో ఇంపార్టెంట్ '

అంతే మహారాణీలు మనుషుల్నే కాదు, వేటినీ లెక్కచెయ్యరు కాసేపాగి అడిగాను 'ఇంతకీ నువ్విక్కడేం చేస్తున్నట్టు ?'

'యూనివర్సిటీ కాలేజ్ ఆఫ్ సైకాలజీలో అసిస్టెంట్ ప్రొఫెసర్‌గా పని చేస్తున్నాను ' అప్పుడు చూశాను ఆమె జుత్తులో కనపడీ కనపడని ఒకటి రెండు వెండి తీగల్ని అప్పటివరకూ ఆమె నా కళ్లకు విజయవాడలో మేరీస్టెల్లాకు రీవిగా, దర్పంగా ఒక





చేత్తో పుస్తకాల్ని గుండె కదుముకుని మరో చేతిని నిర్లక్ష్యంగా ఊపుకుంటూ నడిచి వెళ్ళే పదిహేడేళ్ల పరికిణీ ఓణీల అమ్మాయిలాగే కనిపించింది.

మా పరిచయమే చాలా విచిత్రం. తను బస్ ఎక్కబోయే సమయంలోనే నేనూ బస్ దిగేవాణ్ణి. మొదటి రెండు రోజులూ నన్నసలు చూడకపోయినా మూడో రోజునుండి నన్ను గమనిస్తోం దని కనిపెట్టాను. ఆమెతోపాటు మరో ఇద్దరుండేవారు చెలికత్తెల్లాగ. నేను ఒంటరిగాణ్ణి. చేతిలో పెన్నుమాత్రం ఉండేది. నా పుస్తకాలు కాలేజీలోనే ఉండేవి. రెండు సంవత్సరాల అనుభవం ఉందేమో, పిల్లలకు పాఠాలు చెప్పడానికి నేను ఇంటిదగ్గర ప్రిపేరయ్యేవాణ్ణి కాదు. అందుకే పుస్తకాలు ఇంటికి తీసుకు వచ్చేవాణ్ణికాదు.

ఒకవారం తర్వాత వాళ్లల్లో వాళ్ళు నవ్వుకోవడం, నన్ను చూసి గుసగుస లాడటం మొదలుపెట్టారు. అందమైన ఆడపిల్లలు ఏంచేసినా లైట్‌గా తీసుకునే మనస్తత్వం నాది. ఆ రోజుల్లో మైసూరు నుండి మా మామయ్య పంపిన గంధం సెంటు రాసుకునేవాణ్ణి. ఒకరోజు నాకు వినపడేలా అంది.

'ఈ అబ్బాయి ఏం సెంటు రాసు కుంటాడో మనక్కూడా కొంచెం తెలిస్తే బాగుండును లతా!'

వెంటనే అన్నాను నేను. 'అది సెంటుకాదు పాపా! అందమైన బ్రహ్మ చారుల శరీర సుగంధం!' తెల్లబోయి

చూస్తున్న వాళ్లను వదిలేసి ముందుకు సాగాను తర్వాత ఒకరోజు నన్ను రోడ్డుమీద నిలబెట్టేసింది

'ముందీ సంగతి చెప్పండి మీరు లెక్చరరా !'

'ఏం అయితే' అన్నాను మెల్లగా నవ్వుతూ

'అయ్యో ! ఇంకా మేం ఎవరో రోడ్ సైడ్ రోమియోలే, పుస్తకాలు లేకుండా కాలేజీకి వెళ్లే షోకిల్లా అనుకున్నాం మాస్టారూ క్షమించండి' అంది

'అరే, దేనికి?' అన్నాను నేను

'అయితే మీరు రోజూ మేంచేసే కామెంట్లు వినడంలేదా?'

'ఏం కామెంట్లు?' అన్నాను నేను కొంచెం సీరియస్‌గా.

అంతే పరిగెత్తిందా అమ్మాయి

ఇంకోరోజు 'ఈ రోజు నా బర్త్‌డే సాయంత్రం మనోరమలో పార్టీ ఇస్తున్నాను తప్పకుండా రండి అప్పటి దాకా ఈ టాఫీ తినండి '

మా సంభాషణంతా రోడ్డుమీదే సాగినా కించిత్తు కూడా భయపడేది కాదామె ఎవరైనా చూస్తారేమోననీ, ఏమైనా అనుకుంటారేమోననీ నేనే కొంచెం వెనకాడేవాణ్ణి

ఆ సాయంత్రం మంచి ప్రజెంటేషన్ పట్టుకుని పార్టీకి హాజరయ్యాను. చాలా గర్వంగా నన్ను తన ఫ్రెండ్స్‌కు పరిచయం చేసుకుంది

ఆ రాత్రి వీడ్కోలు తీసుకుంటూ 'వెళ్ళొస్తాను మహారాణీ' అన్నాను

'అదేమిటి? నా పేరు శారద '

'కానీ నాకు మాత్రం మహారాణివే నీ ఠీవీ, నీ హుందా మహారాణుల్లో తప్ప కనిపించవు ! వెళ్లబోయేముందు ఆ వెన్నెల్లో, ఆమె కళ్లల్లో మెరిసిన ఆరాధనాపూర్వకమైన మెరుపును మనసులో దాచుకుని కదిలాను

ఆ సంవత్సరమే నేను ఉద్యోగరీత్యా ఇంకో ఊరికి బదిలీకావడంతో ఆమెను తర్వాత చూడలేదు పద్నాలుగేళ్ల తర్వాత మళ్ళీ ఇలా...

'ఎక్కడుంటున్నావ్ ?' అన్నాను టైనాట్ వదులు చేసుకుంటూ

'ఫైవ్‌బై ఫోర్టీన్, నెల్సన్ ఎవెన్యూ, ఓల్డ్ బాండ్ స్ట్రీట్ యార్డ్‌లీకి దగ్గర్లో' అంది

'అందుకే నన్నమాట ఈ పరిమళపు ఉధృతాలు' అన్నాను

'కాదులే అందమైన బ్రహ్మచారిణుల శరీర సుగంధం అది '

ఇద్దరం మనసారా నవ్వుకున్నాం ఆ కొద్దినిమిషాల్లోనే నా కాంట్రాక్టులూ, టాక్సులూ, లైసెన్సులూ అన్నీ మరిపించేసి మరో లోకంలోకి, మమతలున్న, ప్రేమలున్న లోకంలోకి తీసుకెళ్ళిందామె

'నాకు రూం రిచ్‌మండ్ హోటల్లో బుక్ అయింది నన్నక్కడ దింపెయ్యి











తర్వాత కలుస్తాను' అన్నాను. తీక్షణంగా చూసిందామె నావైపు. నేనింకో మాట మాట్లాడటానికి జంకాను. సీజరైనా, క్లియో అలాచేస్తే మాట్లాడలేడేమో.

మరి కాసేపటికి ఆమె ఫ్లాట్లో ఉన్నాం ఇద్దరం. టీవి ఆన్‌చేసి విండో కర్టెన్స్ పక్కకు లాగి లోపలి కెళ్ళిం దామె ఆ ఐశ్వర్యం, అలంకారాలూ నాకేం కొత్త కాకపోయినా మహారాణి ప్రత్యేకత ఆ రూంలో నా చూపుల్ని కట్టేసింది

ఏం తీసుకుందాం' అందామె ఫ్రిడ్జ్ తెరుస్తూ

జస్ట్ షాంపేన్' అన్నా న్నేను.

ఇద్దరం ఆ షాంపేన్ సిప్ చేస్తూ టీవీ చూశాం కాసేపు. అలా చూడటమనేది మా మనసుల్లో ఎగిసిపడే తరంగాల ఘోషలను దాచుకోవడానికే నని మా ఇద్దరికీ తెలుసు.

కిటికీదగ్గర నిలబడి కిందికి చూస్తే ఎన్నో బారు కారులు. కారుల బారులు రెండు నిమిషాల తర్వాత అన్నాను నేను, కోటు చేతిలోకి తీసుకుంటూ. 'వెల్, మళ్ళీ ఎప్పుడైనా కలుద్దాం!'

నా భుజంమీద చెయ్యివేసి సోఫా లోకి తోసింది. నా పక్కనే కూర్చుని నా మొహంలోకి చూస్తూ అంది – 'మీ కర్థంకాదు రాజా. ఆ రోజుల్లో మిమ్మ ల్నెంత అభిమానించేదాన్ని? చివరకు



వెళ్ళిపోయేప్పుడు మాటమాత్రమైనా చెప్పలేదు మీరు. నేనెంత వేదన అనుభవించానో ఆ దేవుడికే తెలియాలి '

గ్లాస్‌లో మిగిలిన ద్రవాన్ని మింగేసి ఆమె చేతుల్లో చిక్కుకున్న నా చేతిని, ఆమె చూపుల్లో చిక్కుకున్న మనసునూ విడిపించుకోబోయాను. మరింత గట్టిగా పట్టుకుందామె.

'అరెరె ! నీ ఉంగరం గుచ్చుకుంటోంది వదులు' అన్నాను. చెయ్యి వదిలేసింది. అప్పుడు చూశాను ఆ ఉంగరాన్ని. స్వతహాగా పెద్ద నటుణ్ణేమో, నాలోని భావాన్ని నిరంకుశంగా అణగదొక్కి పైకి మామూలుగా ఉండగలిగాను. లేకపోతే...

పదేళ్ళక్రితం ధవళేశ్వరం దగ్గర గోదావరి ఒడ్డున పరిగెత్తి, పరిగెత్తి అలిసిపోయి నా ఒళ్ళో తలపెట్టుకుని ఆయాసంతో ఎగిసిపడుతున్న గుండెల మీద చెయ్యివేసుకుని, నా కళ్ళల్లో కళ్ళు కలిపి వాటిలోని మత్తునంతా నా మనసులోకి జొప్పిస్తున్న రమను గట్టిగా హత్తుకుని ఆమె చేతికి నేను తొడిగిన ఆ పచ్చరాళ్ళ ఉంగరం, హృదయం






ఆకారంలో రావాలని చేయించుకుని ప్రాణంగా చూసుకుంటూ, తనుమాత్రం నా ప్రాణంకాదా అనే ఉద్దేశ్యంతో రమ మధ్య వేలికి తొడిగిన ఆ ఉంగరం, ఆ తర్వాత నాకు దొరికిన ఆ ఎర్రటి పెదవుల సుధారసం అన్నీ ఒక్కుమ్మడిగా గుర్తొచ్చి గుండెను పట్టి కుదిపినప్పుడు, ఏమీ ఎరగనట్టు 'ఉంగరం బావుంది. ఎక్కడ కొన్నావ్!' అని అడగడం ఇంకొకడివల్ల అయ్యేపనేనా!

'చాలా పెద్ద కథ రాజా! రమ అనుకుంటాను ఆ అమ్మాయి పేరు. ఆమెదీ ఉంగరం. మా కజిన్ ఒకతనున్నాడు రాజేష్ అని. మంచి ఆ స్తిపరుడు. ఇద్దరూ కలిసి తిరిగారు చాలా రోజులు. తర్వాత ఏదో ఏక్సిడెంట్‌లో ఆ అమ్మాయి చచ్చిపోయింది. ఆమె గుర్తుగా అతని కా ఉంగరం మిగిలిపోయింది. నాలుగేళ్ళ క్రితం నేను ఇండియా వెళ్ళినప్పుడు నన్నతనికి ప్రపోజ్ చేశారు. కానీ అతను ఒప్పుకోలేదు. నాకు అతను చెప్పిన కారణం ఒక్కటే. రమను తను మర్చిపోలేనన్నాడు. నన్ను పెళ్ళి చేసుకుంటే అది నాకూ, రమకూ చేసిన ద్రోహమే అవుతుందన్నాడు. నాతో మాట్లాడుతున్నంతసేపూ ఈ ఉంగరాన్నే చూశాడు. అది అతని ప్రాణం. దీన్ని చూస్తూనే అతను పిచ్చివాడైపోతున్నాడట. ఆ ఉంగరం నాకిచ్చెయ్యమన్నాను. మొదట ఇవ్వనన్నాడు. తర్వాత ఓ విధంగా బలవంతంచేసి

నేనే లాక్కున్నాను ఈ ఉంగరాన్ని అప్పట్నుంచీ ఇది నా దగ్గరే ఉంది. విచిత్రమేమిటో తెలుసా, ఇది నా దగ్గర కొచ్చిం తర్వాత రాజేష్ మామూలు మనిషయ్యాడట. నేనేమో పిచ్చిదాన్నైపోయాను'. దీర్ఘంగా నిట్టూర్చిందామె.

రమ చచ్చిపోయిన సంగతి కానీ, ఆ రాజేష్ సంగతి కానీ నా కింతవరకూ తెలియదు. ఇన్నేళ్ళ తర్వాత మళ్ళీ వాళ్ళను గురించి ఆలోచించి మనసు పాడుచేసుకుని ఈ సైకాలజీ ప్రొఫెసర్ సానుభూతిని పొందే దీనస్థితిలో లేనిప్పుడు నేను.

'నా కింకో గంటలో ఓ అపాయింట్‌మెంటుంది. వెళ్తా న్నేను' అన్నాను వాచీ చూసుకుంటూ.

'నో ఫియర్స్. నువ్వీ రాత్రికి ఇక్కడ ఉండాల్సిందే' లోపల్నుండి రూం లాక్‌చేసేసి తాళాన్ని జాకెట్లో వేసేసుకుందామె.

'నీకు తెలీదు రాణీ. వయసైతే వచ్చిందిగానీ కోరికలుమాత్రం కుర్రవే నాకింకా. నేను చాల బలహీనుణ్ణి' అన్నాను.

'ఫర్వాలేదు. కొందరి బలహీనత, మరికొందరికి ఆనందదాయకం కావచ్చుగా !' కొంటెగా నవ్విందామె. నా ఒళ్లు పులకరించింది.

భోజనాలు పూర్తిచేశాం.

నువ్వు పెళ్ళెందుకు చేసుకోలేదు ? సూటిగా అడిగాను.

'డియర్ రాజా. జీవితంలో ఎన్నో అనుకుంటాం. నన్నే ఉదాహరణగా తీసుకోండి. మా వాళ్ళందర్నీ పైకి తీసుకురావాలని చిన్నప్పటినుండీ ఎన్నో కలలు కన్నాను. ఆ కలలన్నీ నిజంచేసుకుని అందర్నీ ఉన్నతమైన స్థానాల్లోనే కూర్చోబెట్టగలిగాను. ఆఖరికి నన్ను నేను చూసుకునేసరికి మూడు పదుల వయసూ, ఒంటరి జీవితం నన్ను చూసి వెక్కిరించాయి. ఒకప్పుడు నేను పెళ్ళి వద్దన్నాను.

ఇప్పుడు పెళ్ళే నన్ను వద్దంటోంది. నే నెవర్నీ అర్థించను. అటువంటి అలవాటు నాకు లేదు. నిన్ను సూటిగా అడుగుతున్నాను. ఈ ఉంగరాన్ని, ఉంగరం ఉన్న చేతినీ నువ్వు స్వీకరించ గలవా'!

మళ్ళీ అదే దర్పం, అదే ఠీవి. మగవాణ్ణి శాసించే అందమైన అహం.

'నాకు పెళ్ళయింది రాణీ. ఇద్దరు పిల్లలుకూడా.'

విరగబడి నవ్వింది మహారాణి.

'సిల్లీ ఫూల్. నీకు పెళ్ళికాకుండా నువ్వింతకాలం బ్రహ్మచారిగా ఉన్నావనీ, నాకోసం నిరీక్షిస్తున్నావనీ నేనను కున్నానా ! ఐ డోంట్ వాంట్ యువర్ ఎంటైర్ లైఫ్. నీ జీవితంలో కొన్ని



యువ




గంటలు నాకోసం వెచ్చించు. నా ఒంటరితనాన్ని తాత్కాలికంగానైనా దూరం చెయ్యి. ఒక లక్ష్యాన్ని నాకు ఏర్పాటు చెయ్యి. నాకోసం వచ్చే మనిషి, నేనంటే అభిమానించే వ్యక్తి ఒకడున్నాడనే భావన, ఆత్మతృప్తి నాకు కలిగించు. దట్సాల్.' ఆ కళ్ళల్లో ఆరాధన అర్థంకాని, అంతంలేని భావ లహరి. నా చేతిని మౌనంగా ముందుకు చాచాను. ఉంగరాన్ని నా చిటికెన వేలికి తొడిగి దాన్ని ముద్దుపెట్టుకుందామె.

నేను పీయూసి చదివేటప్పుడు మా ఫ్రెండ్ ఒకడు నా ఆటోగ్రాఫ్ పుస్తకంలో రాశాడు. 'రింగ్ ఈజ్ రౌండ్. ఉచ్ హేజ్ నో ఎండ్. సచ్ ఈజ్ లవ్' మహారాణీని రెండు చేతుల్లోనూ దగ్గరకు తీసుకున్నాను. అదే సౌకుమార్యం, అదే లాలిత్యం. సుతిమెత్తనిపట్టులాంటి శరీరం మనసును మత్తెక్కించే సౌరభం. మహారాణీలు వాడే సుగంధ ద్రవ్యాలు వెలువరించే సువాసన.

వెల్. ఆ తర్వాత మీ కనవసరం.




"మన గౌరవానికి తగినట్లు చదివింపులు పెట్టకుంటే నలుగర్లో ఏమి గౌరవముంటుంది? అందులోనూ మా తమ్ముడిది పెద్ద ఆఫీసర్ల సంబంధం — అదే ఆ సి.టి.వో. వాళ్ళది. పైగా యింటికి పెద్దల్లుడయితిరి. ఆ తర్వాత మీ యిష్టం. ఒక వారంరోజులు ముందు గానే పెళ్ళికి రమ్మని మా నాన్న రాసాడు." చేతుల్లోని శుభలేఖా, తండ్రి ఉత్తరమూ మాటిమాటికీ చూసుకుంటూ గౌరి, భర్త రామకృష్ణతో అంది.

## నిత్యజీవితంలో హస్తాభినయములు : "సందంశము"






తమ్ముడి పెళ్ళివిషయం మాత్రమే నొక్కిచెబుతూ, ఒకే ముహూర్తంలో జరుగుతున్న చెల్లెలి పెళ్ళివిషయం పట్టనట్లు మాట్లాడుతున్న భార్యను రామకృష్ణ అర్థంచేసుకోలేకపోయాడు అదే అడిగేడు.

"మరి సుమతి పెళ్ళి కూడా ఉందిగా."

"ఆఁ దాందేముంది ? సుమతికి ఏమీ పెట్టకపోయినా, ఎవరు మాత్రం అనుకొని చస్తారు ? ఆస్తిపాస్తుల్లేని పల్లెటూరు సంబంధం. ఆ పెండ్లికొడుకు చదువా ఒట్టి బి. కాం. ఉద్యోగమా, బాంకి గుమాస్తా" – గౌరి దీర్ఘంతీస్తూ సమాధానమిచ్చింది. రామకృష్ణను కొరడాతో బాధినట్లయింది

సుమతికి కాబోతున్న భర్తకంటే తన యోగ్యతలు ఏ మెక్కువని ? తనకూ జమీలు లేవు. తాను పుట్టిందీ, తన వాళ్లుండేది పల్లెటూరే. తన చదువా -ఆస్తిని హరించినా ఎం. కాం.; తన ఉద్యోగమా యాదృచ్ఛికంగా దొరికిన జూనియర్ కాలేజీ లెక్చరరు ఉద్యోగం. బాంకి గుమాస్తాకంటే తానెన్ని అంతస్తులు పైనున్నానని ! గౌరికి యీ విషయం తెలియదా ? తెలిసినా కొంత గొప్పయినా మిగుల్చుకోవాలనే తాపత్రయమేమో ! పుట్టింటి గొప్పలేమో! - ఆత్మవంచన కాకపోతే.

అనుమానంగా అడిగేడు :

"మరి మీ నాన్న యీ సంబంధానికి ఎందుకు ఒప్పుకున్నట్లు ?"

"అయిన సంబంధం వదిలించు కోలేక, మా మేనత్త జలగలాగా పట్టింది" – గౌరి మేనత్తమీద తప్పిదం వేసింది.

రామకృష్ణ అసహనంగా అన్నాడు :

"ఆ మాటెందు కంటావు ? 'కారు చౌకగా అల్లుడు దొరుకుతూ ఉంటే వదులుకుంటారా' అనరాదా ?"

"అదేంకాదు. మా నాన్న మీకు మాత్రం వేలువేలు పోసాడా? అయినా ఆడపిల్లలకే పెడుతూకూర్చుంటే కన్న కొడుకులు చిప్పలు పట్టుకొని వీధుల్లో పడాల్సిందే. కొడుకులు కొడుకులే. కూతుర్లు కూతుర్లే."

'అయితే ఆ పట్టుకునే చిప్పలేవో ఆడవాళ్లే పట్టుకొని ఊరేగా లంటావు' అని రామకృష్ణ నోటిదాకా వచ్చింది. ఆ మాట అనలేకపోయాడు.

ఆ మాట అన్నాడంటే యింకా మామగారినుంచి డబ్బులు పిండడం కోసం తనేడుస్తున్నట్లు గౌరి రాద్ధాంతం చేస్తుంది. ఆమె ఆలోచనలూ, వాదనలూ రెండేళ్ళనుంచీ వింటున్నాడు, తాను. తన ఆలోచనలూ, అభిప్రాయాలు ఆమె బుర్రకు యెక్కవు. యెక్కకపోవడం అటుంచి పెడార్థాలు లాగుతుంది.

రామకృష్ణ మాట మార్చేడు.

"పెళ్ళికి వెళ్ళక తప్పదు సరే. చదివింపులు పెట్టకపోతే మునిగిపోయే దేముందీ ?"

గౌరి చిరాకుగా అడ్డు తగులుతూ అంది.

"మీ కేమి మునిగిపోతుంది – ఏ మర్యాదలూ . అక్కరలేనివాళ్ళకు. గతి లేక పెట్టలేదంటారు. మన వైభోగం అందరికీ తెలుస్తుంది. పెళ్ళింట్లో తలెత్తుకొని తిరగొద్దూ. దానికంటే పెండ్లికి పోకపోతేనే బాగుండుఁది. సాకు దొరకకపోదు."

గౌరి నిష్ఠూరానికి రామకృష్ణ బాధ పడ్డాడు.

ఇంకెన్నేళ్ళు కాపురంచేస్తే తననూ, తప్పని పరిస్థితులనూ అర్థంచేసు కుంటుందో ?

రాజీ ధోరణిలో అన్నాడు–

"పోనీలే నీ యిష్టం ఎందుకు కాదనడం. డబ్బెంత కావలసి ఉంటుంది ?"

"ఒక ఆరేడు నూర్లయినా లేకుంటే బాగుంటుందా ?"

"అంత డబ్బు చేతిలో ఎక్కడుందీ ?"

"చేతుల్లో ఎప్పుడు మాత్రం పట్టుమని పది రూపాయలున్నాయి. దానికనీ, దీనికనీ పనికిమాలినవానికైతే అప్పులు దొరుకుతాయి."

తన విషయం తెలిసి అవమానిస్తోందో, అమాయికంగా తెలియక మాటలతో హింసిస్తూందో రామకృష్ణకు






అర్థంకాలేదు. యీ విధంగా మాట్లాడడం అలవాటో, నైజమో !

ఒక నిశ్చయానికి వచ్చి అనునయించాడు :

"ఏదో తిప్పలు పడదాంలే."

రెండురోజులు రామకృష్ణ అప్పు కోసం నానా అవస్థలూ పడ్డాడు. అక్కడా యిక్కడా అయిదువందలు పోగయింది. భార్యకు యీ విషయం తెలిపేడు.

"ఇప్పటికి దొరికింది యిది. తమ్మునికీ, చెల్లెలుకూ, నీకూ యేమేమి పెట్టుకుంటావో పెట్టుకో."

"ఇంకా నయం ! మిమ్మల్ని కలుపుకోలేదు. నాకు పెట్టేవేవో మా వాళ్లు పెడతారు. మా తమ్మునికి ఒక ఉంగరం పెడదాం. యీవాళే చేయిస్తే మర్నాడైనా పోవచ్చు."

"మరి సుమతికి ?"

"మాటి మాటికి సుమతి సుమతి అంటారు. మీకే యేవో అభిమానాలూ, ప్రేమలూ ఉన్నట్లు — నాకు లేనట్లు. సుమతికి పెద్ద ఖరీదేమీలేకుండా ఒక చీరె తెండి - నూరు రూపాయల లోపు. ఏమి పెట్టినా, పెట్టకపోయినా అనుకునే వాళ్లెవరు ? అన్నట్లు మీ నడిమివేలు సైజు ఉంగరం చేయించండి, తమ్మునికి."

గౌరి వింత మనస్తత్వానికీ, ప్రవర్తనకూ రామకృష్ణ బాధపడ్డాడు. అభిమానాలూ, ప్రేమలూ యిద్దరిమీదా

ఒకటే నంటుంది మరి యీ తేడా! ఆమె యీ మన స్తత్వం వెనుక కారణాలు ఊహించటానికీ వాటిని ఎత్తిచూపుతూ ఆమెతో వాదనకు దిగటానికీ రామకృష్ణకు మనని ప్పలేదు

కారణాలు తెలియ జెప్పతేనే అవలీలగా బుద్ధులు మారవు వాదనలు చేస్తూనే దృక్పథాలు ఉన్నట్టుండి విశాలం కావు – అవి సంస్కారంలో భాగం కానంతవరకూ యీ ఏడుపులే బావ మరిదికీ మరదలుకూ చెరి రెండువందల యాభై చేసే వస్తువు లేవైనా చదివింపులుగా తీసుకువెళితే బాగుంటుందను కున్నాడు తాను గౌరి యీ ఆర్థిక సూత్రం తలక్రిందులు చేసింది—ప్రేమల పంపకంలో

రామకృష్ణ ఉద్దేశాన్ని బంగారు అంగడివాడు మరింత తలకిందులు చేసేడు ఉంగరం మూడువందల యాభై పైచిల్లర అయింది వందా ఇరవై కంటే ఖరీదైన చీరను మరదలు సుమతికి రామకృష్ణ తేలేకపోయాడు

ఉంగరం చూసి ఇది వాడి వేలుకు పడుతుందో లేదో నని గౌరి గునిసింది మరదలుకు మంచి చీరే తెచ్చారే అని ఎగతాళి చేసింది రామకృష్ణ నవ్వి ఊరుకున్నాడు

గట్టి వరహాని బంగారు ఉంగరం బావమరి కీ గట్టి వరహాని పీతాం బరం మరదలుకూ రామకృష్ణ చదివించేడు పురోహితుడి చదివింపుల అరుపులు నలుగురికీ వినిపించాయో లేదో నని గౌరి పెళ్ళిపందిట్లో నలువైపులా చూసింది గర్వంగా చదివించిన ఉంగరాన్ని ఉంగరం వేలుకు సరిపోక చిటికెన వేలుకు పెట్టుకుంటూ కాబో తున్న భార్యను చూసి మునిముని నవ్వులు బావమరిది నవ్వేడు చీరె పాకెట్ విప్పి తనవైపు చూసి మరదలు కళ్లు దించుకుంది రామకృష్ణ తానేదో తప్పుచేసినట్లు కుంచించుకపోయాడు

వచ్చిన తంతు ముగిసింది రామకృష్ణ సెలవులేదని వెంటనే బయలుదేరి జమ్మలమడుగు చేరుకున్నాడు – గౌరి మరో వారంరోజులు ఎలాగూ అక్కడే ఉంటుంది కదా అని

అయిదోరోజు కాలేజీనుంచీ తిరిగి వస్తూనే ఇంట్లో పడకేసి ఉన్న గౌరిని చూసి రామకృష్ణ ఆనందపడ్డాడు సరదాగా అడిగేడు

"మీ తమ్ముని మామగారి ఊరు కూడా వెళ్ళి వచ్చావా? వాళ్ళ కార్లలో జోరుగా తిరిగావా? నీ మరదలు ఏమంటోంది? ఆ పెద్ద సంబంధం ప్రపంచంలో పడి యిప్పుడిప్పుడే రావను కున్నానే అనంతపురం పోలేదా? ఇంతకూ నలుగుర్లో ఏపాటి గౌరవం మూటగట్టుకొని వచ్చావు?

**నిత్యజీవితంలో హస్తాభినయములు** **"పుష్పపుటము"**






హఠాత్తుగా గౌరి బెక్కింది.

"ఏమైంది ?" రామకృష్ణ ప్రేమగా అడిగేడు.

"నా ఖర్మ ! అందరికీ లోకువే ఆడదంటే."

"ఏదో సరదాగా అడిగాను. నిన్ను బాధపెట్టడం నా ఉద్దేశ్యం కాదు." పక్కన కూర్చొ ముఖంమీద పడ్డ తల వెంట్రుకల్ని పైకి చేత్తో దువ్వుతూ అన్నాడు.

"మీరు కాదు వాడే. తమ్ముడు కదా అని ప్రేమ చూపితే నిన్నగాక మొన్న పెళ్ళి అయిందో లేదో అప్పుడే తోబుట్టువులు చులకనైపోయారు."

"ఏదైనా గొడవ జరిగిందా ? తొందరపడి ఏమైనా అన్నాడా ?"

"ఏమంటాడు ? అంటే ఆడబిడ్డ ఉసురు ఊరికేపోదు. అబ్బని మించిన కొడుకు ! నెక్లెసూ, కమ్మలు చేయించమన్నా, అంతే. వెనకా ముందూ ఎవరున్నారని - నేనూ సుమతీ తప్ప. ఆ ఆస్తి అంతా కట్టుకొని ఊరేగుతాడా ? మా నాన్నే నయం. చేయించమన్నాడు. 'పెళ్ళి ఖర్చులు తడిపి మోపెడైనాయి. చేయించవచ్చులే' అన్నాడు. పట్టుచీరలైనా రెండో,మూడో పెట్టమని మా అమ్మ అంటే 'ఎందుకూ దండగ, ఆ ట్రంకుల్లో చిలుము పట్టడానికి' అంటూ నాసిరకంవి ఏవో తెచ్చి మొహాన కొట్టారు మన మేమీ గతిలేక అక్కడికి పోలేదు."

"అంత ప్రేమగా ఉంగరం చదివించావు కదా !"

"ఆ ప్రేమ కారిపోయి కాదు - మిమ్మల్ని యిబ్బంది పెట్టింది. ఇంటికి పెత్తందారు కాబోతున్నాడు కదా - ఏదో తోబుట్టువుల్ని యింత జ్ఞాపకం పెట్టుకుంటాడని, ముందు ముందు నగో, నట్రో చేయిస్తాడని, చీరో సారో పెడతాడని. ఆ స్తిపాస్తుల్లో భాగ మడిగి నట్టు తన్నుకొని చస్తారు - ఆడపిల్లలకు ఏమి పెట్టాలన్నా, యింత డబ్బు కౌపీనం ఉంటే పుట్టిల్లు మరిచిపోవాల్సిందే." గౌరి తమ్మునికి దండకం చదివింది.

"డబ్బు ఆశలేని దెవరికిలే - ఎక్కువ తక్కువా అంతే. ఏ బంధాలు లేవు." రామకృష్ణ అర్థవంతంగా అన్నాడు.

"మరీ అంతనా? పీడిని నమ్ముకొని ఆ సుమతిని బాధపెట్టినా, అది నన్ను పట్టుకొని ఒకటే ఏడ్చింది - కనీసం చెప్పిన బంగారమయినా తనకు పెట్ట లేదని."

రామకృష్ణకు విషయం తెలిసింది.

మగవాళ్ళకంటే హీనంగా ఎందరి దయాదాక్షిణ్యాలమీద యీ ఆడవాళ్లు బతకాలి, ఎంత వంచనా శిల్పాన్ని అలవరచుకోవాలి.

జాలి చూపాలా? తనకు అర్థంకాదు. రామకృష్ణ గౌరి పాఠం గౌరికి నిర్వికారంగా అప్పజెప్పేడు.

"అయినా ఆడపిల్లలకే పెడుతూ కూర్చుంటే కన్నకొడుకులు చిప్పలు పట్టుకొని వీధిలో పడాల్సిందే. కొడుకులు కొడుకులే. కూతుర్లు కూతుర్లే అని నువ్వే అన్నావుగా. అలాగే తమ్ముళ్ళు తమ్ముళ్లే, చెల్లెళ్ళు చెల్లెళ్లే, డబ్బుఆశ డబ్బు ఆశే అనుకోరాదా? సరిపోతుంది. లే...లే."

రామకృష్ణ దెప్పిపొడుస్తున్నాడని గౌరికి దుఃఖం మరింత పెల్లుబికింది.





**దు**ర్లభం త్రయమేవైత ద్దేవానుగ్రహ హేతుకమ్
మనుష్యత్వం ముముక్షుత్వం మహా పురుష సంశ్రయః

'మానవజన్మ, మోక్ష జిజ్ఞాస, పరమార్థ జ్ఞానులైన మహాపురుషుల సాంగత్యము అనే ఈ మూడున్నూ దైవానుగ్రహం లేనిదే లభ్యంకావు' అని ఆద్యశంకరులవారు సెలవిచ్చినట్టు-

నేనీ కార్యాలయంలో కొత్తగా నూనూగు మీసాలనూత్న యౌవనంతో ఉద్యోగిగా చేరేసరికి అప్పలస్వామిగారి మిత్రత్వం నాకు ప్రాప్తించింది.

పాపం! అప్పలస్వామిగారు సహృదయులు, అందరి శ్రేయోభిలాషులు అయినా, నాకుమాత్రం అధిక శ్రేయోభిలాషులు. వారికి నాపైగల ప్రత్యేక ఆదరాభిమానాలు ఇంకొకరిపై వుంటా

యని నేను భావించడంలేదు భావించను కూడాను

కొత్తగా కార్యాలయంలో అడుగు పెట్టి కుడ్యాల నలంకరించిన ప్రముఖ దేశనాయకుల చిత్రపటాలను తిలకిస్తూ, గుటకలువేస్తున్న తరుణంలో, తరుణ వయస్కులైన అప్పలస్వామిగారు భుజంమీద చెయ్యివేసి- "కొత్తగా గుమస్తాగా చేరబోయే పుణ్యశ్లోకారావు నువ్వేనా నాయనా?" అని ఆప్యాయంగా అడిగేరు

ఆయన పవిత్ర హస్తం నా గాత్రం మీద పడగానే కాయం పులకరించింది ఆ నెమ్మది, ఆ మంచితనం ఆ పుత్ర వాత్సల్యం చూస్తే ఎంతటివారికైనా గుండె నీరవుతుంది

"అవున్నేనేనండీ! నమస్కారం!" అన్నాను

"వెళ్ళు-తలగుమస్తాని కలుసుకో నువ్వుచెయ్యవలసిన పనేమిటో చెప్తాడు" అన్నారు

అప్పలస్వామిగారు చూస్తే నన్ను తలగుమస్తా దగ్గరకు వెళ్ళమన్నారు ఇంతకీ ఈయ నెవరు? ఈయన నిర్వహించే పదవి ఏమిటి?

సరే-ఏదో ఆప్యాయంగా మృదువుగా చెప్పేరు ఆయనమాట త్రోసిరాజనడం ఎందుకని, వెళ్ళి తలగుమస్తాని కలిశాను ఒక ఖాళీకుర్చీ చూపించి, నన్నందులో కూర్చోమన్నాడు తలగుమస్తా కూర్చుని ఏవో పాతకాగితాలు తిరగేస్తూ, చదువుతూ, అందులోవున్న విషయాలను అవగాహన చేసుకోమన్నాడు

నేనలాగే చేస్తున్నాను

"మిమ్మల్ని అధికారిగారు రమ్మని కబురుపెట్టేరు, వెళ్ళండి" అని ఆదేశించాడు తలగుమస్తా

నేను కార్యాలయంలో చేరి రెండు గంటలైంది కాని ఇంతవరకూ అధికారి గారిని చూడలేదు

సరే బయలుదేరేను

నా అదృష్టం ఏమోగాని అధికారి గారు దయార్థ్రి నవనీతహృదయులైన అప్పలస్వామిగారే!

తన క్రింది ఉద్యోగుల్ని తుచ్ఛంగా చూడక,సమదృష్టితోను, పుత్రవాత్సల్యం తోను చూసే అప్పలస్వామిగారివంటి అధికారులు ఎంతమంది ఉంటారు?

"నమస్కారమండీ!" అని చేతులెత్తి జోడించాను

"వచ్చావా నాయనా! రా, కూర్చో" అని ఎదుటి కుర్చీని చూపించారు

నా ప్రక్కన కూర్చున్న మరో యిద్దర్ని అవతలకి వెళ్ళమన్నట్లుగా సంజ్ఞ చేశారు దీన్నిబట్టి చూస్తే, వారు నాతో ఏకాంతంగా ఏదో మాట్లాడ నిశ్చయించుకున్నారని అనుకున్నాను

"నీకు తల్లీ తండ్రీ ఉన్నారా నాయనా?" ప్రశ్నించారు

"ఉన్నారండీ!"








"మీ నాన్నగారేం చేస్తున్నారు?"

"ప్రస్తుతం విజయనగరం సంస్థానంలో పనిచేస్తున్నారండీ!"

"అయితే నీకూ ఉన్న ఊళ్ళోనే ఉద్యోగంకనుక భోజనం గడిచిపోతుంది. నీకొచ్చే జీతం నీ స్వంతానికి వాడుకోవచ్చు నన్నమాట."

"అంతా స్వంతానికే వాడుకుంటే ఎల్లాగండీ! ఇన్నాళ్లూ వాళ్ళు పెంచీ పెద్దచేసినందుకు వారికేమైనా ఇవ్వాలి కదా? అందులోకీ మా నాన్నగారు త్వరలోనే రిటైరవుతున్నారాయె!" అన్నాను

అదే నీకు నేను చెప్పదలచాను ఎవరైనా డబ్బు రుణం ఇమ్మంటే అలాగే చెప్పు!

—ఈ ఆఫీసులో ఏమాత్రం అవకాశంవున్నా, అప్పు తెమ్మంటూంటారు తోటి గుమస్తాలు. వాళ్ళు చేసే ఒత్తిడికి తట్టుకోవడం కష్టం.

—నీ మనసు కరగించి, నీకు జాలి కలిగేటట్లు చేయాలని గొప్పగా నటనలు చేస్తారు. 'పిల్లాడికి జీతం కట్టాలి. ఇవాళ కట్టకపోతే బడిలో తీసేస్తారు. వాడి జీవితం పాడైపోతుంది—ఇల్లాలికి విపరీతంగా జబ్బుచేసింది. ఈ క్షణంలో మందు కొనకపోతే దాని ప్రాణాలు దక్కవు రక్షించు అని వారి కుటుంబ బాధలు వర్ణిస్తూ నీ సానుభూతి

సంపాదింప జూస్తారు.ఒకసారి ఇచ్చావా మరి నీ డబ్బు నువ్వు కళ్ళచూడవు! వారికేవిధంగానూ లొంగకు—జాగ్రత్త!" అని హెచ్చరించారు.

అప్పలస్వామిగారి హెచ్చరికను మననం చేసుకుంటూ పని చేసు కుంటున్నాను.

మా గుమస్తా సోదరులతో ఈ నెల రోజుల్లోనూ ముఖపరిచయమైనా సరిగ్గా అవలేదు. అప్పలస్వామిగారు చెప్పినట్టు అపుడే ఒక మిత్రశ్రీ దాపరించేడు.

"నమస్తే పుణ్యశ్లోకారావుగారూ!" అన్నాడతను.

నేను నోటిమాట లేకుండా ప్రతి నమస్కారం చేశాను.

"వర్కు బాగా పికప్ చేస్తున్నారా?" అడిగేడు.

చేస్తున్నానన్నట్లు తలకాయ ఊపాను.

"కొంచెం తొందరగా అవసరం వచ్చింది. నా భార్యకు గర్భస్రావం కలిగి సుస్తీ చేసింది. ఓ పదిరూపాయ లిద్దురూ! రెండ్రోజుల్లో ఇచ్చేస్తాను" అన్నాడతను.

"నాకు అవకాశం లేదండీ! నేను జీతం అందుకోడం ప్రథమంకూడానా? ఇంట్లో మా నాన్నగారికి లెక్కచెప్పాలి" అన్నాను.

ఇటువంటి సమాధానాలు నిర్మొహమాటంగా నలుగురైదుగురికి చెప్పేను. ఈ సందర్భంలో అప్పలస్వామిగారికి నేనెంతో ధన్యవాదాలర్పించాను. ఆ మహాభాగుడే కాని ఈ గుమస్తా సోదరుల సంగతి ముందుగా తెలియపరచక పోతే, నేను అప్పివ్వడమూ వాళ్ళు ఎగ వెయ్యడమూ తప్పదుకదా!

నేనో చచ్చుదద్దమ్మని! ఎదుటివాడు చెప్పింది అబద్ధమో సుబద్ధమో తెలుసు కునేటంత చతురత నాకు లేదు. వాళ్ళడిగిందేదో ఇచ్చివేస్తినా—నా గతేంకాను! ఆ అప్పలస్వామిగారి చల్లని చూపువల్లనే ఏదో ఇలా ఈడ్చుకొస్తున్నాను.

రెండోసారికూడా జీతం అందుకున్నాను. కొంతడబ్బుతో కొత్తజట్టలు కుట్టించుకోవాలని సంకల్పం.

ఇంతలో అధికారిగారైన అప్పలస్వామిగారు రమ్మన్నారని కబురు. తక్షణమే బయల్దేరాను. ఈ పర్యాయం నా మేలుకోరి ఏమని హెచ్చరించ నున్నారో ఏమో? ఆయన హెచ్చరికను పాటించకపోతే నా డబ్బు ఏంకాను?

"రావోయ్ పుణ్యశ్లోకారావు!కూర్చో" అని కుర్చీ చూపించారు. కూర్చున్నాను.

"నాకు ఈ నెల ఎక్కౌంటెంటు జనరల్ దగ్గర్నుంచీ పేస్లిప్ రాలేదోయ్! అంచేత నా జీతం డ్రాచేసుకోలేక పోయాను. నీ జీతంలో ఓ వంద రూపాయ లియ్యవోయ్. మళ్ళీ రెండ్రోజుల్లో ఇచ్చేస్తాను," అన్నారు.

ఎంతటివారికైనా కష్టాలొస్తాయి. ఇంత పెద్ద అధికారీ ఎంతో కష్టంలో






ఉండకపోతే అడగడుకదా అని వెంటనే ఇచ్చేశాను.

ఒకటి కాదు, రెండు కాదు—ఆర్నెల్లు గడిచాయి కాని, అప్పలస్వామిగారు నా కివ్వవలసింది ఇవ్వలేదు. ఇవ్వమని అడిగే సాహసం నాకు లేదు. అడిగితే, ఆయనకి కోపం వచ్చి నన్ను ఉద్యోగం లోంచి ఊడబెరికితే?

ఆఖరికి నా వందరూపాయలూ నాకు దక్కలేదు.

కష్టార్జితం ఎప్పుడూ పోదని మహాను భావులంటూంటారు. అది నిజమని నాకు తోచదు. నేను కోల్పోయిన వంద రూపాయలూ కష్టార్జితమే కాని అక్ర మార్జితం కాదే?

శిఖ్కు మతాచార్యుడు నానక్ కష్టార్జితం పోదని, పోయినా దొరికి తీరుతుందని ఉపన్యసిస్తున్నాడు. ఒక శ్రోత లేచి— "ఇదిగో! నా వేలిఉంగరం నా కష్టార్జితమే. ఇది ఎదురుగా కనిపిస్తున్న చెరువులో పారేస్తాను. మీరు చెప్పింది నిజమో కాదో పరిశీలిస్తాను!" అన్నాడు.

అలాగే చూడమన్నాడు నానక్.

శ్రోత ఉంగరాన్ని సరస్సులో పారవేశాడు. అది, ఒక చేపమింగడం, ఆ చేప జాలరి వలలో చిక్కడం, అతను చేపను కోయగా ఉంగరం దొరకడం, అది మళ్ళీ భద్రంగా యజమానికి అందివ్వడం జరిగిందిట!

ఈ దృశ్యం నా తలంపుకు వచ్చి కళ్ళకు కట్టినట్లు అనిపించింది.

కాని నా డబ్బు నాకు దక్కలేదు!

ఇప్పుడు నేను రిటైరయి పింఛను దారుణ్ణయానుకూడా! కష్టార్జితం పోదా?




ఉదయం ఎనిమిది కావస్తోంది. కూరగాయలు తీసుకురాడానికి మార్కెట్‌కి వెళ్ళాను. మెయిన్ గేటుముందు ఓ దృశ్యం నా కళ్ళను ఆకర్షించింది.

బాగా మాసివున్న బట్టమీద ఓ చంటివాడు 'కేర్' 'కేర్' మంటున్నాడు. ఆ పసిపాప వయసు సుమారు సంవత్సరం వుంటుందేమో. పసిపా ప్రక్కనే కూర్చున్న ఓ బక్కపలుచ వ్యక్తి రుద్ధస్వరంలో అంటున్నాడ

"తల్లిలేని పిల్లవాడు బాబూ, పాలులే విలవిల్లాడిపోతున్నాడు దయదల్చి ధర్మ చెయ్యండి బాబూ," అని. ఆ ప్రాధేయ గుండెల్ని కరిగించేలా వుంది.

పసివాణ్ణి చూస్తుంటే, బక్కపలుచ




వ్యక్తి చెబుతోంది. నిజమనిపిస్తోంది మేలిమి బంగారు వర్చస్సు, మట్టికొట్టుకు పోయివుంది. విశాల ఫాలభాగంగల ఆ కుఱ్ఱాడు, ఆరోగ్యంగా వుండివుంటే, యెంతో ముచ్చటగా, మురిపెంగా వుండే వాడనిపిస్తోంది, చూసేవాళ్ళకి. ఇప్పుడు వాడి ఆకారం చూస్తేనే జాలిపుడుతుంది. శరీరంమీద ఆచ్ఛాదనం లేదేమో, కేవలం అస్థిపంజరమే అగుపిస్తోంది. 'కేర్' 'కేర్' మంటున్నా, అది చాలా హీనస్వరంతో వినవస్తోంది. ఏడవడానికయినా శక్తి లేనట్టుంది వాడి స్థితి చూస్తే. వాడి పొట్ట మీద నయాపైసంత పుట్టుమచ్చ కొట్టొచ్చినట్టు కనిపిస్తోంది.

ఆ పసివాడి స్థితి, నాకెంతో జాలి కలిగించింది. అంత చక్కనివాడు, ఇంతిలావుండి, చూసేవాళ్ళకి మురిపెం కలిగించే ఆ వయస్సులో తల్లిని పోగొట్టుకుని, క్షీణించిపోతున్నందుకు, యెవరికయినా సానుభూతి కలుగుతుంది. ఎంత జాలిపడినా, యెన్ని అనుకున్నా చెయ్యగలిగింది యేముంది గనుక? జేబులోంచి ఓ పదిపైసల బిళ్ళతీసి, ఆ గుడ్డ మీద పడేశాను. కనీసం, ఆ పదిపైసలు పసిపాపకు అవసరమయ్యే పాలు కొనేందుకు, ఒకభాగంగా ఉపయోగపడొచ్చు నన్న తృప్తి నాలో మిగిలింది. ఆ తృప్తితో మార్కెట్టు లోపలికి నడిచాను. ఆ పసివాడి దీనావస్థ, నా కళ్ళల్లో యింకా మెదుల్తూనే వుంది. ఇటువంటి దురదృష్టవంతులు యింకెంతమంది వున్నారో ననిపించింది.

కూరగాయలు కొనుక్కుని తిరుగు ముఖం పట్టాను. గేటుదగ్గర పెద్ద గుంపు గుమిగూడి వుంది. ఏం జరిగి వుంటుందో, అర్థంకాలేదు. ఒక అనుమానం మాత్రం నా అంతరంగంలో మెదిలింది—ఆ పసి పాప ప్రాణం వదిలాడో యేమోనని! అదీ అయ్యిండొచ్చు. వాడి పరిస్థితి అట్లాగేవుంది. అప్రయత్నంగా నా నడ కతో వేగం హెచ్చింది. గుంపు దగ్గరికి చేరుకున్నాను.

"ఏమయ్యిందండీ?" అక్కడ చేరిన ఓ వ్యక్తిని అడిగాను, అతృతను ఆపుకోలేక.

అతడు భారంగా ఓ నిట్టూర్పు వదిలి యిలా చెప్పాడు:

"ఇంకేమవుతుందండీ? కాలమహిమ. మనిషిలో మానవత్వం నశించిపోతే యిట్లాంటి సంఘటనలే జరుగుతయ్. ఎవడో ఓ దొంగవెధవ, అభం శుభం యెరగని ఓ పసికందును దొంగతనంగా యెత్తుకొచ్చి, వాణ్ణి అస్థిపంజరం చేసేసి వాడికి తల్లిపోయిందని, పాలులేక అలమ టించిపోతున్నాడని, దొంగ యేడుపు యేడుస్తూ, మనలాంటి వాళ్ళందరి సానుభూతిని చూరగొంటూ, నాలుగు డబ్బులు గడించి, వాడి పొట్ట నింపు కుంటున్నాడు మనకేంతెలుసు, యిందు లోని రహస్యం? పసివాడిపట్ల జాలితో, మనకి తోచింది ధర్మం చేస్తున్నాం. కాని, అన్యాయంచేసి యెన్నాళ్లు మనందరి కళ్లూ మూయగలడు చెప్పండి? పసివాడి అదృష్టవశాత్తూ, ఆ పసిపాప తల్లి దండ్రులు, పాప అన్వేషణలో ఊరూరూ తిరుగుతూ, ఈ ఊరొచ్చారు. ఆ దొంగ పాపం పండింది గాబట్టి, వాళ్ళు మార్కె ట్టుకి రావడం తటస్థించింది.ఆ పసివాణ్ణి ఈ నరరూప రాక్షసుడు ఎంతగా ఆకలితో మాడ్చేసి అస్థిపంజరం చేసినా కన్నతల్లి తనకొడుకుని యిట్టే పసి గట్టింది. అదిగో చూడండి, ఆ తల్లి ఆ పసివాణ్ణి యెలా హృదయానికి హత్తు కుందో!"

అంతా విని ఆశ్చర్యపోయాను. నా కింక వినే ఓపిక లేకపోయింది. గుంపును చీల్చుకుని, లోపలికి వెళ్ళాను. క్షణం క్రితం వరకూ ప్రాధేయపూర్వకంగా ధర్మం చెయ్యమని అర్థిస్తూవుండే ఆ బక్కపలుచని దొంగవెధవను, ఒకాయన పట్టుకుని ఎడాపెడా వాయిస్తున్నాడు. ఆ ప్రక్కనే ఓ యువదంపతులు నిల్చుని వున్నారు. ఆ స్త్రీ పసిపాపను హృదయానికి హత్తుకుంటూయేడుస్తోంది. ఆ దృశ్యంచూసి నా మనస్సు మంచు ముక్కలా కరిగిపోయింది.

"పొట్టమీద పుట్టుమచ్చ వుండటం యెంతో వుపకరించిందండీ. లేకుంటే, మా బాబు మాకు శాశ్వతంగా దూర మయ్యేవాడేమో. వాణ్ణి ఆకలితో మాడ్చి, రూపాన్నే మాడ్చేశాడీ రాక్షసివెధవ.." కసిగా అన్నాడు, పసిపాపతండ్రి, ఒక ముసలివ్యక్తితో

"నిజంగా మీరు అదృష్టవంతులేనండీ, లేకుంటే, మీరు యీ ఊరు రావడ మేమిటి, వడిగా మార్కెట్టుకి రావడ మేమిటి, మీ పసివాడు హఠాత్తుగ అగు పించడమేమిటి? అంతా దైవసంకల్పమే అనుకోండి ఇంతకీ ఈ దొంగవెధవ మీవాణ్ణి యెలా తస్కరించాడండీ?" ప్రశ్నించాడా ముసలాయన

"అదే మాకూ అర్థంకాలేదండీ ఎల్లప్పుడూ మావాణ్ణి ఇంట్లోనే వుంచే వాళ్ళం మా ఆవిడో, లేక మా పని మనిషో, దగ్గరుండేవారు ఏ పరిస్థితుల్లో వీడెత్తుకెల్లాడో, మా ఊహకి అందని విషయమయ్యింది," అన్నాడా తండ్రి

"ఆ విషయాన్ని వీడినోటనేచెప్పిద్దా మండీ" అంటూ, దొంగను పట్టుకుని వున్న వ్యక్తి, వాడి పొట్టమీద బలంగా ఓ గుద్దు గుద్దాడు

"అమ్మో! చచ్చాను బాబోయ్" బాధతో మూలిగాడు దొంగ

"చెప్పరా వెధవా, ఈ పసివాణ్ణి యెలా దొంగిలించావు?" అన్నాడు వాణ్ణి పట్టుకున్న వ్యక్తి.

ఆ దొంగ, చెప్పకుండా వుంటే,తన ఒళ్ళు హూణంఅవుతుం దనుకున్నాడు గామోసు, వుపేక్షించకుండా చెప్పేశాడు

"పనిమనిషి, యీ పసివాణ్ణి ఆడి స్తోంది బాబూ, చుట్టుప్రక్కల యింకె వ్వరూ లేరు దగ్గరగావెళ్ళి దాహమే స్తోంది, మంచినీళ్ళు కావాలన్నాను పని మనిషి లోపలికెళ్ళిందండీ, పసివాణ్ణి వదిలేసి అంతే! పసివాణ్ణి తువ్వాళ్ళో చుట్టి, నాదారిననేను వచ్చాను, పరుగు నడకల్తో ఇంకెక్కడా ఆగకుండా, ఆ ఊర్నించే బయటపడ్డాను కడుపు నింపు కోడానికి మరో మార్గంలేక, ఈ దారి పట్టాను బాబూ మరెప్పుడూ యిటువంటి పని చెయ్యనండీ!" ప్రాధేయ పూర్వ కంగానే అన్నాడు వాడు

"నీ కడుపు నింపుకోడానికి, యింతటి నీచపుపనికి పూనుకున్నావురా వెధవా! తలిదండ్రుల్నుంచి ఈ పసికందును వేరు చెయ్యడానికి, నీ కెట్లా మన సొప్పిందిరా?" అంటూ మరోటి చెంప మీద తగిలించాడు, ఆ వ్యక్తి

అన్నింటికీ సిద్ధపడినవాళ్ళు,యెన్ని దెబ్బలుతిన్నా, వాళ్ళకి లెఖ్ఖేవిఁటి? ఇటు వంటి దెబ్బలు అంతకు ముందెన్ని తిన్నాడో, యేవిఁటో!

"ఈ రాక్షసుడి దగ్గర యిటువంటి పసిపాపలు యింకెంతమందున్నారో అడగండి ముందు..." అక్కడున్న మరో వ్యక్తి అన్నాడు అతనికి ఆ సందేహం రావడం సబబుగానే వుంది మరి

"చెప్పరా వెధవా! ఇటువంటి పసి పాపలు నీదగ్గర యింకా యెంతమంది న్నారు? నిజంచెప్పకపోతే, యిక్కడే నీ ప్రాణాలు తీస్తాను" అంటూ పెద

రెక్కలు విరిచి, వీపుమీద బలంగా ఓ గుద్దుగుద్దాడు మళ్ళీ ఆ వ్యక్తి.

"బాబోయ్ చచ్చాను..." యేడుస్తూ అన్నాడా దొంగ.

"చావడానికి యింకా టయిముందిలే. ముందు చెప్పు, యెంతమంది వున్నారో?"

"నాదగ్గరింకెవళ్లూ లేరండీ. నిజం చెప్తున్నాను. ఇంతకుముందో పసివాడు వుండేవాడు..."

"వాణ్ణీ యిట్లాగే తీసుకొచ్చావా?"

"ఔను బాబూ!"

"వాడిప్పుడెక్కడున్నాడు?"

దొంగ చప్పున సమాధానం చెప్ప లేదు. సమాధానం చెబితే యేమవుతుందో వాడికి తెలుసు. అందుకే ఆపాద మస్తకం వణికిపోతూ, మౌనంగా వుండి పోయాడు.

"చెప్పవేంరా రాస్కెల్?" చెంప చెళ్ళుమంది.

దొంగకి కళ్ళు చిమ్మ చీకట్లు క్రమ్మినయ్ చెప్పకతప్పదనుకున్నాడు.

"ఇప్పుడు లేడుబాబూ, చచ్చి పోయాడు." మెల్లగా చెప్పాడు.

పసిపాపను యెత్తుకునివున్న ఆ తల్లి గుండెలు ఝల్లుమన్నయ్. బహుశా తాము ఈరోజు తమ బిడ్డని చూసి వుండకపోతే, వీడిగతీ అంతే అయ్యుండే దేమో ...... అనుకుంటూ, అలా వూహించడానికే భయపడింది.

"ఏంరా? నువ్వు బ్రతకడంకోసం, నీ పొట్టనింపుకోవడంకోసం, ఆ పసివాణ్ణి ఆకలితో చంపావు, అంతేనా! నిన్నేం చేసినా పాపంలేదురా దుర్మార్గుడా!" అంటూ ఎడాపెడా మళ్ళీ వాయించాడు, వాణ్ణి పట్టుకున్న వ్యక్తి.

అంతా వింటున్న ఇక్కడ చేరిన వాళ్ళందరికీ ఆ దొంగ వెధవఅమానుషపు చర్యకు, వాడి మీద వల్లమాలిన వుక్రోషం వచ్చింది. అందరికళ్లూ వాడ్ని కేసి ఎర్రగాచూశాయి. నాకూ కోపం వచ్చింది. ఇంత అమానుషమైన పని చేసిన ఆ దొంగవెధవను క్షమించకూడ దనిపించింది.

"ఇటువంటి క్రూరమైన పనులు యింకెప్పుడూ చెయ్యకుండాజ్ఞాపకంవుండి పోయేలా కీళ్ళు విరిచేయాలి" అన్నాను తమాయించుకోలేక.

"కొట్టండి ..తన్నండి..." అంటూ అక్కడ చేరిన వాళ్ళంతా తలో చెయ్యి వాడిమీద వేశారు.

'అమ్మో' 'బాబోయ్' అంటున్నాడు. అంతలోనే అక్కడికి యిద్దరు రక్షక భటులొచ్చారు. "ఏమయ్యింది?" అంటూ.

అంతా విన్నాక, ఆ దొంగవెధవను పెడరెక్కలు విరిచికట్టి, "మీరుకూడా పోలీస్ స్టేషనుకు ఓ సారి రావాలి సార్. అక్కడ స్టేట్ మెంటు తీసుకుని పంపి వేస్తాం," అంటూ ఆ పసివాడి తలి దండ్రులతో చెప్పారు.

"పదండి..." అంటూ పసివాడి తండ్రి ముందుకుసాగాడు. పసివాణ్ణి యెత్తుకున్న తల్లి భర్తను అనుసరించింది.

దొంగవాణ్ణి రక్షకభటులు తీసుకుపోయి వాన్‌లో యెక్కించారు. తలిదండ్రులుకూడా వాన్ ముందు సీట్లో కూచున్నారు. వాన్ కదిలింది.

"చాలా అదృష్టవంతులు. పోయిన పిల్లాడు దొరికాడు..." అన్నాడు ముసలాయన.

"గొప్ప అదృష్టవంతులండీ! ఈ రోజు వాళ్ళు చూడకపోతే, ఆ పసివాడు వాళ్ళకి శాశ్వతంగా దూరమయ్యేవాడు. పాపం, యిన్ని రోజులు ఆ తలిదండ్రులు అనుభవించిన ఆవేదన తల్చుకుంటే, బాధనిపిస్తోంది. అయినా, రోజులు యెంత చిత్రంగా మారిపోతున్నాయో చూడండి. క్రమంగా మానవత్వం నశించిపోతోంది. రాతియుగంనాటి మనుష్యుల కంటె అనాగరికంగా యీనాటి మనుష్యులెందుకు తయారవుతున్నారో, వూహకందడంలేదు" అన్నాను

"మనిషిలో స్వార్థం, సోమరితనం పెరిగిపోతూ వుంటే, యిటువంటి అనర్థాలే కలుగుతాయండీ!" అన్నాడాకాయన.

ఒక్కొక్కరూ అక్కణ్ణించి జారుకున్నారు. నేనూ ఇంటికేసి బయల్దేరాను. నాకింకా ఆ పసివాడి ఆకారం గుర్తుకొస్తూనేవుంది. ఆ దొంగవెధవ ప్రాథేయపడ్డం, యింకా చెవుల్లో గింగురుమంటూనేవుంది. ఎవర్ని నమ్మడం? ఎవర్ని శంకించడం! ఏది నిజం? ఏది అబద్ధం?... ఎలా తెలుసుకోవడం?" అన్న ప్రశ్నలు నాలో ఉదయించి, వుక్కిరిబిక్కిరి చేశాయి.

అప్పట్నుంచి, అటువంటి వాళ్ళెవరు అగుపించినా, నాలో యేదో అనుమానం పీకుతూనే వుండేది. కాని, యేంచెయ్యడం? అనుమానంతో, అందర్నీ నిలవేసి అడగలేంకదా? అయితే, అటువంటి వాళ్ళను చూసినపుడు, సానుభూతి ప్రకటించడం మానేసాను. అదే నేను చెయ్యగలిగింది మరి!



# జ్ఞానంగల కుక్క

(గల్పిక)

సార్వభౌమరావుగారి దగ్గిర ఒక కుక్క ఉండేది. అది అన్నిప్పుడల్లా మొరిగేదికాదు. నేరస్థులనూ, జైలుకు పోయివచ్చినవాళ్లనూ చూస్తే మాత్రమే మొరిగేది. చివరకు, ఈ విషయం ఎన్ని దజన్లసార్లు రుజువయిందంటే, అది ఎవర్ని చూసి మొరిగితే వాళ్ళు నేరస్థు లయిఉండాలని అందరూ నమ్మే స్థితికి వచ్చారు.

"అది దైవాంశగల కుక్కేమో నండీ, సార్వభౌమరావుగారూ ?" అన్నారు కొందరు. "ఏమో చెప్పలేం!" మన స్తత్వంవాళ్లు.

సార్వభౌమరావు అంతదూరం వెళ్ళ లేదుగాని, "శాస్త్రజ్ఞానానికి అందని విషయాలు జీవితంలో చాలా ఉన్నాయి," అన్నాడు.

సార్వభౌమరావుగారంటే పదవిలేని ప్రభువు, మకుటంలేని మహారాజు. మంత్రులు కూడా ఆయనతో రాచ కార్యాలు జరిపేవారు.

ఒకరోజు ఒక మంత్రిఅంతటివాడు సార్వభౌమరావు గారింటికి వచ్చాడు. కుక్కకు ఆయన ముఖం—లేక వాసన— కొత్తకాదు. కాని ఎందుకో ఈసారి కుక్క ఆయన్ను చూడగానే మొరిగింది.

మంత్రిగారి ముఖం ముందు తెల్లగా అయి, తరవాత ఎర్రగా అయింది.

"ఏమిటిది ? ఇదేమిటి ?" అన్నాడాయన.

"దాని సంగతి నేను చూస్తాను. మీరు పట్టించుకోకండి. మీకు క్షమా పణలు చెప్పుకుంటాను," అని సార్వభౌమరావు కుక్కను ఆ రాత్రి తన పిస్తోలుతో కాల్చి చంపాడు.

ఇటీవల బయటపడింది. ఆ మంత్రి గారు సార్వభౌమ రావింటికి వచ్చే ముందు వారంరోజులక్రితం తన నౌకరు కుర్రాణ్ణి చంపి, పోలీసులచేత అడవిలో నక్సలైట్ శవాలమధ్య పారేయించి, "ఈ నక్సలైట్లు ఇక్కడ ఉండరూ అని చెప్పలేంగద !" అని అందరితోనూ అన్నాడు.

ఏమైన అలా దుర్మార్గాన్ని పసిగట్ట గల కుక్కలు – మనుషులు కూడా – పోతేనే మంచిదని ఉన్నత వర్గాలవారి అభిప్రాయం.

---

కొడవటిగంటి కుటుంబరావు




ఆకాశం గాఢ పరిష్వంగంలో మైమరచి యెర్రకన్ను మూసి పచ్చకన్ను తెరిచింది రైల్వే సిగ్నల్. ట్రెయిన్ సుషుప్తినుండి మేల్కొని గమ్యం వెతుక్కుంటూ పరుగెత్తింది. రైలు ఆఖరి డబ్బామీద యెర్రలైటు శివుని త్రినేత్రంలా వెలిగి, క్రమంగా చిన్నదై, క్షణంసేపు చుక్కగా కనిపించి మలుపులో మాయమైపోయింది. అర్ధ రాత్రి అయినా స్టేషన్ అభిసారికలా లైట్లకాంతిలో వెలిగింది. ప్లాట్‌ఫారం సద్దు మణిగింది.

**సరిగ్గా ఉదయం ఆదే ప్లాట్‌ఫారం** మీద యిద్దరు చెల్లెళ్ళను సాగనంపాను, ఒకర్ని స్వంత యింటికి, యింకొకర్ని అత్తవారింటికి. పెళ్ళిసందడి అప్పటితో అయిపోయింది. యింట్లో నేనొక్కడ్నే యేకాకిగా మిగిలాను. అంతమంది

జనాళిలో కూడ చెప్పలేనంత వెలితి, తెలియని భయంకరమైన వంటరితనం. జీవితంలో వున్న గమ్మత్తు అదే. క్రిందటి రోజుదాక యేదో నైతికభారం వుందని తపన. ఈ రోజు యేమీలేదని వేదన. అది మానవ నైజం. జీవితంలో యేదో పరమావధి వుండాలి. లేకపోతే సృష్టి అక్కడితోనే అంతం. నేను స్టేషన్‌కి యెందుకు వెళ్ళానో నాకే అర్థంకాలేదు. కాళ్ళు యాంత్రికంగానే తీసుకువెళ్ళాయి. అక్కడ తచ్చాట్లాడుతున్నవాళ్ళు నాకు చాలమంది తెలుసు. చాలమంది చిన్నప్పుడు "వొరేయ్" అని పిలిచినవాళ్ళున్నారు కాని యిప్పుడు ముఖం తప్పించేస్తున్నారు. నేను ప్రయోజకుడినై హోదాలో వున్నానట. తీయని చిన్ననాటి ముచ్చట్లు వాళ్ళతో ముచ్చటించాలని మనసు తహతహలాడింది. యిద్దర్ని పట్టుకుని మాట్లాడాలని చూసాను. కాని మధ్యలో యెన్నో యోజనాల అగాధం. చిలక పలుకులు పలికి దాటిపోయారు. యేమిటో యీ అంతర్యాలు, అంతా డబ్బులో వుంది, అదే మహత్తు. అదే మహాశక్తి. యింటికి దారితీసాను.

నక్షత్రకోటి ఆకాశాన్ని తోరణాల్లా అలంకరించాయి. ఆ తోరణాలలో దోబూచులాడుకుంటూ స్ఫుటిన్నకు రోదసీ విహారంలో పరుగులుతీసింది. మెల్లగా రిక్షావాళ్ళ బెడద తప్పించుకుని రోడ్డు మీదికి వచ్చాను. వెన్నెలరాత్రిలో రోడ్డు మెలికలు తిరిగి నిద్రిస్తున్న నల్ల త్రాచులా కనిపించింది. నేను యిప్పుడు ఢిల్లీ మనిషిని. పాలెం విడిచి అయిదు సంవత్సరాలయింది అమ్మ కూతుళ్ళ పెళ్ళిళ్ళు చూడకుండానే కళ్ళుమూసింది. ఉన్న భూమి అమ్మి యిద్దరి పెళ్ళిళ్ళు అయిందనిపించాను. యిక నాకు మిగిలిన బంధం యేమిటి మిగిలింది యిల్లు ఒక్కటి. మరి సావిత్రి! యెవరో ఛెళ్లున చెంపకాయ కొట్టినట్లు అయింది. యీ తప్పిదానికి నేనే నొచ్చుకున్నాను. సావిత్రి ఒక్కతే చాలు నన్ను పాలెం పరుగెత్తించటానికి. మా యిద్దరి జీవితాలు చిన్నప్పట్నుంచి పెనవేసుకుపోయాయి. సావిత్రి నాలోనే వుంది. నా గుండెల్లో, రక్తంలో, ప్రతి అణువులోనూ వుంది. అందుకే సావిత్రి గుర్తుకు రాలేదు.

అంతలో చిరువాగు వచ్చింది. దానిమీద చెక్కవంతెన దాటి అవతలకు నడిచాను. ఈ వంతెన యింతకుముందు లేదు. అది పాలెం ప్రగతికి చిహ్నం. ఆ వాగు నాకు యెంతో యిష్టం. సావిత్రిని యెప్పుడూ ఆ వాగు దాటించేవాడిని. ఆ రోజుల్లో సావిత్రి యెంత సన్నిహితంగా వుండేది. ఆ తర్వాత నేను పై చదువులకు వెళ్ళిపోయాను కాని సావిత్రి మా కుటుంబంలో ఒక సభ్యురాలిగా మెలిగేది. సావిత్రి అంటే

అమ్మకు పంచప్రాణాలు. అమ్మ సావిత్రిని కోడలుగా తెచ్చుకుందా మను కుంది కాని ఆ అదృష్టం నోచుకోలేదు. అదే జీవితంలోని గమ్మత్తు. శ్రమించి ప్రతి అణువు కుటుంబంకోసం ధార పోసింది. కాని ఫలితం చూడలేక పోయింది. అమ్మ మనోధైర్యం నన్నింతవాడిని చేసింది. సావిత్రి యిప్పుడు నన్ను తప్పించుకు తిరుగు తుంది. పెళ్ళిలో పెద్దరికం అంతా తనే చేసింది. ఈ అమ్మాయికి యింకా పెళ్ళి కాలేదూ అని అమ్మలక్కలు దడవలు నొక్కుకున్నా లెక్కచెయ్యలేదు. విమల వెళ్తుంటే బావురుమంది. అవును మరి యిరువయ్యేళ్ళ సహవాసం. వాళ్ళు బంధువులు కాకపోయినా అంతకు మించిన ఆత్మీయత వుంది. సావిత్రి తల్లిదండ్రులను మేమంతా అత్తయ్యా, మామయ్యా అని పిలుస్తాం. అత్తయ్య కూడ సావిత్రి సంగతి యెత్తలేదు. వాళ్ళు సావిత్రి పెళ్ళికి ప్రయత్నం చెయ్యటంలేదుకదా. నేనే సావిత్రిని పెళ్ళిచేసుకుంటే, ఆ మధురభావానికి మనసు పులకించింది. నాకు బాదరబందీ లేదు నెలకు తొమ్మిదివందలు జీతం. సావిత్రి నివ్వటానికి మామయ్యకు అభ్యంతరం వుండదు. మామయ్యదగ్గర డబ్బులేదు. ఆయనకున్నదల్లా అయి దెకరాల భూమి, యిల్లు. అది యిద్దరి ఆడపిల్లలను సాగనంపేటప్పటికి హారతి కర్పూరంలా అయిపోతుంది. సావిత్రి విషయం తన కెందుకు తట్టలేదు. సావిత్రి యింకా మా యింటినే అంటి పెట్టుకు తిరుగుతుంది. ప్రతి వస్తువు లోను సావిత్రి స్పర్శ వుంది. అమ్మ వుంటే ఈపాటికి సావిత్రికీ నాకూ పెళ్ళి అయిపోయేదే. విమలకూడ పెళ్ళి హడా వుడిలో సావిత్రి ప్రసక్తి తేబోయింది కాని కుదరలేదు. నాకు ముప్పయ్యోపడి వచ్చేసింది. సావిత్రికి పాతిక సంవత్స రాలు. గ్రామీణ జీవితంలో అది చాల పెద్ద వయసు. రేపు పెళ్ళివిషయం తేల్చుకోవాలి. సావిత్రి నా సహధర్మ చారిణి అయితే రాజ్యాలే జయిస్తాను. అన్నట్టు యీ మధ్య మునసబు కుటుంబ రావు నా చుట్టూ తిరుగుతున్నాడు. కారణం యేమిటో? కూతుర్నిస్తా ననడు కదా. యేమో చెప్పలేం. ప్రపంచం అలాంటిది. దూరంగా యిల్లు అందంగా తెల్ల పైట కప్పుకున్నట్టు వెన్నెలలో మిలమిల మెరిసింది. అప్పుడు తట్టింది, మధ్యాహ్నం భోజనం చెయ్యలేదని. రాత్రికూడ లేనట్లే. అత్తయ్య భోజనం వండి వుండవచ్చు. చెప్పలేం. అత్తయ్య కూడ మారిపోయింది. ఇంటి గొళ్ళెం తీసి లోపల అడుగుపెట్టాను. అంధ కారంగా వుంటుందని అనుకున్న యింట్లో దీపం వెలుగుతుంది. దీపం సావిత్రిలా అందంగా కనిపించింది. నేను బెడ్‌రూంలోకి వెళ్ళగానే యెదురుగా

రెండు పళ్ళాలు మూతలు పెట్టి వున్నాయి. పక్కగా నీళ్లు కనిపించాయి. అంత ముందు పెట్టకపోతే నేను చూడనని అనుకుని వుంటుంది పిచ్చి సావిత్రి. సావిత్రి వచ్చి యెదురుగా కూర్చుంటే యెంత బాగుండు ననిపించింది. అయినా సావిత్రి యెలా వస్తుంది. యిప్పటికే అమ్మలక్కలు సూటి, పోటి మాటలు అంటూనే వున్నారు. బాత్‌రూంలోకి వెళ్ళి కాళ్లు, చేతులు కడుక్కుని తర్వాత భోజనం కానిచ్చాను. కిటికీలోంచి అత్తయ్య, మామయ్యల మాటలు వినిపిస్తూనే వున్నాయి.

"అమ్మా, బావ వచ్చినట్టున్నాడు" అంది సావిత్రి.

"ఎన్నిసార్లు లేపుతావే నన్ను. ప్రతి చప్పుడు మీ బావలాగే వుంది నీకు. ఆ పట్నవాసం ఆయనకు నువ్వున్నట్లే తెలియటంలేదు. యెందుకు అంత పాముకోవటం" అంది అత్తయ్య కోపంగా.

"నేను చేసింది యేముంది" అంది సావిత్రి కోపంగా.

"యింకేం చెయ్యాలి. పెళ్ళికావలసినదానివి పరాయి మగవాడి ముందుకు వెళ్ళవచ్చా అని. యెదిగిన పిల్లవు నీకు నేనేం చెప్పను. లోకం కోడై కూస్తుంది."

"బావ పరాయివాడా ?" సావిత్రి గొంతులో ధైన్యం కనిపించింది.

అత్తయ్య క్షణం మౌనంగా వుండి పోయి "వెర్రిబాగులదానివి. నీకెలా అర్థం అవుతుంది. అతను నిన్ను పెళ్ళి చేసుకోడు. మీ అత్తయ్య పోయిననాడే నాకు అనుమానం వచ్చింది. యెవర్నని యేంలాభం. ప్రపంచం అటువంటిది. యెంత పైకి వెళ్ళినా యింకా యెగ బ్రాకాలని వుంటుంది. యివాళ యేమయినాసరే అడుగుదా మనుకున్నాను. అంతలో మునసబుగారి పెళ్ళాం చల్లగా చెప్పింది. వాళ్ళ అమ్మాయి నిచ్చి పదిహేనువేలు అర్పించుకుంటారట. అబ్బాయి సుముఖంగా వున్నాడట. యింకా ఆశ వుందా తల్లీ" అంది రుద్ధకంఠంతో.

"నేను యెప్పుడూ ఆశ పెట్టుకో లేదమ్మా. బావ యెవర్ని కావాలంటే వాళ్ళనే పెళ్ళిచేసుకుంటాడు. అందుకు బాధపడవలసింది లేదు "

"అవును, మరి నడ్డివిరిగేలా చాకిరీ యెందుకు చేస్తున్నావు? బావ వచ్చాడని పదహారుసార్లు యెందుకు చెప్పావు?"

ఈసారి జవాబులేదు. అడుగుల సవ్వడి, ఆ తర్వాత గొళ్ళెం తీసిన చప్పుడు అయింది. సావిత్రి యింట్లోకి వెళ్ళిపోయిందని అనుకున్నాను నా మూలంగా ఆ యింట్లో అంత గందరగోళం జరుగుతుందని అనుకోలేదు.






Jayadev

పిచ్చి సావిత్రి యెంత బాధపడుతుందో! ఆ క్షణంలోనే వెళ్ళి చెబుదామనుకున్నాను.

అంతలో అత్తయ్య తిరిగి "చూడండి యెంత పిచ్చి పిల్లో. బావ రాలేదట. అన్నం తినకుండా కూర్చుంది. రేపు అతగాడు యెవర్నో పెళ్ళిచేసుకోవటం తప్పదు, దీనికి పిచ్చి యెక్కక తప్పదు" అంది.

జవాబుగా మామయ్య చుట్ట అవతల పారేసి మంచంమీదకు ఒరిగాడు.

నా మనస్సు వికలమైపోయింది. సావిత్రి అంత బాధపడుతుందని అనుకోలేదు. యేమయినాసరే రేపే పరిష్కారం చెయ్యాలనుకున్నాను. రాత్రి నిద్రపట్టలేదు. సావిత్రికూడ నిద్రపోయి వుండదని అనుమానం. తెల్లవారుజామున యెప్పుడో నిద్రపట్టింది.

ఉదయం లేచేటప్పటికి యేడుగంటలయింది బయటకు వెళ్ళి దంతధావనం చేసుకొని యింటికి వచ్చేటప్పటికి గదిలో ప్లేట్లు చప్పుడు వినిపించింది. యేమయినా సావిత్రితో మాట్లాడాలనుకున్నాను. అంతలో వెనుకనుంచి కుటుంబరావుగారి మాట వినిపించింది.

"యేమిటి తీరిగ్గానే వున్నావే. అవును పనులన్నీ సవ్యంగా చేసేసావు" అన్నారు.

"రండి, యిలా కూర్చోండి" అని అన్నాను.

కుటుంబరావు తీరిగ్గా యీజీఛైర్‌లో కూర్చుని కాసేపు చుట్టను పరీక్షించి, కాలుతున్నదాన్నే తిరిగి వెలిగించటానికి ప్రయత్నించి "నీతో చిన్న విషయం మాట్లాడదామని వచ్చానోయ్. యిప్పుడు నీకు అన్ని బాధ్యతలు తీరిపోయాయి.

పెళ్ళిచేసుకోవాలనే ప్రయత్నం లేదేమిటి. నువ్వు ఊఁ అను. మా సౌధామినిని యిచ్చి పెళ్ళిచేస్తాను. అమ్మాయి మెట్రిక్ పాసయింది. కట్నం పదిహేను వేలు యిస్తాను. చిన్నవాడివి నీతో మాట్లాడవలసిన విషయం కాదనుకో. మరి యింక వెనుక యెవ్వరూ లేరుగా."

నేను మౌనంగా వుండిపోయాను. యీ ప్రళయం యింత తొందరగా వస్తుందని అనుకోలేదు.

"యేమిటి నీ అభిప్రాయం?" అని తిరిగి ప్రశ్నించారు.

"క్షమించండి. నా పెళ్ళి చిన్నప్పట్నుంచి అనుకుంటున్నదే. నేను సావిత్రిని పెళ్ళాడుతున్నాను" అన్నాను.

"యేమిటి, రాఘవరావు కూతుర్నా? కట్నం కాసుకూడ రాలదు."

"నాకు కట్నం అక్కర్లేదండి."

"ఆ అలాగే అంటావు. పదిహేను వేలు యీ జన్మలో పోగుచెయ్యగలవా?"

"డబ్బు అక్కర్లేదండి. నాకు కావలసింది మమత, ఆప్యాయత. అవి సావిత్రిలో వున్నాయి. వీటిని నేను కొనుక్కోలేను."

కుటుంబరావు క్షణం నివ్వెరపోయి "భలేవాడివి. అయితే అది నిజమేనన్నమాట. నీకూ సావిత్రికీ సంబంధం వున్నదని ఊరంతా అంటుంటే నమ్మలేదు" అన్నాడు కసిగా.

"మీ భాష నాకు అర్థంకాదు. యేదో మీలాంటి పెద్దలు వూసుపోక రమ్యంగా కథలు అల్లుకుపోతుంటారు. యింత వరకు నాకూ, సావిత్రికీ మధ్య అను బంధంమాత్రమే వుంది" అన్నాను తియ్యగా.

"తీరిగ్గా ఆలోచించు. తొందర పడకు."

"ఆలోచించవలసిన అవసరం లేదండి. మళ్ళీ మీరు శ్రమతీసుకోవల సిన అవసరంలేదు."

కుటుంబరావు పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ వెళ్ళిపోయాడు.

నేను క్షణం స్తబ్ధుడిగా నిల్చుని, సావిత్రి గుర్తుకువచ్చి పక్కగదిలోకి వెళ్ళాను. సావిత్రి సజలనేత్రాలతో, వెక్కి వెక్కి యేడుస్తూ కనిపించింది. నా కళ్ళు చెమ్మగిల్లాయి.

"జరిగింది విన్నావా ?" అని అడిగాను.

సావిత్రి కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ, అవునని తల ఊపింది.

"అయితే పెళ్ళి నీకు యిష్టం లేదా?" అన్నాను.

సావిత్రి క్షణం తెల్లబోయి చూసింది. తర్వాత మెల్లగా "యీ శుభ ఘడియకోసం అహోరాత్రాలు యెదురు చూస్తున్నాను" అంది.

"మరి యీ కన్నీళ్లు?"

"ఇవి ఆనందం బాష్పాలు. పాలెం అంతా కాకులు పొడిచినట్లు పొడిచి నన్ను



చిత్రవధ చేసారు. నాకు విముక్తి కలిగించావు. నువ్వు దేవుడివి" అంది. ఆమెలో వుద్వేగం అవధులు దాటింది.

"క్షమించు సావిత్రీ. నీ బాధ నాకు తెలియదు. మీరెవరూ చెప్పలేదు. నా బాధ్యతలు యిప్పుడు తీరాయి. నీకు అభ్యంతరం లేకపోతే పదిరోజుల్లో పెళ్ళి, ఆ తర్వాత ఢిల్లీ ప్రయాణం" అన్నాను.

సావిత్రి కళ్ళలో తారకలు కనిపించాయి.

నేను ముందుకి వెళ్ళి సావిత్రిని నా చేతుల్లోకి తీసుకున్నాను. సావిత్రి నా చేతుల్లో యిమిడిపోయి బావురుమంది.

"ఊరుకో సావిత్రీ. యిప్పుడే మయింది."

"నా బాధ నీ కర్థంకాదు బావా. యిది అయిదు సంవత్సరాలనుండి బిగబట్టుకున్న దుఃఖం" అని కన్నీళ్ళు తుడుచుకుని "యిప్పుడు గుండె తేలికయిపోయింది. వెళ్ళి ఊరంతా చాటి వస్తాను" అంది శుష్కంగా నవ్వుతూ

"బదులు తీర్చుకోవాలనా. యెంత ఆశ. యీపాటికి కుటుంబరావు సగం ఊరికి చెప్పి వుంటాడు" అన్నాను.

"అయితే అమ్మకు చెప్పి వస్తాను."

"అలా అని పారిపోదామనా?"

"నేను నీ దగ్గరినుండి పారిపోలేను బావా. నా హృదయంలో దేవుడిలా నిలిచావు. నేను యెక్కడున్నా నాలోనే వున్నావు" అని చేతులు మెడ చుట్టూ వేసింది.

నేను సావిత్రి కళ్ళల్లోని కాంతి పుంజాలు చూస్తూ మైమరచిపోయాను.

## అరేబియన్ నైట్స్



# దరిద్రుడింట దాసి-1

ఒకప్పుడు ఖురాసాన్‌దేశంలో ఒక ధనిక వర్తకు డుండేవాడు. ఆతని కొడుకు అలీషార్ నవమన్మథుడు.

వృద్ధాప్యం పైనపడిన తండ్రి తనకు మరణ మాసన్నమైనట్టు గ్రహించి కొడుకుతో, "నాయనా, నేను పోబో తున్నాను. నీకు కొంత హితవు చెప్పాలి. ప్రపంచంతో బంధాలేవీ పెట్టుకోకు. ఈ ప్రపంచం కొలిమిలాటిది. అది నిన్ను తన మంటలతో దహించవచ్చు, రవ్వలతో నీ కళ్ళు పోగొట్టవచ్చు, లేదా పొగతో నీకు ఊపిరి సలపకుండా చెయ్యవచ్చు," అన్నాడు.

"నువ్వు చెప్పినట్లే చేస్తాను,

నాన్నా. ఇంకేమైనా సలహా ఇస్తావా ?" అని అలీషార్ తండ్రిని అడిగాడు.

"చేతనైనప్పుడు ఇతరులకు మేలు చెయ్యి. కాని దానినుంచి అవతలివాళ్ళ కృతజ్ఞత గాని, ప్రత్యుపకారం గాని ఆశించకు. ఇతరులకు మేలుచేసే అవకాశాలు అన్నప్పుడల్లా రావన్నది కూడా గుర్తుంచుకో. నేను నీకు ఇచ్చిపోతున్న ధనాన్ని అలాములూ. పలాములూ చెయ్యకు. డబ్బుతప్ప మనిషికి గుర్తింపు కలిగించేది మరేదీలేదు. నీకన్న హెచ్చు అనుభవంగలవాళ్ళ మాటలు పెడచెవి బెట్టకు. వివేకుల సలహాకోరటం వృథా అని ఎన్నడూ అనుకోకు. నా చివరి సలహా ఏమంటే, మద్యం ముట్టకు. అన్ని అనర్థాలకూ అదే మూలం. అది మేధస్సును హరిస్తుంది. తాగుబోతు పదిమందిలోనూ హాస్యాస్పదుడౌతాడు. నా సలహాలు పాటిస్తూ జీవించావంటే నీకు మేలు కలుగుతుంది," అని చెప్పి వర్తకుడు కన్నుమూశాడు.

మరణించిన వాడికోసం ఇంటిల్లిపాదీ కన్నీరు కార్చారు. ఆయన శవంవెంట చిన్నవాళ్ళూ, పెద్దవాళ్ళూ కూడా శ్మశానానికి వెళ్ళి, ఆయనను ఖననం చేసి, ఆయనకు సమాధికట్టి, దానిమీద "దుమ్మునుంచి పుట్టి జీవించాను, చచ్చి దుమ్ములో దుమ్మునైపోయాను," అని రాశారు.

తండ్రిపోయాక అలీషార్ అంగళ్ళ పేటలోని పెద్ద దుకాణంలో వర్తకం సాగిస్తూ, ఒక ఏడాదిపాటు తండ్రి సలహాలను తూచా తప్పకుండా పాటిస్తూ వచ్చాడు. కాని తరవాత అతను గాలికి తిరిగేవాళ్ల స్నేహాలు మరిగి, వాళ్ల రెచ్చగొట్టిన ఉద్రేకంలో వాళ్ల తల్లులనూ, చెల్లెళ్లనూ మరిగి, డబ్బు ఎడాపెడా ఖర్చుచేస్తూ హేయమైన జీవిత మార్గాన్ని అనుసరించి, ఉన్న ధనంతో తాను సుఖపడకపోతే అది మరొకరికి చెందుతుందిగదా అని అనుకున్నాడు.

ఈ వేదాంతం తలకెక్కి, అతను క్రమంగా తన దుకాణమూ, ఇల్లూ, సామాన్లూ, దుస్తులు కూడా అమ్మేసి, చిట్టచివరకు కట్టుబట్టలతో మిగిలాడు. అప్పుడుగాని అతనికి తన అవివేకం తెలిసిరాలేదు. అతని స్నేహితులంతా అతన్ని విడిచిపెట్టేశారు. అతను ధర్మసత్రంలో ఉంటూ తిండికిగాను ముష్టెత్త వలసిన దశకు చేరుకున్నాడు. ఇందుకుగాను అతను అంగళ్లప్రాంతంగుండా పోతూ, ఒక చోట జనసమూహాన్ని చూశాడు. అతను విశేషమేమిటో తెలుసుకుందామని జనాన్ని సమీపిస్తే, వర్తకులూ, దళార్లూ చుట్టూ చేరి ఉండగా, వారిమధ్య ఒక అందమైన తెల్లబానిసపిల్ల అమ్ముడుపోవటానికి సిద్ధంగా ఉన్నది. ఆమె అయిదడుగుల ఎత్తు ఉన్నది. ఆమె చెక్కిళ్లలో గులాబీలున్నాయి. ఆమె స్తనాలు పొంకం

గానూ, పిరుదులు వర్ణనాతీతంగానూ ఉన్నాయి.

ఆమెను చూసి అద్భుతం చెంది, అలీషార్ తన దుస్థితిని కూడా మరచి, అలాగే నిలబడిపోయాడు. అక్కడ చేరిన వర్తకులు, అతను చితికిపోయిన సంగతి ఎరగక, అతను ఆ బానిసను కొనటానికి వచ్చాడనుకున్నారు.

వేలం వేసేవాడు బానిసపిల్ల పక్కనే నిలబడి, "సమస్తమైన జనులూ రండి! ఈ అందాలరాశి, జుముర్రుద్‌కోసం పాడండి ఇంతకన్న అందమైన కన్య మీకు మరి దొరకదు. ఎవరైనా ఒక మాట అనండి !" అన్నాడు.

"అయిదు వందల దీనారాలు," అన్నాడొక వర్తకుడు.

"పైన పది!" అన్నాడు మరొకడు.

రషీద్ అల్ దీన్ అనే వికారాకారం గల ముసలాడు, "మరో వంద !" అన్నాడు

"మరో పది !" అన్నా రెవరో.

వెంటనే ముసలాడు, "వెయ్యి దీనారాలు !" అన్నాడు.

దానిపైన బేరం పలకలేదు. అందరూ మౌనంగా ఉండటంచూసి వేలం వేసేవాడు బానిసను అమ్మేవాడికేసి తిరిగి, "వెయ్యి దీనారాలకు బేరం పైసల్ చేసేదా ?" అని అడిగాడు.

"నా కేమీ అభ్యంతరం లేదు. అయితే ఈ బానిసను ఆమె కిష్టం లేనివాడికి విక్రయించనని ప్రమాణం చేసి ఉన్నాను. ఆమె ఇష్టం విచారించు," అన్నాడు బానిసను అమ్ముకుంటున్నవాడు.

వేలం వేసేవాడు జుముర్రుద్‌కేసి తిరిగి, "సుందరీ నువు ఈ గౌరవనీయుడైన వృద్ధుడు రషీద్ అల్ దీన్‌కు అమ్ముడుపోవటానికి సమ్మతిస్తావా ?" అని అడిగాడు.

ఆమె వికారాకారంగల ముసలాడికేసి చూసి, అసహ్యంతో మొహం తిప్పుకుని, తన అయిష్టాన్ని తెలిపింది.

"నువ్వు ఒప్పుకోకపోవటం సమంజసమే. నన్నడిగితే నీకు వెయ్యి దీనారాలు ఒక ధరే కాదు !" అన్నాడు వేలంవాడు.

తరవాత అతను జనంకేసి తిరిగి, "ఇదే ధరకు ఈమెను కొనదలచిన వాళ్లు మరెవరన్నా ఉన్నారా ?" అని అడిగాడు.

"నేను కొంటాను." అన్నా రెవరో.

జుముర్రుద్ ఆ మనిషికేసి చూసి, ఆ మనిషి రషీద్ అల్ దీన్ అంత వికారంగా లేకపోయినా, తన ముసలితనం దాచటానికి గడ్డానికి ఎర్రరంగు వేసుకున్నాడని చూసి, "ఛీ, ఛీ !" అన్నది. పైపెచ్చు ఆమె ముసలాళ్ళ మీద వెటకారంగా పద్యాలు చదివింది.

ఆమె అదే విధంగా మరొకణ్ణీ, వేరొకణ్ణీ నిరాకరించటం చూసి వేలం

వేసేవాడు, "నిన్ను కొనటానికి వచ్చిన ఈ వర్తకులనందరినీ పరిశీలించి, నువు ఎవరికి అమ్ముడుపోదలచుకున్నావో ఎన్నుకో," అన్నాడు.

జుమ్రుద్ అక్కడ చేరినవాళ్ళ ముఖాలు ఒక్కొక్కటే పరిక్షించ సాగింది. అలీ షార్‌ను చూడగానే ఆమె హృదయంలో చప్పున మోహావేశం పొంగిపోయింది. నిజానికి అతని సౌందర్యం ఎవరినైనా సమ్మోహింప జేయగలదే. జుమ్రుద్ వేలం వేసే వాడికి అతన్ని చూపి, "నేను ఆ ప్రశాంత వదనంగల యువకుడికి అమ్ముడుపోతాను. అతను నాకు నచ్చాడు," అంటూ ఏవో పద్యాలు చదివింది.

వేలం వేసేవాడు ఆమె యజమాని కేసి తిరిగి, ఆమె పాండిత్యం గురించి ఆశ్చర్యం వెలిబుచ్చాడు.

"నీ ఆశ్చర్యం సహజమే. ఆమెలో అంత అందంతోబాటు అంత విద్వత్తు ఉండటమేగాక, ఆమె స్వయంగా రకరకాల కవిత్వం చెప్పగలదు. ఆమెకు బుటేదారీ, పట్టునేతా కూడా తెలుసును. ఆమె నేసే తెరలూ, తివా సీలూ యాభయ్యేసి దీనారాలకు అమ్ము డవుతాయి. ఆమెను కొన్నవాడికి ఆమె విలువ రాబట్టటానికి కొద్ది మాసాలు చాలు," అన్నాడు ఆమెను అమ్ముకుం టున్నవాడు.

"ఈమెను కొనేవాడి అదృష్టమే అదృష్టం!" అన్నాడు వేలం వేసే వాడు.

అతను అలీ షార్‌ను సమీపించి, వంగి సలాంచేసి, "బాబుగారూ, మీ అదృష్టంకొద్దీ ఈ బానిస నూరోవంతు ధరకు మీకు లభ్యం అవుతున్నది. ఈమెద్వారా మీకు కలిసివచ్చుగాక!" అన్నాడు.

అలీ షార్ తలవంచుకుని, విధి వక్రత్వానికి తనలో తాను నవ్వుకుని, "రొట్టెముక్కకు రికానా లేని నేను ఈ బానిసను కొనగల ననుకుంటు న్నారు. అవునని గాని, కాదని గాని చెప్పి, ఈ వర్తకులమధ్య నేను ఎందుకు అవమానంపాలు కావాలి?" అనుకున్నాడు. అతను నేలచూపులు చూస్తూ, మౌనంగా ఉండిపోయాడు.

జుమ్రుద్ అతనికి ప్రోత్సాహ కరంగా ఉండే చూపు చూసింది. కాని అతను దాన్ని చూడలేదు. అందుచేత ఆమె వేలం వేసేవాడితో, "నన్ను అతనివద్దకు తీసుకుపో. నేను అతన్ని పలకరించి, నన్ను కొనటానికి ఒప్పి స్తాను. నేను అతనికి తప్ప మరెవ్వ రికీ అమ్ముడుపోరాదని నిశ్చయించు కున్నాను," అన్నది.

వేలంవేసేవాడు ఆమెను అలీషార్ దగ్గిరికి తీసుకువచ్చాడు. ఆమె అతనితో, "నా మనసు దోచినవాడా,

నన్నెందుకు ధర ఇచ్చి కొనవు? నేనింకా హెచ్చు విలువ చేస్తాననుకుంటే మరింత హెచ్చు ధరకు ఎందుకు పాడవు ? ఏ ధరకైనా నేను నీ బానిస గానే ఉండగోరుతున్నాను," అన్నది.

అలీ షార్ విచారంగా తల ఆడించి, "అమ్మవలసిన అగత్యం లేనట్టే, కొనవలసిన అగత్యం కూడా లేదు," అన్నాడు.

జుముర్రుద్ అతనితో, "వెయ్యి దీనారాలు చాలా ఎక్కువనిపిస్తున్నట్టున్నది. తొమ్మిది వందలే ఇస్తానను, నేను నీకు అమ్ముడుపోతాను," అన్నది.

అతను తల అడ్డంగా తిప్పి, ఏమీ అనలేదు.

"పోనీ ఎనిమిది వందలకు కొను ...ఏడు వందలకు...ఒక్క వందకు !"

"నావద్ద అంత డబ్బు లేదు," అన్నాడు అలీ షార్.

"ఎంత తక్కువవుతుంది? మిగిలినది తరవాత ఇవ్వొచ్చులే."

"నాదగ్గిర నూరు దీనారాలు కాదు గదా, ఒక్క దీనారం కూడా లేదు. ఆఖరుకు ఒక్క వెండిదీనారం కూడా లేదా. నాకోసం కాలం వృథాచెయ్యక, మరొక కొనుగోలుదారును చూసుకో," అన్నాడు అలీ షార్.

ఆ యువకుడు కటిక బీదవాడని జుముర్రుద్ గ్రహించి, "అయితే అయింది. నువే కొను. నా చేతిమీద కొట్టి, నీ పైబట్ట నామీద కప్పి, నీ చేతో నా నడుమును చుట్టు. నువు నన్ను కొన్నట్టు అవే నిదర్శనం," అన్నది.

అలీ షార్ ఆమె చెప్పినట్టే చేశాడు. తన నడుముచుట్టూ అతను చెయ్యి వేస్తుండగా ఆమె అతని చేతిలో డబ్బు సంచీ పెట్టి, "ఇందులో వెయ్యి దీనారా లున్నాయి. నా యజమానికి తొమ్మిది వంద లిచ్చి, మన అవసరాలకు వంద ఉంచు," అన్నది.

అలీ షార్ ఆమెకింద తొమ్మిదివందల దీనారాలు చెల్లించి, ఆమెను తన నివాసానికి తీసుకుపోయాడు.

తన కొత్త యజమాని ఉంటున్నది ఒక దిక్కుమాలిన గదిలో నన్నది చూసి జుముర్రుద్ ఆశ్చర్యపడలేదు. అందులో ఒక చింకి చాప తప్ప మరేమీ లేదు. ఆమె అతనికి మరో వెయ్యి దీనారాలిచ్చి, "బజారుకు వెళ్ళి, మేలు రకం కర్రసామానూ, తివాసీలూ కొను. తినటానికీ, తాగటానికీ దివ్యమైన పదార్థాలు తీసుకురా. తరవాత నాకు మేలైన డమాస్కస్ పట్టుది పెద్ద చదర, ఎరుపు రంగుదీ, దారపు కండెలు బంగారువీ, వెండివీ, ఏడు రంగుల సిల్కువీ, పెద్ద సూదులూ, వేలి తొడుగూ తీసుకురా."

అలీ షార్ ఆమె కోరినవన్నీ తెచ్చాడు. ఆమె నేలమీద తివాసీలను

పరిచింది, మంచాలూ, పరుపులూ అమర్చి, గదిని అందంగా తయారు చేసింది. దీపాలు వెలిగించి, భోజనానికి బట్ట పరిచింది. ఇద్దరూ కూర్చుని తిన్నారు, తాగారు. తరవాత ఇద్దరూ కొత్త పరుపుమీద పడుకుని, తెల్లవార్లూ కామకలాపాలలో గడిపారు.

తెల్లవారగానే జుముర్రుద్ చురుకుగా పనికి ఉపక్రమించింది. ఎర్ర డమాస్కస్ పట్టు చదరమీద పని ప్రారంభించి, కొద్దిరోజులలో దాన్ని తెరగా తయారుచేసింది. దానిమీద అన్ని రకాల పక్షులూ, జంతువులూ ఉన్నాయి. అవి ఎంతో జీవకళ ఉట్టిపడేటట్టున్నాయి. తెరమధ్యలో ఫలవృక్షాలున్నాయి. ఈ తెర తయారుచెయ్యటానికి ఆమెకు సరిగా ఎనిమిదిరోజులు పట్టింది.

తెర పూర్తిఅయాక జుముర్రుద్ దానికి మెరుగుపెట్టి, మడిచి అలీ షార్ కిచ్చి, "దీన్ని తీసుకుపోయి, ఏ దుకాణంలోనైనాసరే, యాభై దీనారాలకు తక్కువకాకుండా అమ్మెయ్యి. ఒక్క విషయం జాగ్రత్త, తెలిసినవాడికి కాకుండా, ఏ దారినపోయేవాడికో అమ్మావో మనకు దారుణమైన వియోగం కలగవచ్చు. మనకోసం శత్రువులు పొంచి ఉన్నారు. అందుచేత తెలియని వాళ్ళను గురించి జాగ్రత్తగా ఉండు," అన్నది.

అలీ షార్ ఆమె షరతులకు సమ్మతించి, మార్కెట్‌కు వెళ్ళి, తనకు తెలిసిన ఒక వర్తకుడికి ఆ తెరను యాభై దీనారాలకు అమ్మాడు.

ఆ డబ్బుతో అతను మళ్ళీ పట్టు చదరా, సిల్కుదారాలూ వగైరా కొని జుముర్రుద్‌వద్దకు తీసుకుపోయాడు.

తిరిగి ఎనిమిదిరోజులలో ఆమె ఈసారి ఇంకా అందమైన తివాసీ తయారుచేసింది. దానికి కూడా యాభై దీనారాలు వచ్చాయి.

ఇలా పూర్తిగా ఒక సంవత్సరం గడిచింది. ఆ ఏడాది అంతా వారికి తినటమూ, తాగటమూ, పరస్పరం ప్రేమించుకోవటంలో గడిచిపోయింది.

(ఇంకా ఉంది)




( గత సంచిక తరువాయి )

శేఖర్ భోజనం పూర్తిచేసి మాధవి వెనకే కాలవదగ్గరకు వెళ్ళి చేతులు కడుక్కుంటున్నాడు. నెమ్మదిగా కేరియర్ కడిగి వరసగా పేర్చుతున్న మధువైపు వోసారిచూసి నవ్వి మళ్ళీ గోపాలంగారి దగ్గరికెళ్ళి కూర్చున్నాడు.

కారియర్ పట్టుకొని వాళ్ళవగ్గర కొచ్చి "నే వెళ్తున్నా మావయ్యా!" అంది మాధవి. "ఎండలోవెళ్ళి ఏం చేస్తావమ్మా! ఛల్లబడిన తర్వాత వెళ్ళ వచ్చులే, కూర్చోమ్మా!" అన్నాడు గోపాలం. "ఎండ పెద్దగా ఏంలేదు మావయ్యా! ఇంటిదగ్గర కొంచంపనుంది అత్తయ్యతో వెంటనే వస్తానని చెప్పాను. ఎదురుచూస్తుంటుంది. వెళుతున్నా!" అంటూ ప్రక్కనే కూర్చున్న శేఖర్ వైపు చూసి కళ్ళతోనే చెబుతూ చిన్నగా నవ్వుకుంటూ బయలుదేంది.

నాలుగుగంటల వరకూ పొలంలో గడిపి, ఇంటికొచ్చి స్నానంచేసి టీ త్రాగి చంద్రంయింటివైపు వెళ్ళాడు శేఖర్. అప్పటికే స్నానంచేసి రెడీగా వున్న చంద్రం గుమ్మంలో శేఖర్ని చూసి, "శాంతా! శేఖర్ కూ నాకూ కాఫీ పట్రామ్మా!" అంటూ కేకేసి కుర్చీ ముందుకు జరిపాడు.

"ఇప్పుడే టీ తాగి వస్తున్నారా. మళ్ళీ కాఫీ ఎందుకూ?" అంటుండగానే అప్పటికే రెడీగావున్న కాఫీ పట్టుకొచ్చింది శాంత రెండుగ్లాసుల్లో. కాఫీ

అందుకుంటూ "బావున్నావా శాంతా? చదువై పోయిందేమిటి? గంగాతీరాన నీళ్ళకు చేరి, బిందెలనిండా మామిడి కాయలు దొంగతనం చేయడంవరకూ వచ్చావన్నమాట!" అంటున్న శేఖర్‌ను చూసి సిగ్గుపడుతూ తలవంచుకున్న శాంతను చూసి చంద్రం బదులుచెప్పాడు. "ఒరే శేఖర్! ఈ వూరికి కలకత్తా కాళీ వచ్చిందిరా. చూశావా? చూసివుండవులే. ఆ మధు వచ్చింతర్వాత వూర్లో ఈ కారు పిల్లలందరూ మహా మాటకారులై పోయారులే. మునుపటిలా మగవాళ్ళను చూసి తప్పుకుపోవడం లాంటివేంలేవు. ఇప్పుడు మనమేమన్నా ధైర్యంగా బదులు చెప్పడం నేర్చుకున్నారు. ఆ గయ్యాళి మధూ..." అన్నాడు చంద్రం.

"ఊ! నిన్నేం చేసిందేం! పేద్ద! గయ్యాళట! గయ్యాళి! వున్న మాటంటే మీకందరికీ వులుకెక్కువ. అందుకే దానికి గయ్యాళని పేరుపెట్టారు. పాపం అదేం చేసింది మిమ్మల్ని?" అంది వుక్రోషంగా చంద్రంవైపు చూస్తూ. శాంత ముఖం చూసి యిద్దరికీ నవ్వాగలేదు. నవ్వాపుకుంటూ శాంత చేయిపట్టి దగ్గరకు లాగిన చంద్రం "ఏవిటి చెల్లాయ్! వున్న మాటంటే వులుకెక్కువా? ఎవరికే? అర్థమైందా? ఇప్పుడు మీ మధుని గయ్యాళన్నానని నువ్వే కదే వుడుక్కున్నావు!" అంటూ పకపకా నవ్వుతున్న చంద్రాన్ని చూసి, మరింకేమీ చేయలేక చెయ్యి వదిలించుకొని వెక్కిరిస్తూ వెళ్ళిపోయింది శాంత.

మెత్తటి యిసుకలో కూర్చొని వూరి విశేషాలు, మిగతా క్లాస్‌మేట్స్ ఏమేం చేస్తుందీ, ఊరి రాజకీయాలు మొదలైన ఎన్నో విషయాలు వాళ్ళ చర్చలోకి వచ్చాయి. పొలాల గురించి అడిగి తెలుసుకున్నాడు శేఖర్. ఇద్దరూ ప్రక్క ప్రక్కనే కూర్చొని చిన్నప్పటినుంచీ జరిగిన ఎన్నో సంఘటనలు, సన్నివేశాలు మననం చేసుకుంటూ, గంగాపూర్ గ్రామం యింకా ఎన్నో విషయాల్లో వెనకబడి వుండటాన్ని గురించి చర్చించుకుంటూ అందుకు చేయవలసిన ప్రయత్నాల గురించి ఆలోచిస్తూ చాలా ప్రొద్దుగూకేంతవరకూ కూర్చొని లేచి యిళ్ళకు బయలుదేరారు.

ఆ రోజు నెమ్మదిగా తండ్రిదగ్గర చేరిన శేఖర్ నెమ్మదిగా ట్రాక్టర్ ఆవశ్యకతను గురించి ఆయనకు వివరంగా చెప్పాడు. పంటలు ఎలా వేస్తే బాగా వస్తాయో, నారుగా వున్నప్పుడు కూడా ఎరువుల ఆవశ్యకత గురించి, సీడ్స్ ఎలాంటివి సెలెక్ట్ చేసుకోవాలో, ఒక్క కుదురులో ఎన్ని మొక్కలు నాటాలో, అవి ఎంత దగ్గర దగ్గరగా వేస్తే అంత రాబడి గురించి, మొట్టమొదటిసారిగా తండ్రిదగ్గర ధైర్యంగా అన్ని మాట్లాడగల్గినందుకు తనకే ఆశ్చర్యంగా వుంది శేఖర్‌కు.

ఇనాళ్ళూ దాదాపు ఆయన జీవిత కాలమంతా పొలాల మధ్యే గడిపినా శేఖర్ మూడేళ్ళలో తెలుసుకున్నదాంట్లో తనకు నాలుగోవంతు కూడా తెలియదని తెలిసి రఘుపతిరావుగారు తనలో తానే నవ్వుకున్నారు. శేఖర్ని అత నిష్ట ప్రకారం బి యస్సి. ఎగ్రికల్చర్ చదివించడం ఎంత మంచిదైందో అర్థం చేసుకున్నారు. రఘుపతిగారు మొదట శేఖర్ని యింజనీరింగ్ చదివించాలని అనుకున్నారు. మొదటినుంచి శేఖర్‌కు పొలాలమీద విపరీతమైన మక్కువ వుండటంతో అతను తన కిష్టమైన సబ్జక్టు చదివేలా చేసింది. ''అదిప్పుడు ఫలితా న్నదించబోతుంది. దానికి తనెందు కడ్డు రావాలి? బాధ్యత తెలుసుకున్న కొడుకు. యింక తను వేరే చెప్పేదేముంది?" అందుకే శేఖర్ చెప్పినవన్నీ శ్రద్ధగా విన్న రఘుపతిగారు "మంచిరోజు చూసి కలకత్తా వెళ్ళి ట్రాక్టర్ కొనడానికి కావ లిసిన ఏర్పాట్లన్నీ చేసుకొమ్మని" చెప్పారు.

ఉత్సాహంగా తన గదిలో కెళ్ళిన శేఖర్ విషయాలన్నీ తెలియజేస్తూ వివరంగా శిరీష్‌కు లెటర్ వ్రాశాడు. మరోవారానికి శిరీష్ దగ్గర్నుంచి లెటర్ వచ్చింది. "ఏర్పాట్లన్నీ నాన్నగారు చూస్తామన్నారు, నువ్వు సాధ్యమైనంత త్వరలో బయలుదేరి రమ్మని." గంగా పూర్ గ్రామం చిన్నదైనా దానికో గుర్తింపు, ఓ ప్రాముఖ్యత సంపా దించాలనే ప్రయత్నంలోనే శేఖర్ మనస్సు పథకాలు, ప్రణాళికలు వేస్తూ చంద్రంతో కలసి అభివృద్ధి కార్య క్రమాలకు ఆలోచనలు సాగిస్తోంది.

అనుకున్న ప్రకారం ఓ మంచిరోజు చూసి కలకత్తా బయలుదేరిన శేఖర్, శిరీష్‌తో కలిసి శ్రీధర్‌గారి సహాయంతో పనులన్నీ పూర్తిచేసుకొని ఆ వారం రోజులూ పనయ్యేంతవరకూ శిరీష్ బలవంతంమీద వాళ్ళింట్లోనే గడిపి వాళ్ళ కుటుంబానికి మరింత సన్నిహితు డయ్యాడు. శేఖర్ తిరిగి గంగాపూర్ బయలుదేరినరోజు సుషమ "అన్నయ్యా! నాకు పళ్ళెటూళ్ళంటే చాలా యిష్టం. నేనూ నీతో వస్తున్నాను. మాకిప్పుడు హాలీడేస్ వున్నాయి" అంది. శేఖర్ బాగ్ సర్దుతూ. అప్పుడే అక్కడికివచ్చిన శిరీష్ "ప్రస్తుతం నేనూ, శేఖర్ వెళుతున్నాం. నువ్వు మరోసారి వెళ్ళువుగానిలే" అన్నాడు సుషమను ఏడిపించాలని. అంతకుముందే తనూ సుషమ వస్తున్నట్లు శేఖర్‌తో చెప్పివున్నందువల్ల, నెమ్మదిగా నవ్వుతూ సుషమవైపు చూశాడు శేఖర్, ఏమీ తెలీనట్లే. బాగ్ సర్దటం ఆపిన సుషమ శిరీష్‌వైపు కోపంగాచూస్తూ "ఏంకాదు. నువ్వుకావాలంటే తర్వాత రా! నేను శేఖరన్నయ్యతో వెళతాను. నాన్న గారితో అన్నయ్య ఎప్పుడో చెప్పాడు నన్ను తీసుకెళతానని" అంది పెంకెగా.

"ఓ.కే. ఒప్పుకున్నాం. యిద్దరం వెళు తున్నాం. యింక ఆ సీరియస్ ఫోజ్ తీసేసి వోసారి నవ్వమ్మా!" అంటూ గడ్డంపట్టుకున్న శిరీష్ చెయ్యివిదిలించి, శేఖర్ బాగ్ సర్దుతున్న సుషమ బిక్క ముఖంవేసి కూర్చున్న శిరీష్‌నుచూసి ఫక్కున నవ్వింది. వాతావరణం నవ్వు లతో ఆహ్లాదంగా తయారయింది. మొత్తానికి ముగ్గురూ బయలుదేరి గంగా పూర్ చేరుకున్నారు.

గంగాపూర్ చేరిన దగ్గర్నుంచీ సుషమకు ప్రతిదీ వింతగా, విచిత్రంగా కన్పిస్తోంది. ప్రతిక్షణం శ్యామలాదేవి వెంట తిరుగుతూ "అమ్మా ఇదేవిటి?" అంటూ రోజంతా శ్యామలాదేవి ద్వారా తన సందేహాలు తీర్చుకుంటూంది. ప్రొద్దునవెళ్ళి శిరీష్, శేఖర్ పొలంనుంచీ సాయంత్రానికి యింటికి చేరుకునేవారు. సాయంత్రం స్నానాలుచేసి దారిలో గంద్రాన్ని కలుపుకొని గంగాతీరానికే చేరుకునేవాళ్ళు. కావల్సినన్ని కబుర్లు. ఒక్కోరోజు సుషమ వాళ్ళతో కలిసి షికారెళ్ళేది. ఎంతమాట్లాడినా వాళ్ళ ముగ్గురిమధ్యా సుషమ ఒక్కదానికి కొద్దగా బోర్ అన్పించేది. తనకు యింట్రస్టు లేని ఎరువులు, మందులు గురించిన మాటలంటే మరీ చికాగ్గా వుండేది. అయినా చక్కటి ప్రకృతి సౌందర్యాన్ని సాయంత్రపు నీరెండలో చూసే అవకాశాన్ని వదులుకోలేక వాళ్ళతో కలిసి వెళ్ళేది. వారంరోజులు రొటీన్‌లా గడిచిపోయేసరికి సుషమకు మళ్ళీ కలకత్తా జ్ఞాపకం వచ్చింది.

ఓరోజు అన్నయ్యలతో షికారు బయలుదేరిన సుషమ నెమ్మదిగా ముందు నడుస్తున్నదల్లా చంద్రాన్ని పిలవడానికి వాళ్ళింటికి వెళ్ళి శేఖర్ శిరీష్ సుషమ లనుకూడా లోపలికిరమ్మని పిలవడంతో చంద్రం ఇంట్లోకి వెళ్ళారు.

పెద్ద ఉయ్యాలబల్ల హాలుకు మధ్యగా వుంది. ఓ ప్రక్కగా పేర్చిపెట్టిన ధాన్యం బస్తాలు, హాల్లో కొంచెం ముందుకు రెండుకుర్చీలు ఓ ప్రక్కగా నవారు మంచం వేసివుంది నవ్వుతూ లోపలికి ఆహ్వానించిన చంద్రం "ఒక్క నిముషం కూర్చోండి యిప్పుడే వస్తాను," అంటూ లోపలికి వెళ్ళాడు.

శిరీష్ ప్రక్కన మంచంమీదకూర్చొని పాతకాలంనాటి ఆ యింటి అందాన్ని ఎక్కడివక్కడ అందంగా అమర్చి నట్లున్న వస్తువుల్ని చూస్తూ కూర్చుంది. సుషమ. ఓ పళ్ళెం నిండుగా సున్ని వుండలు, కారపుపూస పెట్టిన ప్లేట్లు పట్టుకొని నెమ్మదిగా లోపలికి అడుగు పెట్టిన శాంత సుషమను చూసి చిన్నగా నవ్వి ప్లేట్లు బల్లమీద పెట్టింది. ఇంతలో మంచినీళ్ళతో వచ్చిన చంద్రం శిరీష్‌కు సుషమకు తన చెల్లెలు శాంతను పరి చయం చేశాడు. తన ఏజ్‌గ్రూప్ శాంతను చూడగానే ప్రాణంలేచివచ్చి

నట్లైంది సుషమకు. "ఇన్నిరోజులూ చెప్పలేదేం మీకో చెల్లాయ్ వుందని?" అన్నాడు శిరీష్ చిన్నగా నవ్వుతూ.

"పాపం! మీ చెల్లాయ్ రోజూ పడే అవస్థ చూడలేక తనతోటివాళ్ళు నలుగురూ పరిచయమైతే తనకూ బావుంటుందనీ ... మా శాంతను పరిచయం చేయాలనే అయిడియా వచ్చింది." అన్నాడు నవ్వుతూ చంద్రం సుషమ వైపుచూసి, కృతజ్ఞతతో చంద్రంవైపు చూసిన సుషమ "నలుగురు చెల్లెళ్ళున్నారా మీకు?" అంది. "నోనో నాకు ఈ గడుగ్గాయి ఒక్కతేనండీ చెల్లెలు. ఇందాక నలుగురు అన్నమాటకు శాంత వానరసైన్యాన్ని వుద్దేశించి. యిప్పుడే మరో అయిదు నిముషాల్లో వస్తారు కబురుచేశాం. అంతలో మీ టిఫిన్ కానివ్వండి" అంటూ తలా ఓ ప్లేటూ చంద్రం అందిస్తుండగానే శాంత సున్ని వుండలపళ్లెం తీసుకొని ఒకో ప్లేట్‌లో రెండు రెండు పెట్టింది. వాళ్ళ టిఫిన్ కాఫీలు పూర్తయ్యేసమయానికి ముగ్గురమ్మాయిలు లోపలికి రాబోయి వెనక్కి తగ్గారు. కొత్తవాళ్ళెవరో కూర్చుని ఉండటంచూసి వెనక్కితిరిగి వెళ్ళే ప్రయత్నంలో వున్నవాళ్ళను శాంత పిల్చింది "ఫర్వాలేదు రండే" అంటూ. నెమ్మదిగా లోపలికొచ్చి శాంతతోపాటు వుయ్యాలబల్లమీద కూర్చున్నారు, బెదురు బెదురుగా చూస్తూ. శేఖర్‌కళ్ళు మాధవి కోసం వెదుకుతున్నాయి. "సరసు, ఇందిర రమ" అంటూ మళ్ళీను సుషమకు పరిచయం చేశాడు చంద్రం. "సుషమ, శిరీష్ యింక వీడు మన శేఖర్ తెలుసుగా" అంటూ వాళ్ళకు పరిచయం చేశాడు. వాళ్ళు తలలు వంచుకొని కూర్చున్న తీరు, ఆ బెదురుచూపులు చూస్తే పెళ్ళిచూపులకెవరో వస్తే బుద్ధిగా కూర్చున్న అమ్మాయిల్లా ఉన్నారు. వాళ్ళవైపుచూస్తూ నవ్వుతూ ద్వారబంధం పట్టుకొని నుంచున్న చంద్రాన్ని ఒక్క తోపుతోసి "తప్పుకో బావా! అర్జంటని కబురుపెట్టింది శాంత" అంటూ సుడిగాలిలా లోపలికివచ్చిన మాధవి– ఎదురుగా కన్పించిన కొత్తవాళ్ళను చూసి సిగ్గుతో లోపలికి పరుగెత్తబోయి, ఉయ్యాలబల్లమీద సైలెంట్‌గా ఎవరో బంధించిపడేసినట్లున్న స్నేహితురాళ్ళను చూసి ప్రశ్నార్థకంగా శాంతవైపు చూసింది. వెనకనుంచీ వచ్చిన చంద్రం గబుక్కున మాధవి జడ చేతపట్టుకొని లాగి శిరీష్, సుషమ కూర్చున్నదగ్గరకు తీసుకెళ్ళాడు, "అబ్బ! వదులు బావా!" అంటున్నా విన్పించుకోకుండా. "ఇది మాధవి. మా మరదలని యీపాటికి తెలిసే వుంటుంది. కోపం వచ్చిందంటే మీ కలకత్తా కాళిస్వరూపం ఎత్తుతుంది." వీరు శిరీష్, వీరు వారి చెల్లెలు సుషమ వీరు..." అంటూ శేఖర్‌వైపు చూసే సరికి మాధవి మధ్యలోనే అందుకొని

తెలుసు" అంటూ శేఖర్ని వెక్కిరించి, సుషమకు, శిరీష్‌కు, శేఖర్‌కు నమస్కరించింది బుద్ధిగా.

"సుషమగారూ! ఇంక మెజారిటీ మీది. మీ మధ్య యింకాసేపు మేం వున్నామంటే ఇంక ఓటమి అంగీకరించక తప్పదు. కనుక మేం శలవు తీసుకుంటున్నాం" అంటూ వాళ్ళ మధ్య సుషమను వదలి శేఖర్, శిరీష్‌లను తీసుకొని షికారెళ్ళిపోయాడు చంద్రం.

బెల్‌బోటమ్ వేసుకున్న సుషమను వాళ్ళంతా విచిత్రంగా చూస్తూ తమ సందేహాలు, కలకత్తా విశేషాలు, ఆ అమ్మాయి అలంకరణగురించి ఎలా అడిగి తెల్సుకోవాలా అని ఒకళ్ళ ముఖాలు ఒకళ్ళు చూసుకుంటున్న వాళ్ళనుచూసి కొంచెం యిబ్బందిగా ఫీలైంది సుషమ. మాధవి అంత క్రితమే ఆడపిల్లలు అలాంటి డ్రెస్సులు వేసుకోడం చూసివున్నది కనుక సుషమ డ్రస్సేమీ విచిత్రంగా అన్పించలేదు. సుషమ ప్రక్కన మంచంమీద కూర్చుంటూ స్నేహంగా నవ్వింది. ఆ నవ్వుతో ధైర్యంవచ్చిన సుషమ తనూ నవ్వుతూ మాధవితో మాటలు మొదలు పెట్టింది. పక్కూళ్ళంటే తన కెంత యిష్టమో సుషమ చెబుతుంటే మిగతా పిల్లలందరూ కలకత్తాను గురించి తాము కంటున్న కలలగురించి చెప్పి అక్కడి విశేషాలు అడిగి చెప్పించుకున్నారు. మాధవి కలకత్తాగురించి యింట్రెస్టు చూపించకపోవడం సుషమకు కొంత ఆశ్చర్యం కల్గించింది. ఏమైనా మిగతా పిల్లలకు మాధవికి చాలా తేడావుంది. అనుకుంది. ఆ రోజు మళ్ళీ శేఖర్ వచ్చి పిలిచేవరకూ అంతా యిళ్ళదగ్గర పనులు కూడా వదిలేసి సుషమతో కబుర్లు చెబుతూ కూర్చున్నారు.

శేఖర్ పిలవగానే లేచి వెళ్ళింది సుషమ. "నాకు అందరిలోకీ చంద్రంగారి మరదలు మాధవి నచ్చిందన్నయ్యా" అంది సుషమ! చంద్రం మాధవితో చనువుగా మాట్లాడటం, మాధవి,మాటకు మాట అందించడం,చనువుగా చంద్రాన్ని నెట్టుతూ లోపలికిరావడం, చంద్రం జడ పట్టుకొని లాగటం...అన్నీ జ్ఞాపకం వచ్చి ఏదో అర్థంకాని అసంతృప్తి మనస్సు నావరించింది, శేఖర్‌కు. ఆ రోజు కొత్తగా పరిచయమైన ఫ్రెండ్స్ గురించి వాళ్ళ అమాయకత్వాన్ని గురించీ ఆగకుండా చెప్పుకుపోతోంది సుషమ. "చంద్రంగారు ఎంత మంచి వారన్నయ్యా! నాకు బోర్‌కొడుతోందని నేను చెప్పకుండానే గ్రహించి ఎంతమంది ఫ్రెండ్స్‌ను పరిచయం చేశారో చూడు. నువ్వు గ్రహించలేదు నాకెంత బోర్‌గావుండేదో! ఇంక ఎన్నాళ్ళుండమన్నా నాకు ప్రొద్దుపోదన్న బాధలేదు. ఇంక నా వెర్రిప్రశ్నలతో అమ్మను బోర్‌కొట్టించను,"అంటూంటే,

ఏదో పరధ్యానంగావున్న శేఖర్ అన్నిటి లాగే "అవును" అన్నాడు. అప్పటికి గానీ సుషమకు అర్థంకాలేదు శేఖర్ తను చెబుతున్న మాటలు - వినడం దలేని. ఏదో ఆలోచనలో వున్నాడు లెమ్మని శేఖర్ని వదిలి ఆవాళ్టి విశే షాలు చెప్పడానికి రఘుపతిరావుగారి దగ్గర చేరింది.

*　　*　　*

ఈ వారంరోజుల్లో సుషమ ఆ యింట్లో ఆడపిల్లలు లేనిలోటు తీర్చిం దన్నట్లుగా అన్పిస్తోంది చూసే వాళ్ళకు మోడరన్‌గావుండే ఆ డ్రస్సులు చూడ టానికి కొంత యిబ్బందిగా అన్పించినా కల్మష మెరుగని కబుర్లతో రఘుపతి రావుగారి మనసును యిట్టే ఆకట్టు కుంది సుషమ. ఆయన చింతగా కూర్చున్నప్పుడల్లా "అమ్మాయ్ సుషమా!" అంటూ కేకవేయగానే "యస్ డాడీ" అంటూ ఎదురుగా వచ్చి అల్లరిగా నవ్వేది. తనూ నవ్వేస్తూ "డాడీ! డాడీ ఏవిటమ్మా! చక్కగా నాన్నా అని పిలువు" అంటూ ప్రక్కన కూర్చోబెట్టుకొని కొంతసేపు తన చిన్నప్పటి కథలు చెబుతూ, కొంతసేపు సుషమ కబుర్లువింటూ మరి కొంతసేపు తను చిన్నప్పుడు చేసిన చిలిపిపనులు చెబుతూ నవ్వించేవారు. ఆ వయసులో ఆయనకూ చక్కటి కాలక్షేపంగాసుషమ దొరికిన తర్వాతగానీ, ఆడపిల్లలులేని లోటెలాంటిదో అర్థంకాలేదు.

ఆ రోజూ అలాగే ఏవో కబుర్లు చెప్పు కుంటుంటే శ్యామలాదేవి నవ్వుతూ వచ్చి "మీ కూతుర్ని ఓసారిలా పంపుతారూ!" అంది. రఘుపతిరావుగారి దగ్గర్నుంచి లేచి శ్యామలాదేవి చేయిపట్టుకుంటూ "మీ కూతుర్నికాదామ్మా?" అంది సుషమ చిరుకోపం నటిస్తూ. మమ్మీ, అమ్మీ ఏవిటవి? మొదటిరోజే అమ్మా అని పిలవడం అలవాటుచేశారు శ్యామలా దేవి.

"పిచ్చిపిల్లా! ఆయనకు కూతురైతే నాక్కాకుండా ఎలా పోతావమ్మా! ఇలా రా ఓసారి నీతో పనుంది" అని తన గదిలోకి తీసుకెళ్ళి, ఆ క్రితంరోజు సుషమ వద్దని గోలచేస్తున్నా వినకుండా కొలతలు తీసుకెళ్ళి ఈ రోజు పావడా జాకెట్ కుట్టించి అవి వేసుకొమ్మన్నారు శ్యామలాదేవి. ప్రక్కనే ప్రత్యేకంగా సుషమకోసం తెప్పించిన జార్జెట్ ఓణీ మొదటిరోజు వద్దని గొడవచేసినా, ఈరోజు కలిసిన ఫ్రెండ్సంతా అదేరకం డ్రస్సు వేసుకొని వుండటంవల్ల మరే అభ్యంతరం చెప్పకుండా ఆ పావడా జాకెట్ వేసుకొని వోణీ ఎలావేసుకో వాలాని అటూ యిటూ తిప్పిదోపు తుండగానే లోపలికెళ్ళిన శ్యామలాదేవి నవ్వుతూ వచ్చి, వోణీవేసి, కుచ్చెళ్ళు పోసి ఎలా దోపుకోవాలో చూపించారు. ఆ డ్రస్సులో తనను తానుచూసుకున్న సుషమకు మొట్టమొదటిసారిగా సిగ్గు

క్రొత్తది!

# అమృతాంజన్ లిమిటెడ్‌వారి విశిష్టమైన

# ఆముదము

శుద్ధిచేసినది.
వాసనలేనిది.




మూడు
సైజులలో
లభిస్తాంది:
50 మిలి
100 మిలి
200 మిలి

అమృతాంజన్ ఆముదము

OBM 3270/3 TG

లాంటి భావం కల్గింది. జారిపోతున్న పవిటను పైకి వేసుకుంటూ మరోమారు అద్దంలో చూసుకొని, "ఎలావున్నానమ్మా?" అంటూ శ్యామలాదేవి మెళ్ళో రెండుచేతులూ హారంలా వేసి అడిగింది. శ్యామలాదేవి సుషమను దగ్గరకు తీసుకొని "మహాలక్ష్మిలా వున్నావమ్మా. మీ అన్నయ్యలకు నాన్నగార్కి చూపించు వెళ్ళి," అనగానే పరుగు తీయబోయి పట్టుపావడా అడ్డంపడి పడబోయిన సుషమను చేయిపట్టుకొని ఆపుతూ, "ఒక్క క్షణం వుండమ్మా" అని లోపలికెళ్ళి బీరువాలో తన నగల పెట్టెలోనించి జడకుచ్చులూ, నెక్లెసూ తీసి, సుషమ రెండుజడలూ విప్పి అందంగా ఒకజడ అల్లి చివరనకుచ్చులా వేసి మెళ్ళో నెక్లెస్ పెడుతుంటే... "ఇవన్నీ ఎందుకమ్మా?" అంటున్న సుషమ కళ్ళలో అప్రయత్నంగా నీళ్ళు తిరిగాయి.

"ఉంచమ్మా! అచ్చు మహాలక్ష్మిలా ఉన్నావు. ఇప్పుడు వెళ్ళి చూపించు అన్నయ్యవాళ్ళకు. అరే! కళ్ళలో ఆ నీళ్ళేమిటి?" అంటూ కంగారుపడుతున్న శ్యామలాదేవివైపు తిరిగి "అబ్బే, ఏంలేదమ్మా! కంట్లో ఏదో నలకపడింది" అంటూ నెమ్మదిగా నడిచివెళుతున్న సుషమ కళ్ళకు తనకు ఆరుసంవత్సరాలు నిండకముందే చనిపోయిన తల్లి జ్ఞాపకం వచ్చింది. అనుక్షణం తల్లి ఫోటో చూస్తుండటంవల్ల ఆ జ్ఞాపకం అలాగే నిల్చిపోయింది. తననెంతో ఆప్యాయంగా చూస్తున్న శ్యామలాదేవిని చూస్తుంటే ఎన్నో సంవత్సరాల క్రితం, అనుభవమైన ఆ అనుభూతి కొత్తగా మళ్ళీ అమ్మే అన్నీ అలంకరిస్తున్నట్లుగా అన్పించింది.

ఉన్నంతలో సుషమ నాన్నగారు పిల్లకేమీ తక్కువ చేయలేదు. వాళ్ళు కోరిన ప్రతికోరికా తీర్చారు. చిన్నప్పటి నుంచీ మోడరన్ డ్రస్సుకు అలవాటు పడిన సుషమ ఇలాంటి డ్రస్సులు చాలా రేర్‌గా చూసేది. ఎప్పుడైనా కథల్లో చదవడం, ఏదైనా తెలుగు పిక్చర్‌లో ఆ డ్రస్సు వాడితే చూడటం తప్ప సుషమ ఇలా పావడావోణీ వేసుకుంటే ఎలా వుంటుందని కలలోకూడా ఊహించలేదు. ఆలోచనలతో నెమ్మదిగా రఘుపతిరావుగారున్న రూమ్‌లో అడుగు పెట్టింది.

అప్పటివరకూ శిరీష్ చెబుతున్న జోక్స్‌కు నవ్వలేక పొట్టచేతపట్టుకొని నవ్వుతున్న రఘుపతిరావుగారు, శేఖర్, యిద్దరూ ఒక్కసారి నవ్వాపేశారు. ఏవిటాని? వెనక్కుతిరిగిన శిరీష్ తన కళ్ళను తాను నమ్మలేకపోయాడు— "సుషమా!" అన్నాడు ఆశ్చర్యంగా చిన్నగా నవ్వుతూ రఘుపతిరావుగారి దగ్గరకెళ్ళి పాదాభివందనంచేసింది. "శీఘ్రమేవ కళ్యాణ ప్రాప్తిరస్తుః."

అని మనస్ఫూర్తిగా దీవించి చేయి పట్టుకొని ప్రక్కనకూర్చోబెట్టుకున్నారు. శేఖర్ తను కూర్చున్నదగ్గరనుంచీ లేచి సుషమ ప్రక్కకుర్చీలో కూర్చుంటూ,

"సుషమా! ఈ డ్రెస్సులో నువ్వెంత బావున్నావో తెలుసా? ఇకెప్పుడూ యిదే డ్రస్సు వేసుకోమ్మా!" అంటుండ గానే శేఖర్ని ఆపేసి "అవునమ్మా! ఇంక యిప్పటినుంచీ ముసలిదాని వయ్యే వరకూ యిదే డ్రస్సువేసుకో!" అంటూ నవ్వాడు శిరీష్.

అలా కులాసాగా కబుర్లుచెప్పుకుంటూం డగా, శ్యామలాదేవి భోజనాలకు పిల్చింది.

ఆ మరునాడే చంద్రం తోటలో వన భోజనాలు. ఆ పిక్నిక్‌ను గురించి సుషమ మనస్సులో ఎంతో వూహించు కొని మురిసిపోయింది.

శ్యామలాదేవి తెల్లవారుఝామునే లేచి అన్ని ఫలహారాలు సిద్ధంచేయించి కారి యర్లలోకి సర్దించింది, ఓ పెద్ద స్టీల్ కారియర్ నిండుగా పులిహోరా మరో కారియర్ నిండా సేమ్యా పాయసం కావల్సిన ప్లేట్లు, స్పూన్లు, గరిటలు, ఒక బుట్టనిండుగా కమలాలు, మావిడి పండ్లు అన్నీ సిద్ధంచేయించి నెమ్మదిగా సుషమను లేపారు. సుషమ లేచి రడీ అయ్యే టైమ్‌కు, శిరీష్, శేఖర్ రెడీ అయి క్రిందకు వచ్చారు. కాఫీ తాగి ఇద్దరూ చంద్రం దగ్గరకు వెళ్ళి వస్తా మని బయలుదేరారు.

వీళ్ళు వెళ్ళేసరికి చంద్రం గిత్తలకు అలంకారం పూర్తిచేస్తున్నాడు. రెండూ సమానమైన ఎత్తులో తెల్లగా, కాటుకపెట్టి నట్లున్న పెద్దపెద్ద అందమైన కళ్ళతో మెరుస్తున్నట్లున్నాయి వాటి పోషణకు చంద్రం ప్రత్యేకమైన శ్రద్ధ తీసుకుంటా డని చూస్తూనే అర్థమౌతోంది. "ఏరా శేఖర్ మనకు రెండుబళ్ళు చాలవూ ?" అన్నాడు శేఖర్ని చూడగానే" ఒరే బళ్ళెందుకురా ఎంత దూరముందని మీతోట! సరదాగా అంతా నడిచే వెళ్ళ వచ్చుగా" అన్నాడు శేఖర్ నవ్వుతూ, ఓ చేత్తో ఎద్దువీపు నిమురుతూ.

"భలేవాడివిరా ! మనం మగవాళ్ళం ఎంత దూరమైనా నడవగలం. మరి ఆడ పిల్లల మాటేమిటి ? ఇంకొంచెం సేపట్లో మంచి ఎండ కాస్తుంది. అందులోనూ మీ చెల్లాయి మన పొలంగంట్లంట యీ ఎండలో ఆ డొంకలోపడి నడవాలంటే ఇంక భస్తే మీవూరు రాను బాబోయ్ ! అని పారిపోతుంది కలకత్తా దారి వెతు క్కుంటూ" అంటున్న చంద్రం మాటలు నిజమే అన్పించాయి, చంద్రం వాళ్ళతో మాట్లాడుతూనే గిత్తల మెళ్ళో మువ్వలు కడుతున్నాడు.

ఇంతలో శాంత వచ్చింది నవ్వుతూ. అప్పటికే రెడీగా వుంది. "మధువాళ్ళను పిల్చుకు రానా అన్నయ్యా అంటూ

ముందుకు వెళ్ళబోయిన శాంతను పిల్చి "రాత్రి చెప్పావుగా రెడీఅయివుంటారులే వెళుతూ దారిలో అందర్నీ ఎక్కించుకు వెళ్ళవచ్చు. ముందు ఆ సామాను పంపించు లోపలకెళ్ళి" అన్నాడు చంద్రం

శేఖర్‌కు ఎదురుగా చేతిలో కారియర్ పట్టుకొని హుషారుగా వస్తున్న మాధవి కన్పించింది. రెప్పపాటు కాలంలో కారియర్ ననువుగా చంద్రం చేతిలో పెట్టి నవ్వుతూ శిరీష్‌కు, శేఖర్‌కు నమస్కరించింది. వాళ్ళిద్దరూ ఓ క్షణం తబ్బిబ్బై అప్పుడు స్పృహవచ్చి ప్రతి నమస్కారం చేశారు. మాధవి ఎప్పుడేం చేస్తుందో ఎవరికీ తెలీదు. ఇంతలో "ఏవిటి మధూ యిది ? మనకే...తినడానికే" అన్నాడు చంద్రం నవ్వుతూ... "కాదు పారేయ డానికి ముఖం చూడు" అంది మాధవి.

వెళ్ళడానికి సిద్ధంగా ఉన్న శేఖర్ని ఉద్దేశించి, "మావయ్య ఇప్పుడే బండికట్టి మీ యింటికి పంపించారు" అంది. ఓ క్షణం ఏ మావయ్య మామిడితోట మావగారేనా ? అని అడుగుదామని నోటిదాకా వచ్చినా చంద్రంఏమైనా అనుకుంటాడేమోనని మౌనంగా తలవూపి ముందుకు వెళ్ళిపోయాడు శేఖర్, శిరీష్‌తోపాటు.

ఆ రోజు ఆకుపచ్చ పావడా ఎర్రటి బోర్డర్, అదేరంగు అదే అంచు జాకెట్, పచ్చటి వోణీ వేసుకుని అందంగా తయారయిన మాధవి పచ్చదనాన్ని శరీరానికి

అందంగా కప్పుకున్న ప్రకృతి కన్యలా కన్పించింది. శిరీష్ మరోమాటు పిలవడంతో ఆలోచనలకు స్వస్తిచెప్పి "ఎవిటిరా ?" అన్నాడు.

"ఏంలేదురా! చంద్రం మాధవిని మారేజ్ చేసుకుంటాడా ? చాలా చనువుగా వుంటారిద్దరూ. భలే సరదాగా మాట్లాడుకుంటారు" అన్నాడు. శేఖర్ మనస్సులో అదో రకమైన స్పందన ప్రారంభమైంది. ఉద్వేగాన్ని అపుకోడానికి ప్రయత్నిస్తూ "ఛ! అదేంలేదురా బావా మరదళ్ళు ముఖ్యంగా పల్లెటూళ్ళలో అలా సరదాగా మాట్లాడుకోవడం సహజం అంతమాత్రాన వాళ్ళు పెళ్ళి చేసుకుంటారని ఎందుకనుకోవాలి ?" అన్నాడు. మనసున మరో కోణం నుంచి చేసుకోగూడదని ఎందు కనుకోవాలి ? ఎందుకు చేసుకోరు ? అని నిలదీస్తున్నట్లడుగుతున్న మనసును కావాలని అణచి పెట్టాడు. గోపాలంగారి వదిన కొడుకు చంద్రం. ఆ వరసని మాధవి బావా అని పిలుస్తోంది. హుషారయిన వాళ్ళు కాబట్టి సరదాగా మాట్లాడుకుంటున్నారు. అలా సమర్ధించుకొని తేలికపడ్డ హృదయంతో యిల్లు చేరుకుని సుషమను రెడీ అయి రమ్మని సామానులన్నీ వెనగ్గా సర్దించి మెత్తగా గోపాలంగారు వేయించిన పరుపుమీద దుప్పటి సరిగ్గా వేయించి "సుషమా తొందరగా రావాలి."అంటూ కేకేశాడు.

"వస్తున్నా అన్నయ్యా !" అంటూ మరోసారి అమ్మ వేసిన జడను తిప్పి తిప్పి చూసుకొని శ్యామలాదేవితో చెప్పి బయటకు వచ్చిన సుషమ ఎడ్లబండిని చూసి ఓ క్షణం బిత్తరపోయి, మళ్ళీ తమాయించుకొని చిన్నగా నవ్వుతూ గిత్త పొడుస్తుందేమోనని భయం భయంగా దానివైపే చూస్తూ నెమ్మదిగా బండెక్కి కూర్చుంది శిరీష్‌కూడా ఎక్కి కూర్చున్నతర్వాత శేఖర్ బండెక్కాడు. ఆ రోజు శేఖర్ శిరీష్‌లుకూడా పంచాలాల్చీల్లో నిండుగా హుందాగా కన్పిస్తున్నారు. రామయ్యా వచ్చి బండి కట్టాడు. పదే పదే భుజంమీద నిలవకుండా జారిపోతున్న పవిట సర్దుకుంటూ ఉత్సాహంగా ముందుకు చూస్తోంది సుషమ. రామయ్యను అక్కడే ఉండమని తను తొట్లోకి జరిగి ఛర్నాకోల అందుకున్నాడు శేఖర్. ఇంకొంచెం ముందుకు జరిగి "అన్నయ్యా నీకు ఎడ్లబండి డ్రైవ్‌చేయడంకూడా వచ్చా? నాకు నేర్పవూ ? "అంటున్న సుషమను వెనక్కులాగి తను ముందుకు జరిగి కూర్చుంటూ" సర్లె ఇక నీకు నేర్పితే మేంఇంట్లో కూర్చుని వంటచేయాలి," అంటూ నవ్వాడు శిరీష్. బుంగమూతి పెట్టి తలవంచుకు కూర్చున్న సుషమను చూసి "అదిగో మీ ఫ్రెండ్ మాధవి," అంటూ గోపాలంగారింటి ముందు నుంచున్న మాధవిని చూపించాడు.

# ఉత్తేజకరమైన బొమ్మలు

# పాయింట్

ప్రతి 1000 గ్రాం ప్యాకెట్ పై

**కట్-ఔట్**
**టీనా బొమ్మ**
**స్వయంగా మీరే దుస్తులు తొడగించండి**

మూడు 'కట్-ఔట్' దుస్తులు ప్యాక్ లోనే ఉన్నాయి సుమండీ!

**కట్-ఔట్**
**బస్సు**
**మీరే స్వయంగా నిర్మించండి!**

మీకు కావాల్సినదల్లా కత్తెర తోపాటు పేస్టు!




## శ్రేష్ఠమైన రకం— ఎక్కువ ప్రతిఫలం!

పాయింట్ శ్రేష్ఠరకం డిటర్జెంట్ పౌడర్ వల్ల ఇప్పుడు మీడబ్బుకు అధికవిలువ. ప్రతి 1000 గ్రాం ప్యాక్‌లోనూ ఒక ఉత్తేజ కరమైన, మీ పిల్లలు స్వయంగా తయారించు కోగల మరియు ఆకర్షక బొమ్మ దొరుకుతుంది.

ఈ శ్రేణిలో మొట్టమొదట బహుమతిగా — డబల్ డకర్ బస్సు టీనా కాగితపు బొమ్మ అన్ని కొట్టులలోనూ దొరుకుతాయి. పైగా మరెన్నో ఆకర్షకమైన సాధనాల కోసం ఎదురు చూడండి.

## ధర మాత్రం మామూలే!

ఈ బొమ్మలు ప్యాక్‌పై ముద్రింపబడి ఉన్నాయి. కావున మీకు అసలువ్యర్థమంటూ ఏమీ లేదన్నమాట! డిటర్జెంట్ పౌడర్‌ను రక్షించుటానికై ప్రత్యేకంగా తయారించిన కాగితపు అట్టనుకూడ వ్యర్థపరచరంటే నమ్మండి! వీటిలో మీ పిల్లల ఆటలకోసం ఆనందోద్రేకం గలిగించు బొమ్మలు కత్తరించుకోవచ్చు! మామూలుపాయింట్ ధరల్లో ఈ విశేషమైన రాబడి మీకు!

**వెలను పరిశీలించండి.**
**గుణమును పరీక్షించండి.**
**మీ అంతట మీరే తెలుసుకోండి.**

గవర్న్‌మెంట్ సోప్ ఫ్యాక్టరీ, బెంగుళూరు వారి నాణ్యమైన ఉత్పాదన MCA/PD/56
మార్కెట్ చేయువారు మైసూర్ సేల్స్ ఇంటర్నేషనల్ లిమిటెడ్, బెంగుళూరు

శిరీష్. శేఖర్ నెమ్మదిగా పగ్గాలులాగి బండి ఆపేశాడు. గోపాలంగారిల్లు సమీపించగానే, సుషమ కోపం మర్చిపోయి బయటకు చూస్తూ "మాధవీ రండి" అంటూ నవ్వుతూ పిల్చింది. "ఇప్పుడే వస్తాను" అంటూ లోపలికి పరుగెత్తి అత్తయ్యతో చెప్పి వచ్చి నెమ్మదిగా రోజా మీదుగా బండెక్కుతున్న మాధవిని ఆశ్చర్యంగా చూస్తోంది సుషమ.

లోపల శిరీష్‌కూడా ఉండటంతో రోజా మీదినుంచీ కాలు లోపల పెట్టడానికి సందేహిస్తూ అలా రోజా మీదే ఆగిపోయిన మాధవిని చూసి చిన్నగా నవ్వుతూ తొట్లో మరికొంచెం ముందుకు జరిగి "ఇలారండి" అన్నాడు. గిత్త మీదుగా తొట్లో ఓ కాలువేసి లోపలికెక్కింది మాధవి. శిరీష్ ముందుకు జరిగాడు. ఆడపిల్లలిద్దరూ ఒక్కచోట చేరారు. సుషమ డ్రస్‌చూసి మెచ్చుకుంటున్నట్లుంది మాధవి. సుషమ సిగ్గుగా "అమ్మ కట్టించారు నిన్న" అని చెబుతోంది మాధవితో.

కొంచెం ముందుకు వెళ్ళి చంద్రం యింటిముందు ఆగింది బండి. 'చందూ' అంటూ కేకేశాడు శేఖర్. అప్పటికే కట్టి సిద్ధంగా వున్న బండిలో ఆడపిల్లలంతా ఎక్కారు. శాంత బండెక్కుతూ "మధూ వచ్చిందా" అని అడిగింది. "వచ్చాను" అంటూ తలపైకెత్తి కేకేసింది మాధవి. "శాంతను కూడా యిక్కడకు రమ్మందామా" అన్న సుషమతో అదికూడా వచ్చేస్తే మిగతావాళ్ళంతా గొడవ పెడతారు. వూరుకోండి అక్కడెలాగూ కలుస్తాంగా" అంది మాధవి.

రెండుబళ్లూ ఒకదాని వెనుకొకటి బయలుదేరాయి. వూరు దాటగానే గిత్తలను పరుగెత్తించడం మొదలెట్టారు. మొదట ఆ పరుగుకు ఆ కుదుపులకు భయపడింది కానీ మాధవి హుషారు చూసి "అన్నయ్యా యింకా త్వరగా పోనివ్వు" అనడం మొదలెట్టింది. మరి కొంచెం సేపట్లో వెనుక వస్తున్న చంద్రం బండి వీళ్ళ బండిని దాటేసుకొని పరుగులు తీసింది. శాంతా మిగతా పిల్లలూ చప్పట్లు కొడుతూ అల్లరిగా నవ్వారు. 'బండిలో నుంచొని అంత స్పీడుగా ఎలా నడుపుతున్నాడో చంద్రం!' అని తనలో తానే అనుకుంది.

(సశేషం)

Printed and Published by A. Chandra Sekar Rao at 5-9-88, Public Garden Road Hyderabad, for YUVA Publications and Printed at Dolton Press, Public Garden Road, Hyderabad-500001. Editor : A. SUDHAKARA RAO

# క్విజ్

## బహుమతి : రూ. 116

ఈ క్విజ్‌లో మొదటి అయిదింటికి నాలుగేసి సమాధానాలు ఇచ్చాము. అందులో సరైన సమాధానాన్ని మీరు ఎంచుకొని క్విజ్‌ను పూర్తిచేయాలి. మిగతా అయిదింటికి సారకులే సమాధానాలు 6 నుంచి 10 వరకూ ఇచ్చిన "డాష్" లలో వ్రాయాలి.

## 'క్విజ్' లో పాల్గొనేవారు పాటించవలసిన నిబంధనలు

1. సమాధానాలు 'యువ' కూపన్‌మీద మాత్రమే వ్రాసి పంపాలి. కవరుమీద 'క్విజ్' అని స్పష్టంగా వ్రాయాలి. అందులో క్విజ్ కూపన్ తప్ప మరేమీ ఉండరాదు. కూపన్‌లో ఎటువంటి దిద్దుళ్ళు ఉండరాదు. కూపన్లను పోస్టులోనే పంపాలి. ఆఫీసుకు వచ్చి ఇచ్చేవాటిని స్వీకరింపబడవు.
2. ఒకరికంటె ఎక్కువమంది ఆల్‌కరెక్టు సమాధానాల్ని పంపితే, వారికి బహుమతి సొమ్మును పంచడం జరుగుతుంది. సంఖ్య మరీ ఎక్కువైతే లాటరీ పద్ధతిని అమలుపరుస్తాం.
3. సమాధానాలు సీలువేసిన కీ సొల్యూషన్‌తో సరిపోవాలి.
4. దీనికి సంబంధించిన విషయాలలో 'యువ' సంపాదకునిదే తుదినిర్ణయం. క్విజ్ సమాధానాలను అక్టోబరు సంచికలో ప్రకటిస్తాము. ఎట్లాంటి ఉత్తరప్రత్యుత్తరాలకు అవకాశం లేదు.
5. **మాకు కూపన్లు చేరవలసిన ఆఖరు తేదీ అగస్టు 29. ఆ పైన వచ్చిన వాటిని పరిశీలించడం జరగదు.**

## సెప్టెంబరు నెల క్విజ్

1. బ్రిడ్జి ఆటలో నైపుణ్యం సంపాదించిన ఇంటర్నేషనల్ ఫిలింస్టార్
ఎ) మార్లెన్ బ్రాండో బి) ఉమర్ షరీఫ్ సి) రిచర్డ్ బర్టన్
డి) స్టువార్ట్ గాంగర్
2. విటమిన్ K కిందివాటిల్లో అధికంగా లభిస్తుంది
ఎ) టొమోటాలు బి) వేరుశనక్కాయలు సి) వంకాయలు డి) కారెట్లు

3. సాహిత్యానికి నోబుల్ ప్రైజ్ పొందిన ఇటాలియన్ రచయిత
ఎ) థామస్ మాన్ బి) నట్ హంసన్ సి) ఆల్బర్ట్ కామస్
డి) పిరాండిలో

4. 1952 లో జరిగిన మొదటి సాధారణ ఎన్నికల్లో లోక్‌సభకు పోటీచే
పార్టీల సంఖ్య
ఎ) 48 బి) 52 సి) 49 డి) 51

5. 'చెస్' ఆటను మొదటగా కనిపెట్టిన దేశము
ఎ) ఇండియా బి) రష్యా సి) పర్షియా డి) చైనా

6. 1852 లో మొట్టమొదటగా పోస్టేజి స్టాంపును జారీచేసిన ప్రదేశము——

7. చైనా తొలిగా భూ ఉపగ్రహాన్ని (ఎర్త్ సాటిలైట్)—— సంవత్సరంలో పంపింది.

8. ప్రపంచంలో కెల్లా ఎక్కువ వయస్సుగల (oldest) చెట్టు ——దేశంలో ఉంది.

9. భారతదేశపు భూమిమీద 1579 లో అడుగుపెట్టిన తొలి ఆంగ్లేయుడు——

10. 'జ్ఞాన సూర్యోదయం' గ్రంథకర్త——

# యువ
## క్విజ్ కూపన్ - సెప్టెంబర్ '77
## సమాధానాలు

1- ☐ 2- ☐ 3- ☐ 4- ☐ 5- ☐

6............ 7............ 8............

9............ 10............

పేరు : ____________

అడ్రసు: ____________

____________

____________